కాలి నడకన

# శ్రీకైలాస మానస సరోవర యాత్ర

సంత్ స్వామి వేదానంద సరస్వతి



**వేదానంద చారిటబుల్ ట్రస్ట్** (రిజిష్టర్)

ప్లాట్ నెం. 99, శ్రీ వేంకటేశ్వరకాలనీ,

నాగారం, హైద్రాబాద్ - 500 062

Kaalinadakana

# SRI KAILASA MAANASA SAROVARA YAATHRA

by

Sant Swamy Vedananda Sarawathi

Published in 2005



First Edition - 1000 Copies

For Copies :

**VEDANANDA CHARITABLE TRUST**

Plot No. 99, Sri Venkateswara Colony,

Nagaram, Keesara Mandal,

Hyderabad - 500 062. A.P.

**Phone : 040 27135589, 27120685.**

**Editor**

OM SAI RAM - Spiritual Monthly Magazine

1-7-189, Kamala Nagar, ECIL 'X' Roads,

Hyderabad - 500 062. A.P.

**Price : Rs. 100-00**

Printed at :

**Sai Likhitha Printers**

6-2-959, D.B. Hindi Prachar Sabha Complex,

Khairatabad, Hyderabad - 500 004.

Phone : 040 55365979.

# మా అదృష్టం !

**'సద్గురు కృప వుంటే అన్నీ ఉన్నట్లే!'** ఇది మా సత్సంగ గురువులు **శ్రీ వేదానంద స్వామీజీ** గారి మాట.

వారు ఎందరో మహాత్ములు, బాబాజీలు, అవధూతల ఆశీర్వాదం పొంది అనూహ్యమైన, అందరికీ సాధ్యం కాని **శ్రీ కైలాస మానస సరోవర యాత్ర**ను కాలినడకన, ఒంటరిగా రెండుసార్లు పూర్తి చేసుకుని రావటం మా దృష్టిలో అద్భుతం !

ఆ అద్భుత యాత్రకు, అడుగు అడుగులో వారు పొందిన అనుభవాలకు అక్షర రూపం ఇచ్చి 'ఓమ్ సాయిరామ్' శీల నిర్మాణ ఆధ్యాత్మిక మాసపత్రిక ద్వారా రెండు సంవత్సరాలకు పైగా ధారావాహికంగా అందించారు శ్రీ స్వామిజీ. ఆ విశేషాలనన్నిటినీ ఒక పుస్తకంగా పాఠకులకు అందించాలన్న మా కోరికను వారు మన్నించి, వారి జన్మదినోత్సవం సందర్భంగా ఆవిష్కరించుకునే అవకాశం మాకు అందించటం మా జన్మధన్యంగా భావిస్తున్నాము.

ఈ పుస్తక ఆవిష్కరణకు ఎందరో హార్దికంగా, ఆర్థికంగా సహకరించారు. వారికి సద్గురు కృప లభించాలని ప్రార్థిస్తున్నాము.

ఎంతో ఓర్పుతో, శ్రద్ధతో ప్రూఫ్ రీడింగ్ చేసిన శ్రీ ఎన్.వి. సుబ్బారావు, మాతా వేద ప్రియగారికి,

డి.టి.పి. చేసిన జి.వి. గ్రాఫిక్స్, కృష్ణమూర్తిగారికి,

తక్కువ సమయంలో సమర్థవంతంగా, ఆకర్షణీయంగా ముద్రించి ఇచ్చిన సాయి లిఖిత ప్రింటర్స్ అధినేతకు, సిబ్బందికి,

పేరు పేరునా మా కృతజ్ఞతలు !

ఈ గ్రంథం విషయంలో మీ సలహాలు, సూచనలు తెలిపినట్లయితే మలి ముద్రణలో పొరపాట్లను సరిదిద్దుకొనగలము.

**- వేదానంద చారిటబుల్ ట్రస్ట్**
మానవతా, సత్సంగ, సేవా సంస్థ

ప్లాట్ నెం. 99, శ్రీ వేంకటేశ్వర కాలనీ,
నాగారం, కీసర మండలం,
హైద్రాబాద్ - 500 062. ఆం.ప్ర.
ఫోన్ : 040 27135589

# అత్యంత పుణ్యప్రదం !



ఓంకార రూపాయా బ్రహ్మవిష్ణు శివాత్మనే,
వల్లభాపుర నిలయాయ-దత్తాత్రేయాయ నమః ॥

శిరిడీపుర వాసినే భక్తవత్సలనే
అవధూత దిగంబరాయ సాయినాథాయ నమః
జై గురుదత్త ! జై గురుదత్త ! జై గురుదత్త !

ధార్మికులారా !

కైలాస మానస సరోవర యాత్ర ఈ ఆధునిక కాలంలో అనేక రవాణా సౌకర్యాలతో సులభవంతమైన పురాతన సాంప్రదాయాలను అనుసరించి ఇంకా అనేకమంది భక్తులు, గురువులు, సాధువులు, సంత్‌లు, సద్గురు మహాత్ములు పాదయాత్రతోనే శ్రీ కైలాస మానస సరోవర యాత్ర చేసి, తాము తరిస్తూ, తమను నమ్ముకున్న వారిని కూడా తరింపజేస్తున్నారు. ఈ కోవలోనే మా **నిరంజన సాంప్రదాయ సన్యాసి వేదానంద సరస్వతి,** రెండు సార్లు ఈ యాత్రని కాలినడకన పూర్తి చేశారు. అందులో విశేషం ఏమిటంటే మొదటసారి **'అలక్ నిరంజన్'**, 'ఏకో నారాయణః' అని, తనను తాను నమ్ముకుని, గురువులను నమ్ముకుని మహాత్ములయందు విశ్వాసం కలిగి, శారీరకంగా తాను ఒక్కడే అయినా, మానసికంగా తనవెంట గురువుల ఆశీర్వచనం ఉందని, భక్తుల యొక్క సంకల్పం ఉందని, ప్రేమ వుందని, ఈ రెండింటిని కలుపుకుని, తాను ఒక్కడే అయినా అనేక మందితో చేసిన విధంగా, నిర్భయంగా, కైలా సమానస సరోవరయాత్ర చేసి వచ్చారు.

ఆ యాత్రా విషయాలను, తన పత్రిక 'ఓమ్ సాయిరామ్' ద్వారా, తాను అనుభవాలు అన్నింటిని కూడా క్రోడీకరించి జనసమూగ్రహానికి శ్రీ కైలాస మానస సరోవర యాత్రను మానసికంగా దర్శింపచేశారు. ఒక్కసారి యాత్ర చేసి వస్తేనే చాలు అనుకుంటారు. కానీ మా వేదానందలు రెండవసారి కూడా, ద్వితీయ విఘ్నము లేకుండా, కైలాస మానస సరోవర యాత్ర చేసి వచ్చారు.

మానస సరోవరం! ఇది ఒక విశేషమైన సరోవరం. కైలాస పర్వత స్థాణువులలో ఒకనాడు విహరిస్తున్నటువంటి చతుర్ముఖి అయిన బ్రహ్మకు మనో ఉల్లాసం కలిగి, ఈ స్థాణువులలో ఒక సరస్సు ఉంటే బాగుంటుందని మనో సంకల్పం చేస్తే, ఆ తక్షణమే ఏర్పడినటువంటిదే మానస సరోవరం. అందులో రాజహంసలు విహారం చేస్తాయని, దేవతలు అందరూ కూడా, బ్రహ్మ సృష్టించినటువంటి ఆ సరస్సులో స్నానము చేసి తరిస్తూ ఉంటారని, దేవకన్యలు, దేవలోకవాసులు, మునులు, మహాత్ములు, అవధూతలు, దిగంబరులు అందరూ కూడా ఆ సరస్సుకు వస్తూ వుంటారని ప్రసిద్ధి. ఈ వేళ కూడా వాళ్ళు వస్తూ వెళ్తున్నారని అనుభవాల ద్వారా తెలుస్తూ వుంది. అలాంటి దివ్యమైనటువంటి సరస్సు దర్శనం ప్రతి హిందువుకు, ప్రతి భారతీయునికి కూడా అత్యంత పుణ్య ప్రధం. జన్మ జన్మల యొక్క కర్మలు తొలగిపోవటానికి కారణమవుతున్నాయి.

హిమవంతమైనటువంటి నగరం పార్వతీ పరమేశ్వరుల యొక్క నివాసం. యక్ష కిన్నెరులు అందరూ కూడా నివాసము చేసేటటువంటి ఆ ప్రదేశంలో అడుగు అడుగునా ఎన్నో పుణ్యక్షేత్రాలు, ఎందరో మహాత్ములు, దిగంబరులు, అవధూతలు, జటాధరులు, హంసలు-పరమహంసలు, ఘోరఅగోరీలు, చిత్ర విచిత్రమైనటువంటి మహాత్ములు, సాధనాపరులు ప్రత్యక్షంగా, పరోక్షంగా అదృశ్యంగా ఆ హిమపర్వతం మీద నిత్యమూ, నివాసము చేస్తారు. వాళ్ళందరి యొక్క శరీర స్పర్శతో పునీతమైనటువంటి ఆ ప్రాంతములోకి మా వేదానందుడు వెళ్ళి, ఆ ప్రదేశములో కాలుపెట్టి, ఆ మహాత్ముల యొక్క స్పర్శను, వారి యొక్క అనుగ్రహాన్ని తాను పొంది, తనను విశ్వసించునటువంటి శిష్యులందరికీ కూడా అందించటానికి చేసినటువంటి సాహసయాత్ర **శ్రీ కైలాస మానస సరోవర యాత్ర.**

కైలాసం నిత్యనూతనత్వము! కైవల్యానికి మూలం కైలాస దర్శనం! ఆ కైలాసములో శివుడు నిత్యము విరాజమానుడై వుంటాడు. శివుడు ఒక్కడే లయకారుడు. మన జీవితం ప్రారంభమై లయం కావాలి. జీవిత ప్రారంభము. ఒక లక్ష్యమైతే, లయం కావటం పరమార్థము. ఎవరు ఎవరితో లయం కావాలంటే, ఆత్మ పరమాత్మతో లయం కావాలి. జీవుడు పరమాత్మలో ఐక్యం అయిపోవాలి. అలా లయం కావటం కోసం, ఆ లయతత్వాన్ని ప్రబోధించుకోవటం కోసం, నిత్యము భస్మాంగధారి అయినటువంటి శిష్యుడు విరాగియై, యోగి తత్వాన్ని ప్రబోధం చేస్తూ మహాయోగియై, గురువై, దక్షిణామూర్తియై ప్రబోధం చేస్తూ, జ్ఞాన ప్రబోధం చేస్తూ, మార్గ ప్రబోధం చేస్తూ, సాధకుల్ని ఆ లయతత్వం వైపు ఆకర్షించటంవంటి ఒక మహా సంకల్ప పీఠమే కైలాసము. అక్కడ నుంచి జరిగినటువంటి సంకల్పమే జగద్వ్యాపకముగా యోగులు, మునులు, అందరూ కూడా, ఆత్మ పరమాత్మ లయవిధానములో యోగాన్ని అభ్యసిస్తూ, సాధన చేస్తూ జీవిస్తూ ఉంటారు. అలాంటి క్షేత్రము, మూల స్థానానికి తాను వెళ్ళి, ఆ శక్తిని కూడా జతపరచుకుని, తన బుద్ధిని, తనశక్తిని ఉన్నదానికంటే ద్విగుణీకృతం చేసుకుని వచ్చినటువంటి మన వేదానంద సరస్వతికి అభినందనలు, ఆశీర్వచనాలు ! ఆయన, ఆయన శిష్యపరంపర ఇలాగే దిగ్విజయాలు చేస్తూ, యోగ తత్వం వైపు లయం అవుతూ, పరమాత్మ వైపు ప్రయాణం చేస్తూ, తనతోపాటు అందరినీ కూడా ప్రయాణం చేయిస్తూ, ఆయన ఒక ఆధ్యాత్మిక మహాజ్యోతిగా మారాలని ఆశీర్వచనం చేస్తున్నాను.

ఆ యాత్ర సంబంధమైనటువంటి విషయాలను క్రోడీకరించిన పుస్తకం విడుదల అవుతోంది. అది అందరికి, అందరిళ్ళకీ చేరి, అందరి హృదయాలకూ చేరి, ఈ యాత్రా పుస్తకం చదువుతూ, మానసిక దర్శనం చేస్తూ, సంకల్ప సిద్ధులై మీరు కూడా యాత్రా పురోగగాములు అవుదురు గాక !

జై గురుదత్త ! సద్గురుమహరాజ్ కీ జై !!

– స్వామి విఠలానంద సరస్వతి మహరాజ్ (విఠల్ బాబాజీ)

అధ్యక్షులు, వ్యవస్థాపకులు

జగద్గురు శ్రీ దత్తాత్రేయ స్వామి మహా సంస్థాన పీఠము శ్రీ క్షేత్ర శ్రీవల్లభాపురము,

పసుపల గ్రామము మక్తల్ మండలం మహబూబ్‌నగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

# దైవదత్త వరం !

శ్లో॥ "నిత్యానంద రసాలయం, సురముని స్వాంతాంబు జాతాశ్రయం,
స్వచ్ఛం, సద్విజసేవితం, కలుషహృత్, సద్వాసనా విష్కృతమ్
శంభుధ్యాన సరోవరం! వ్రజ! మనోవం సావతంస, స్థిరం,
కిం? వృథాశ్రయ పల్వల భ్రమణ సంజాత శ్రమం ప్రావ్యసి?"



ఈ శ్లోకం ఆది శంకరాచార్యుల వారి "శివానంద లహరి"లోనిది. ఇది ఎప్పుడు మననం చేసుకుంటున్నా, నా మనసు మానస సరోవర ప్రాంతానికి రెక్కలు గట్టుకుని, హంసలా ఎగిరిపోతుంది. ఆ మానస సరోవర దివ్య దృశ్యాలను - ఎవరెవరో, మానస సరోవర పరిక్రమణ చేసి వచ్చిన ధన్యులు చెప్పినవి ఊహా చిత్రాలుగా చూచి ఆనందిస్తుంది! ఆది శంకరాచార్యులవారు ఆ ఒక్క శ్లోకంతో "శంభుధ్యాన సరోవరం" అనే మానస సరోవరాన్ని మనందరి కళ్ల ముందు, మనో నేత్రాల ముందు ఒక మహత్తర దృశ్య మాలికలా ఆవిష్కరింపజేశారు.

ఈనాడూ ఎందరో మానస సరోవర పరిక్రమణకు వెళ్లి వస్తున్నారు. దృఢమైన ఆరోగ్యం, వైద్య పరీక్షలలో వారా పరిక్రమణకు అర్హులని నిర్ణయించబడటం, ఆ తర్వాత సుమారు ఒక లక్షన్నర రూపాయల వరకూ ఖర్చు పెట్టుకొనగల స్తోమత వున్నవారు వెళ్లివస్తున్నారు.

స్వామీ, వేదానంద సరస్వతీ స్వామీజీ, మానస సరోవర పరిక్రమణ, కాలి నడకన చేసివచ్చి, అడుగడుగునా తాము పొందిన మహత్తర అనుభూతులనూ, మహోన్నత అనుభవాలనూ నాతో చెప్పుకొచ్చారు (కొన్నిటిని). అది విన్న నేను "స్వామీ! మీరు పొందిన ఈ మహత్తర అనుభవాన్ని - పాఠకలోకానికి అందించండి. ఎందరో నా బోటి వారు, ఈ జన్మలో మానస సరోవర యాత్ర చేయాలని ఆశ, ఆకాంక్ష వున్న, మీరిన వయస్సు, అనారోగ్యం దృష్ట్యా చేయలేకపోయినవారు, కనీసం మీ ఈ అనుభవాలనూ, అనుభూతులనూ చదివి - ఆ యాత్ర మానసికంగా చేయగలుగుతారు" అన్నాను. అందుకాయన ఏమనుకున్నారో, వారు నడుపుతున్న "ఓం సాయిరామ్" పత్రికలో నెల నెలా తమ మానస సరోవర యాత్ర వివరాలు, వివరంగా కళ్లకు కట్టినట్లు వర్ణించారు. అదే ప్రస్తుతం పుస్తక రూపంలో వచ్చింది. ఆ మహత్తర గ్రంథానికి నన్ను "ముందు మాట" వ్రాయవలసిందిగా కోరారు. ఇది నాకు కార్తీక మాసంలో, జారిపడి, ఎడమ తొడ ఎముక విరిగి, హైదరాబాద్‌లోని "పొలోమి" హాస్పిటల్‌లో ఆపరేషన్, చికిత్స పొందుతున్న సమయంలో, ఈశ్వరుడు స్వయంగా వేదానంద సరస్వతి స్వామీజి రూపంలో వచ్చి,

ప్రసాదించిన అపురూపమైన అదృష్టం, అపార కరుణ అనిపించింది.

శ్రీ వేదానంద సరస్వతీ స్వామీజీ, నాకు, నా భర్తగారు శ్రీ పవని శ్రీధరరావుగారికీ, వారు యువకునిగా వుండగా, సైకిలు తొక్కుకుంటూ మా గ్రామానికి (మొగలిచెర్ల, కందుకూరు తాలూకా, ప్రకాశం జిల్లా) వస్తూ వారి దారి మార్గంలో మా గృహంలో రెండు మూడు గంటలు వుండి - ఆ సమయానికి మా ఇంట్లో, పప్పో, పచ్చడో, చారో, ఏది వుంటే అది వేసి నేను భోజనం పెడితే, ఆప్యాయతతో భుజించి, మా దంపతులతో కాస్సేపు మాట్లాడి వెళ్లేవారు. అప్పట్లో ఆ యువకుడు - మా ఇంటికి వచ్చే ఎందరో అతిధులతో ఒకరు అని భావించామేగానీ, భవిష్యత్తులో అతడే - వేదానంద సరస్వతీ స్వామీజీగా మారి, ఎందరో వేలాది భక్తులకు సాయితత్వ ప్రచారంచేసి, తరింపజేస్తారనిగానీ, "ఓం సాయిరాం" అధ్యాత్మిక మాస పత్రికతో వేలాది పాఠకులకు జ్ఞాన మార్గంవైపు పయనింపజేస్తారనిగానీ, సాయిబాబా గుడిలో, పేదలకు అన్నదాన కార్యక్రమాలు నిర్వహించి, తద్వారా ఇళ్లలో చేయలేని అన్నదానాన్ని సాయిపరంగా చేయించే అదృష్టాన్ని, అవకాశాన్నీ పుణ్యాన్ని ఎందరో దాతలకు ప్రసాదిస్తారనిగానీ, కాలి నడకన మానస సరోవర పరిక్రమణచేసి వచ్చి తమ మహాద్భుత అనుభూతులను భక్తులకు ఒక వరంలా పంచుతారని గానీ, మేము కలలో కూడా ఊహించలేదు.

చాలా ఏళ్ల తర్వాత - తూ॥ గోదావరి జిల్లా కాకినాడ రూరల్ । "కొవ్వాడ"లో షిర్డి సాయిబాబా మందిర వ్యవస్థాపకులూ, సాయిబాబా చరిత్ర నిత్య పారాయణ గురువూ అయిన ఆచార్య తిరుమల శెట్టి సుబ్బారావుగారు తమ 150వ పారాయణ సందర్భంగా ఘనమైన ఉత్సవం 11 రోజుల పాటు నిర్వహించారు. (2001 సం॥ డిసెంబరు 21 నుండి 2002 జనవరి 1వ తేదీ వరకూ) ఆ కార్యక్రమంలో భాగంగా, మా దంపతులను ముఖ్య అతిధులుగా ఆహ్వానించారు. మేము వెళ్లాము. ఎందరో మహనీయుల ప్రవచనాలు వినే అదృష్టాన్ని పొందాము. మాకు చేతనైన నాలుగు మాటలు మేము చెప్పాము. ఆ సందర్భంగా ఒక రోజు ఒక స్వామీజీ, మా దంపతుల వద్దకు వచ్చి, "అమ్మా నేను గుర్తున్నానా?" అంటూ పరిచయం చేసుకున్నారు. పదునైన చూపులు, విశ్వాంతరాళాలను పరిశోధించగల ప్రశాంతమైన పదునైన చూపులతో, ప్రశాంత వదనంతో, కాషాయ వస్త్రాలతో ఆజానుబాహంవుగా, కాషాయ అంగరఖాలో వున్న ఈ వ్యక్తి ఆనాటి ఆ సైకిలు కుర్రాడు అంటే మా కళ్లని మేము నమ్మలేకపోయాము. వేదానంద స్వామీజీగా సన్యసించిన ఈ వ్యక్తిలో దైవత్వం రాశీ భూతమై వుందనిపించింది. తాను ఇలా ఆధ్యాత్మిక మార్గంలో కొనసాగుతున్నట్లు చెప్పాడు. "నాయనా! మహోన్నతమైన దారిని ఎంపిక చేసుకున్నారు. ఆ దారిలోనే నిరాటంకంగా, చిత్తశుద్ధితో మీరు సాగిపోవాలి, మనసా, వాచా, కర్మణా, ఒక తల్లి, తండ్రిగా ఆశీర్వదిస్తున్నాను" అన్నాను ఆనందంతో! అయన ఆనందించి వెళ్లారు. ఆ తర్వాత మరలా తాను కాలనడకన కైలాస మానస సరోవర యాత్ర (2 మార్లు) చేసి వచ్చిన విషయం చెప్పారు.

వేదానంద సరస్వతీ స్వామీజీ కైలాస మానస సరోవర పరిక్రమణ చేశారు. ఎలా? వారికి కార్లు లేవు. వ్యాన్‌లు లేవు. వారి వెంట మందీ మార్బలం తోడుగా లేదు. ఎక్కడికక్కడ

వెచ్చని గుడారాలు (టెంట్లు) వేసి, అమర్చి, నెగడులు వేసి -కమ్మని భోజన పదార్థాలు వండి, వార్చి వడ్డించి పెట్టే పరివారములేదు. అన్నిటికంటే ముఖ్యమైన అర్థబలం - అంటే డబ్బులేదు! మరి ఎలా చేశారు?

దృఢదీక్ష, "నాకు ఆ సాయినాథుడే, ఆ కైలాస ఈశ్వరుడే మార్గదర్శి" అనే దృఢ సంకల్పం - సశరీరంగా వెళతానా? సరే - లేదూ ఆ మార్గంలోనే ఆ స్వామీకే ఈ శరీరం, ప్రాణం తృణ ప్రాయంగా అర్పిస్తాను అనే మొండి భక్తి. మూఢభక్తి. ఇవే ఆయన చెంత వున్న ఆయుధాలూ, పరికరాలూ! షిర్డి సాయి నాథుడు చెప్పే శ్రద్ధ, సబూరికి ప్రతిబింబాలు పైవన్నీ! అంతే సాయినాథుడు ఒక్కరూ తోడు నీడగా, కాలి నడకన బయల్దేరారు! ఎక్కడికక్కడ, డబ్బు పైసాలేని చోట, సాయినాథుడు, కైలాస నాథుడు - ఎవరో ఆగంతకుల ద్వారా, అవసరమైన డబ్బు (చిన్న మొత్తం) దక్షిణగా ఇప్పించి యాత్రను ముందుకు సాగించారు. ఎందరో మహాత్ములు దర్శన భాగ్యం కలగటమేగాక, వారితో వారి చిన్న గుహ - లేక గుడారాలలో వసతి, వారు తినే రొట్టె - లేదా మూలికలు ఆహారంగా ఇచ్చి 'వసతి' బస కల్పించి కాపాడి - ముందు ప్రయాణానికి తగిన ధైర్యాన్ని ఆశీఖ్ఖలను అందించారు. కొందరు సిద్ధ పురుషులు ప్రత్యక్షమై, దృశ్యా దృశ్యంగా అదృశ్యమౌతూ, మార్గం చూపారు. ఒక మహా వృద్ధ యోగిని ఒక గోంఫా"లో దర్శించి - ఆ తల్లి సన్నిధిలో మహా సమాధి స్థితి పొంది, మానస సరోవరంలోని "హంసల జంట" (ఇవి ప్రస్తుతం ఎవరికీ చర్మ చక్షువులకు గోచరించటంలేదంటున్నారు)ను ఉఛ్వాస నిశ్వాస వలయమహత్తర అనుభూతిలో దర్శించి తరించారు. "ఇక ఇదే ఆఖరు శ్వాస - ఇదే ఆఖరు గడియ" అనిపించే ఎన్నో ప్రాణంపోయే పరిస్థితులను ఎదుర్కొన్నారు. అయినాసరే! మరణమో - మానస సరోవర దర్శనమో - ఏదో ఒకటి అయితే అవుగాక! అనే దీక్షతో సురమునిగణ సేవిత - జగన్మాత జగత్పితైన పార్వతీ పరమేశ్వరుల సురగంగతో కూడిన మానస సరోవరం దర్శించి - అందులో అర్ధరాత్రి కొందరు ధన్యులు మాత్రమే చూడగలిగిన - వినగలిగిన మహత్తర వెలుగు ముద్దలు రాలటం. నీళ్ల శబ్దం లాటివి కూడా చూచి - తరించి మరలా కాలినడకన తిరిగి వచ్చారు.

ఇది వ్రాయటానికి ఒక పేజీ చాలు - చెప్పడానికి ఐదు నిముషాలు సమయంచాలు. కానీ - ఒక్కో అనుభూతి, ఒక్కో అనుభవం. వారు పొందినవన్నీ దైవదత్త వరాలు! దేవతలకు తార్కాణాలు! దైవం ఉనికిని చాటిచెప్పే సహజ ఉదాహరణలు. ముందు తరాలవారికి శ్రద్ధ సబూరి లేదా మొక్కవోని ఆత్మవిశ్వాసం, భక్తి, దృఢ దీక్షలకు సాకార శిల్పాలు!

ప్రతి ఒక్కరూ చదవదగిన ఈ మానస సరోవర పరిక్రమణ అనుభవాలను స్వామీజీ - పసిబిడ్డలకు కూడా అర్థమయ్యేంతటి తేలిక భాషలో వ్రాశారు.

ఆస్తిక సోదర సోదరీ మణులారా! ఈ పుస్తకం "కొని" చదవండి.

ఒక ఛాట్ మసాలా షాపు దగ్గరికి వెళితే, ఐదు నిమిషాలలో వంద రూపాయలు ఖర్చయిపోయి కేవలం నోటి జిహ్వచాపల్యపు ఆహారం - ఆ తర్వాత కొద్దిపాటి అనారోగ్యంతో ఒక వంద ఖర్చయిపోతాయి. ఒక సినిమాకు ఒక స్నేహితుడితో - లేదా

స్నేహితురాలితో వెళితే - ఒక వంద మూడు గంటలలో కళ్లు తినేస్తాయి!

ఒక గ్రంథంలో కోట్ల విలువచేసే సద్గురు బోధల లాటి సన్నివేశాలు వుంటాయి సుమండీ!

కానీ స్వామీజీ వారి 'కాలినడకన మానస సరోవర యాత్ర' - మనసు పెట్టి చదివితే - అణువణువులో, అక్షరం అక్షరంలో వారి అకుంఠితదీక్ష. పైసా లేకున్నా, ఒక మహోన్నత పరిక్రమణకు దైవం ఎన్ని రూపాలలో, ఎన్ని నామాలతో విశ్వరూపం ధరించి వారి వెంట వుండి నడిపించిందీ అవగతమై-

మన జీవితాలలో మనం కూడా, ఏ కష్టతరమైన కార్యక్రమమైనా అలా, దైవ కరుణతో దృఢ దీక్షతో సాధించుకొనవచ్చనే అంతర్గత 'గురుబోధ' లభిస్తుంది. ఈ అవకాశాన్ని, అదృష్టాన్ని, అపురూప కరుణనూ, నాకు ప్రసాదించిన, "వేదానంద సరస్వతీ స్వామీజీనీ - వారు నన్ను మాతృశ్రీగా భావించిన అదృష్టంతో - పుత్ర వాత్సల్యంతో మనసారా ఆశీర్వదిస్తూ, వారు మరొక మారు తలపెట్టిన మానస సరోవర యాత్ర దిగ్విజయంగా ముగించుకొని రావాలనీ, వారు ఇలాగే, ప్రలోభరహితంగా, గారడీలకు అతీతంగా, ఇలాగే ఎందరో ముముక్షువులకు మార్గదర్శి అయిన సద్గురువుగా, కలకాలం నిలిచిపోవాలని, వారి బోధలూ, దాన ధర్మాల కార్యక్రమాలూ, సత్సంగాల ద్వారా, ఎందరో ఆధ్యాత్మిక మార్గంలో పయనించాలనీ - ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ, ఆశీర్వదిస్తూ - శలవు తీసుకుంటున్నాను.

ఇట్లు,

23.11.2004. మీ అమ్మగారు

పొలోమి హాస్పిటల్, హైదరాబాద్. 'పవని నిర్మల ప్రభావతి'

# 'దైవ భక్తికి నిదర్శనం'

శ్రీ వేదానంద సరస్వతి కాలినడకన చేసిన మానస సరోవర యాత్రని 'ఓం సాయిరాం పత్రికలో ధారావాహికంగా చదువుతున్నాను. వారి అనుభవాలు, అనుభూతులు చాలా ఉత్కంఠను కలిగించేవిగా వున్నాయి.

ఆధ్యాత్మిక జీవితంలోకి అడుగుపెట్టిన ప్రతీ హిందువు, జీవితంలో ఒకసారైనా మానస సరోవర కైలాస యాత్రలు చేయలనుకుంటాడు. అందుకు అధిక ఖర్చు, అధిక శారీరక శ్రమ, అధిక సమయం అవసరం అని తెలుసుకుని కొద్దిగా వెనుకంజ వేస్తాడు. లక్షలో ఏ ఒక్కరో ఈ యాత్ర చేస్తారు. తిరిగి వచ్చాక తాము కుదుపుల రోడ్లో, లేక్‌లో పడ్డ బాధలు, ఆహారం విషయంలో ఎదుర్కొన్న అసౌకర్యాలు లాంటివి ఏకరువు పెడతారు.

అయితే శ్రీ వేదానందజీ మహరాజ్ నేపాల్ నించి, కైలాస పర్వతం, కాలి నడకన వెళ్ళి రావడం అరుదైన విషయం. మానస సరోవరానికి మామూలు సౌకర్యాలతో వెళ్ళి వచ్చే వారిలో ఏ లక్షమందిలోనో ఒకరు కాలినడకన వెళ్ళొస్తారు. తమ ఆహారం తామే మోసుకుంటూ, భాష తెలీని విదేశీ గడ్డమీద, మంచుగడ్డల మధ్య, దారి చెప్పే వారే లేక అవస్థ పడుతూ వెళ్ళి రావడం, అలాంటి వారి అచంచల దైవభక్తికి నిదర్శనంగా భావించవచ్చు.

అందులో సహచరులతోకాక, ఒంటరిగా ఆ యాత్ర చేయడం మరింత ప్రమాదకరం. శ్రీ తపోవన్ మహారాజ్ (కేరళ రాష్ట్రీయుడు) కాలినడకన ఒంటరిగా చేసిన కైలాస యాత్రని గుర్తు తెచ్చేలా ఉంటుంది, సంత్ వేదానందజీ అనుభవం! ఒకసారికాక ఇలా రెండుసార్లు ఆయన కైలాస యాత్రని కాలినడకన చేశారు. మూడోసారి కూడా వెళ్లే ఉద్దేశం ఉందని తెలుస్తోంది. పాఠకునికి హిమాలయాల మధ్య ఉన్న అనుభూతిని కలిగించేలా సాగే ఆయన ధారావాహికం అందరికీ నచ్చుతుందని, వారి మూడవ యాత్ర కూడా ఆ పరమ శివుడు సఫలీకృతం చేస్తాడని ఆశిస్తూ.....

తేది : 1-12-04.
హైద్రాబాద్

- మల్లాది వెంకట కృష్ణమూర్తి
ఆంధ్రుల ఆహ్లాద, ఆధ్యాత్మిక రచయిత



# అవ్యక్త వ్యక్తం

నాకు తెలిసిన గురువులు, స్వాములు, బాబాలు, యోగులు వేల సంఖ్యలోనే వున్నారు. 1986లో షిర్డిసాయిబాబా మహత్యం సినిమాను తెలుగు జాతికి అందించిన రచయితగా నేను నా మాటలు చెప్పటం లేదు. 1930 సంవత్సరానికి ముందుగానే సాయి భక్తులుగా వుండి సాయిబాబాను ప్రత్యక్షంగా దర్శించిన మాతాతల, తండ్రుల వారసునిగా నేను ఒక్కాణించటం లేదు. ఒక సాధారణ "శర్మాజీ" అసాధారణ స్వామిజీగా మారిన పరిణామక్రమం ప్రతిక్షణం పరిశీలిస్తూ వస్తున్న ఆ స్నేహితుని ఆత్మబంధువుగా అభిభాషిస్తున్నాను. ఒకటవ తరగతి నుంచి కష్టపడి చదువుకొని అంచలంచెలుగా అత్యున్నత సాధనానికి చేరుకునే విద్యార్థి లాగానే "శర్మాజీ" స్వామిజీగా మారారు. అతిశయోక్తి అనిపించినా సాయిబాబాకు, శర్మాజీ స్వామిజీకి జీవితగణకంలో జీవన గమనంలో చాలా పోలికలున్నాయి. ఆ బాబాను ఒకప్పుడు అందరూ పిచ్చివాడంటే ఈ స్వామిజీని అందరూ ఏమైపోతాడో అన్నారు. ఆ స్వామి షిరిడీలో వైద్యుడిగా ఎదిగినట్లే ఈ స్వామి జర్నలిస్టుగా, సామాజిక వైద్యం చాలా చేశారు. ఆ బాబా ప్రతినిత్యం అన్నదానం చేసిన దాత, ఈ బాబా నాలాంటి వాళ్ళకు (ముఖ్యంగా నాకు) అవసరమైనప్పుడు అన్నం పెట్టి ఆదరించి నా బ్రతుకును వెలిగించిన జీవన ప్రదాత. ఆబాబా సర్వభక్తుల నీరాజనాలు అందుకున్నట్లే మనస్వామి అంచలంచలుగా ఆధ్యాత్మిక శిఖరాన్ని చేరుకొని, మనలో ఒకడిగా వుంటూ ప్రత్యక్ష దైవంగా భాసిల్లుతున్నారు. ఇది నా మనసుకు తోచిన సత్యం మాత్రమే కాదు కనిపించే నిజం కూడా! లేకపోతే వేలకొలది అన్నదానాలు, వందల కొలదీ యజ్ఞయాగాదులు లక్షల ప్రజలకు జపనామ, స్మరణలు కోట్లాది మందిలో ఒకరు కూడా చేయలేని కైలాస శిఖర దర్శనాలు అదీ కాలినడకన కైలాస యాత్ర, ఒకసారి కాదు రెండుసార్లు. జనగణ సమూహంతో కాదు ఒంటరిగా, ధన ఆధునిక ప్రయాణ ఏర్పాట్లతో కాదు. తరువాత అడుగు ఎటు వేయ్యాలో తెలియని స్థితిలో లక్షలు లేకపోయినా లక్ష్యంతో సాగిన పరిస్థితిలో మానస సరోవర దర్శనం, అక్కడ స్నానమాచరించడం ద్విగ్విజయంగా తిరిగి రావడం ఇదంతా మహాత్ములకే సాధ్యం. అటువంటి మహత్మ్యం కలిగిన మహనీయుడు మనమధ్య మన గురువుగా ఉండడం మన సుకృతం. ఆఖరి మాట ఉత్తుంగ గంగా ప్రవాహానికి మించిన భక్తి సంద్రం మనముందు నడిచే కోవెలగా తిరుగాడుతోంది. మునిగి తేలండి, ముక్తి పొందండి, రేపటి చరిత్రలో మరో బాబాను ప్రత్యక్షంగా చూశాము అని మీ ముందుతరాల వాళ్ళు తర తరాలుగా చెప్పుకొని తరియించే భాగ్యాన్ని విడనాడుకోకండి. సంత్ స్వామి వేదానంత సరస్వతి సత్యాన్వేషి, నిత్యాన్వేషి, దేవుడే మనిషి రూపంలో ఉదయించిన మహా మనిషి.

జై వేదానంద మహరాజ్ కీ

9-12-2004 — తోటపల్లి మధు

హైదరాబాదు. — నటుడు, రచయిత

# లోపలి పేజీల్లో....

## అనుబంధం

# అంకితం



తల్లి, తండ్రీ, గురువు అన్నీ తానై, తన బిడ్డలా, నన్ను సామాన్యుని నుంచి
సంత్ వరకు నడిపించి, ఎందరో యోగుల రూపంలో నాకు తోడుగా ఉండి
శ్రీ కైలాస మానససరోవర యాత్రను కాలినడకన రెండు సార్లు పూర్తిచేసుకునే శక్తిని
ప్రసాదించిన **శ్రీశ్రీశ్రీ సమర్థ సద్గురు సాయినాథ్ మహరాజ్‌కు** సవినయంగా నమస్కరిస్తూ
ఈ గ్రంథాన్ని వారి పాద పద్మాలకు అంకితమిచ్చుకొనుచున్నాను.

**- సంత్ స్వామి వేదానంద**

# నా జన్మ ధన్యం



కైలాస పర్వత దర్శనం
జీవన్ముక్తికి సోపానం!
బ్రహ్మ సంకల్ప
మానస సరోవర స్నానం,
కర్మ రాహిత్యానికి,
దివ్యాత్మజ్ఞానానికి మార్గం!!

కైలాస మానస సరోవర యాత్రా ప్రయాణం వైరాగ్యానికి అడ్డదారి!

వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు మొదలైనవి అందించే ఆనందం, అజ్ఞానదర్శనం, తీవ్రవైరాగ్యం ఈ యాత్రలో అడుగు అడుగులో అనుభవమవుతాయని నేను పొందిన అనుభూతి ద్వారా చెప్పగలుగుతున్నాను.

వందల కిలోమీటర్ల నడకలో, వేల అడుగుల ఎత్తైన కొండలు, ఒక్కొక్కటి దాటుకుంటూ మూడు దేశాల కవతలకు చేరటం మామూలు విషయం కాదు. మన భాష లేదు, మన రూపాయి చెల్లదు. మన ఆహారం చూపుకు కూడా అందదు. ఇవి అలా వుంచితే బయటంతా విపరీతమైన చలి.

నడక-ఆకలి-చలి, కారణాల వల్ల "శరీరం" మొండి కేస్తుంది.

దానికి వంత పలుకుతూ "మనసు" రకరకాల ఆలోచనలను సృష్టించి భయాన్ని కల్పిస్తుంది.

ఆ రెండింటిని తోడు చేసుకుని "బుద్ధి" - "ఎందుకింత కష్టపడటం, వెనకకు వెళ్ళిపోయి వచ్చే సంవత్సరం కొంతమందిని తోడు చేసుకుని రావచ్చుగా! దేవుడు ఎక్కడ లేడు? నీ హైద్రాబాద్‌లో కూడా ఉన్నాడు కదా! వెనకకు వెళ్ళడం మంచిది" వంటి వాక్యాలను చెబుతుంది.

ఎత్తైన, విశాలమైన కొండల మధ్య ఒంటరి ప్రయాణం నాది! తోడుగా నా భాష వచ్చిన, పరిచయమున్న వ్యక్తి ఎవ్వరూ లేకపోవడం వల్ల వింత అనుభవాలు!

అస్సలు, ముందు చూపులేకుండా, అంతటి కఠోరమైన తీవ్రమైన యాత్రకు ఏ నమ్మకంతో ఒంటరిగా ఇంటి నుంచి ప్రయాణం అయ్యాను?

ఎవరు నన్ను అంత ధృఢమైన నిర్ణయంతో ఈ యాత్రకు ప్రేరేపించారు?

తిరిగి వచ్చాక ఆలోచిస్తుంటే ఎంతో వింతగా, ఆశ్చర్యంగా వుంది.

రకరకాల రూపాలతో, నామాలతో పిలవబడుతున్న నిరాకార శక్తి-నాలోని శరీరాన్ని, మనస్సును, బుద్ధిని 'మాయం' చేసి 'అమాయ'కుడిగా మార్చి లేవదీసుకుపోయింది.

సాధు జీవితం లోకి అడుగుపెట్టాక వ్యక్తికి ఈ యాత్ర ముక్తి యాత్ర! తీవ్ర వైరాగ్యానికి సాధన!

దత్త సాంప్రదాయంలోకి నన్ను కలుపుకుని అవధూత మార్గంలో నడిపిస్తున్న నా అధ్యాత్మిక పితామహులు శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతి మహరాజ్ (శ్రీ విఠల్ బాబాజీ) గారి ప్రత్యక్ష, పరోక్ష ప్రేరణ ఈ యాత్ర వెనుక ఎంతో వుంది. వారికి నా కృతజ్ఞతా పూర్వక పాద నమస్కారములు !

పవిత్రమైన కాశిలోని గంగానది ఒడ్డున సమర్థ సద్గురు చరిత్ర యజ్ఞపూర్వక పారాయణ చేసి, నిరాకార శక్తిని, పరిపూర్ణ దత్తాత్రేయ అంశ అయిన శ్రీసాయిబాబాలో చూసుకొని, భోక్తగా ఒక స్వామీజీ (శ్రీ విరజానంద స్వామి) చేతుల మీదుగా ఆశీర్వచనం, దీక్షా స్వీకారం తీసుకొని, 11 మంది ఏకాదశ రుద్రులు వంటి దండి స్వాముల సమక్షంలో ఆశీర్వాదంతో దత్త సాంప్రధాయ దీక్షగా 'వేదానంద సరస్వతి' నామకరణ పొందటం నా ప్రమేయం లేకుండా జరిగిన గురు అనుగ్రహ కార్యం.

ఆ తరువాత నెలా పది రోజులకు ఊహించని విధంగా శ్రీ కైలాస మానససరోవర యాత్రకు నా జ్ఞాన గురువులు శ్రీ స్వామి మేధానందపురి (కైలాశ్ ఆశ్రమం, ఋషీకేశ్) గారి పిలుపు, ప్రోత్సాహం మరువలేనివి. ఏమిచ్చినా వారి ఋణం తీరనిది. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు !

ఎందరో మహాత్ములు, సామాన్యులు ఈ యాత్ర చేసుకున్నారు. లక్షరూపాయలు అవసరమైన యాత్రగా చెప్పారు. కానీ అతి తక్కువ ఖర్చుతో నేను వెళ్ళగలగటం గురు కృప. అంతేకాకుండా ఈ యాత్ర కారణంతో బయలుదేరిన నాకు ఎన్నో అనుభవాలు, జీవితానికి సరికొత్త మలుపులుగా మారిన సంఘటనలు- సందర్భాలు! అందువల్లనే శ్రీ సాయినాధుడు ఒంటరిగా తీసుకు వెళ్ళాడు అనిపిస్తోంది.

## అనుభవాలు

- నాకోరిక అవధూతల దర్శనం. అందువలన దత్త సాంప్రదాయానికి దగ్గరగా వున్న 6 గురు నాగాబాబాలు కనిపించటం, వారితో గడపటం వారి పేర్లు శ్రీ హరిశంకర గిరి నాగా బాబా, శ్రీ మృత్యుంజయ పురి నాగాబాబా, శ్రీ జమునాగిరి నాగాబాబా, శ్రీ కాలుసిద్ధ నాగాబాబా, శ్రీ హరహర కిరాతగిరి నాగాబాబా, అఘోరీ బాబా!



ఓంకార రూపాయా బ్రహ్మవిష్ణు శివాత్మనే,

వల్లభాపుర నిలయాయ-దత్తాత్రేయాయ నమః ॥



శిరిడీపుర వాసినే భక్తవత్సలనే
అవధూత దిగంబరాయ సాయినాథాయ నమః



ఓం గం గణపతియే నమః

నేపాల్ గంజ్ శక్తిపీఠంలోని గణనాథుడు



హిమాలయాల్లోని ఒక గోంపా (గుహ)లో
దర్శనమిచ్చిన హనుమంతుడు



రెండు వేల సంవత్సరాలనాటి హిమాలయ క్రియా యోగి

శ్రీ మహావతార్ బాబాజీ



హిమాలయ యోగులు పూజ్యశ్రీ స్వామి శివానంద సరస్వతి,
పూజ్యశ్రీ స్వామి చిదానంద సరస్వతి



700 సం॥ల వయసుగా చెప్పబడుతున్న

అవధూత శ్రీ హరహర కిరాతగిరి నాగా బాబా

- ఉత్తరాంచల్ అవతల హిమాలయాలలోని శ్రీమహావతార బాబాజీ గారి శిష్యులు 200 సంవత్సరాల క్రితం ఏర్పాటు చేసిన ఆశ్రమానికి తీసుకువెళ్ళి శ్రీ మృత్యుంజయ పురి నాగాబాబా, 'సంత్' గా నన్ను మార్చుట,
- భూతల స్వర్గంగా చెప్పుకునే భారత హిమాలయాలు, నేపాల్, టిబెట్టు, చైనా కొండల దృశ్యాలు కైలాస పర్వత దర్శనం, పరిక్రమ - మానస సరోవర దర్శనం, - పరిక్రమ స్నానం,
- దారిలో ఎందరో మహాత్ముల దర్శనం,
- 700 సంవత్సరాలకు పైగా వయస్సున్న శ్రీ హరహరకిరాతగిరి నాగాబాబాతో వింత అనుభవాలు.

....ఇవన్నీ వివరంగా మన 'ఓమ్ సాయి రామ్' పాఠక దేవుళ్ళతో పంచుకొన్నాను.

ఈ యాత్రకు వెళ్ళకముందు, వెళ్ళి వచ్చాకా చాలా విషయాలను వివిధ గ్రంథాల నుంచి తెలుసుకుని ఈ పుస్తకంలో పొందుపరిచాను. ఆయా గ్రంధకర్తలకు కృతజ్ఞతలు తెలుపుకొనుట నా కనీస బాధ్యతగా భావిస్తున్నాను. రెండవసారి జరుపుకున్న యాత్ర విశేషాలను మలి ముద్రణలో అందించగలనని తెలుపుతున్నాను.

ఈ యాత్రకు ఆర్థికంగా, హార్దికంగా సహాయమందించి, ప్రోత్సహించిన ప్రతి ఒక్కరికీ...,

ఈ యాత్ర కారణంగా రెండు నెలల పాటు పత్రికను అందించలేక పోయినా, సహకరించి మన్నించిన చందా దారులకు,

ఈ పుస్తకాన్ని ఎంతో సమర్ధవంతంగా, శ్రమతో అందరికీ వేదానంద ఛారిటబుల్ ట్రస్ట్ వారికి...

... పేరు పేరునా నా కృతజ్ఞతలు.

**అందరికీ ఆ సర్వేశ్వరుని అనుగ్రహం లభించుగాక !**

16-12-2005

**- సంత్ స్వామి వేదానంద సరస్వతి**

హైదరాబాద్



మహో పవిత్ర కైలాస పర్వత రాజం

## మా పిన తండ్రిగారు ప్రేరణ !

చెప్పటం వేరు - చెయ్యటం వేరు అన్నట్లుగా వుంటే, కోరుకోవటం వేరు - పొందటం వేరు అన్నట్లుగా మారుతుంది జీవితం.

మోక్షము - ముక్తి - సద్గతి.. వంటి పదాలను తరచూ వింటుంటాము. వాటిని అందుకోవటం, అనుభవించటం, అన్నవి జన్మ జన్మాంతర సాధన వల్లనే సాధ్యం. అటువంటి సాధనకు ఎన్నో మార్గాలు ఉన్నాయి. వాటిలో అతిముఖ్యమైనవి పాదయాత్ర, పుణ్యక్షేత్రం, దివ్యక్షేత్ర దర్శనం-నివాసం అని నాకు అనిపిస్తుంది.

గురు కృపతో మాత్రమే ప్రాపంచిక, ఆధ్యాత్మిక జ్ఞానం లభిస్తుంది. కనీస జ్ఞానం లేకుండా మనం చర్యలు - సపర్యలు చేసినా, సరైన ఫలితం పొందలేము. కనుక గురు కృపతో పొందిన జ్ఞానం, విషయావగాహనతో ఒక యాత్రకు మనం సంకల్పిస్తే మనకు ఎన్నో విషయాలు అవగాహనకు వస్తాయి. ఇంటి నుంచి బయలుదేరినది మొదలు, తిరిగి వచ్చేదాకా అడుగు అడుగులో, అనుక్షణం మనలో జరిగే మానసిక, శారీరక, బుద్ధిపరమైన మార్పులు-చేర్పులు మనం గమనించి గుర్తించగలిగితే, అదే అనంతమైన జ్ఞానం అవుతుంది. అలా గుర్తించిన విషయాలను ఒక గురువుయొక్క సన్నిధిలో విచారణ చేస్తే, నిజమైన వివేకాన్ని పొందగలము. అంతేకాని ఏదో 'పిక్నిక్' లాగ, కొన్ని టెక్నిక్కులను (అవసరానికి మించిన సదుపాయాలను, సౌకర్యాలను) ఆశ్రయించి చేసే యాత్రలు అంతగా ప్రభావితం చెయ్యవు. శ్రీసాయినాథుడు చెప్పినట్లు 'శ్రద్ధ-ఓర్పు' లేనిదే ఏ కార్యమూ ఫలించదు.

ఎవరైనా చనిపోతే, వారి గురించి, ప్రస్తావన వచ్చినప్పుడు 'కైలాసా'నికి పోయాడు అని అనటం వింటుంటాము. ఈ కైలాస మానస సరోవర యాత్ర కాలినడకన మరణంతో సమానం. మరణానికి సిద్ధపడిన వారు మాత్రమే సంకల్పించుకోవాలి.

నేను ఈ యాత్ర గురించి సవివరంగా రాయదలచు కున్నాను.

ఏదో....హైదరాబాద్‌లో రైలెక్కాను, ఢిల్లీలో రైలు మారాను. ఋషీకేశ్ చేరాను-నేపాల్ వెళ్ళాను-ధార్చులా చేరాను- నేపాల్ కొండలు దాటి టిబెట్ చేరాను తాక్లాకోట్ నుంచి కైలాస పర్వతం చేరాను. మానస సరోవరంలో మునిగాను-తిరిగి నెలన్నర రోజులకు హైద్రాబాద్ వచ్చాను... ఇలా రాసేస్తే నా యాత్ర విశేషాలు అయిపోయినట్లే!

అలాకుండా యాత్రకు ముందు, యాత్రా సమయంలో దారి పొడుగునా జరిగిన అనుభవాలు, కలిసిన వ్యక్తులు, పొందిన అనుభూతులు సవివరంగా రాయాలన్నదే నా ఆలోచన. ఆయా ప్రదేశాల విశిష్టతను కూడా సేకరించాను కనుక దానిని కూడా మధ్యమధ్యలో పొందుపరచగలను.

ఇదేదో నా గొప్పతనం చెప్పుకునేందుకు కాదు. 'నేను' అన్నది పోయి చాలా సంవత్సరాలయింది. కొన్ని సంవత్స రాలుగా 'శర్మాజీ'గా చలామణి అయిన వ్యక్తిని శ్రీ విఠల్‌బాబాగారి ఆశీస్సులతో, వారు అందించిన దత్తదీక్ష ప్రేరణతో 'ఓమ్‌సాయిరామ్ శర్మాజీ'గా మారాను. ఆ తరువాత జ్ఞాన గురువులు శ్రీ అచలానంద సరస్వతిగారి సహాయ, సహకారాలు, అనుగ్రహంతో సన్యాస దీక్షకు తొలిమెట్టుగా 'బ్రహ్మచర్యం' షిర్డిలో తీసుకుని 'వేద చైతన్య'గా మరో జన్మను పొందాను. ఆ తరువాత కాశీక్షేత్రంలో ఊహించని విధంగా , సన్యాస దీక్ష స్వీకరించి 'వేదానంద సరస్వతి'గా జన్మను పొందాను. నెలన్నర కూడా గడవకుండా ఈశ్వరుని కృపతో పిలుపు అందుకుని అతి కఠినమూ, కష్టము అయిన కైలాస మానస సరోవర భూమిమీద చరించి, ధ్యానించి -మరణించి-తిరిగి జన్మించి వచ్చిన పునర్జన్మ ఈ ప్రస్తుత నా "సంత్ స్వామి వేదానంద సరస్వతి" జీవితం. ఇలా జీవిత మండంపం మీద అడుగు అడుగులో నాకు లభించిన సద్గురు స్వరూపుల కృపతో పొందిన అనుభవ జ్ఞానం ద్వారా అజ్ఞానానికి మరణాన్ని, ఒక సరిక్రొత్త జ్ఞానానికి పునర్జన్మను ప్రసాదిస్తూ, ఒకే జన్మలో ఎన్నో జన్మల సారాన్ని నాకోసం నా ద్వారా -నాలోపల ఆవిష్కరిస్తున్న ఆ నిరాకార పరమాత్మ శక్తికి నేను సవినయంగా కృతజ్ఞతాపూర్వకంగా తలవంచుతున్నాను.

గులాబీలక్రింద ముళ్ళు ఉన్నట్లుగా, మొగలి పొదలలో పాములు నివశిస్తాయి అన్నట్లుగా, దివ్య యాత్రలలో, పుణ్యక్షేత్ర దర్శనాలలో రకరకాల సమస్యలు, సంఘర్షణలు, ప్రమాదాలు, అవరోధాలు తప్పవు. వాటిని గుర్తించి, గ్రహించి ఎరుక పరచుకోవటమే సాధన.

ఒక అనుభవ జ్ఞాని చెప్పినట్లు *"The Natures breath taking BEAUTY is accompanied by DEATH taking Duty"* (శ్వాసను సైతం మరచి పోయి అనుభూతించే ప్రకృతి సౌందర్యం వెనుక, శ్వాస ఆగిపోయే మరణం కూడా దాగి వుంది) అన్న సత్యాన్ని గ్రహించాలి. ఈ వాక్యం 'కైలాస యాత్రలో సప్రమాణంగా నిరూపణ అయ్యింది నాకు.

ప్రకృతే దైవం-గురువు. తనలోని వికృతులను నాశనం చేసి, ప్రకృతి చర్యలకు తలవంచిన వాడికే సృష్టిరహస్యం అవగతమౌతుంది. ఆ వ్యక్తిని 'సహజయోగి' అంటారు.

హిమాలయ యాత్ర చేయ్యాలంటే ధనం కొంత వరకూ అవసరమే! కానీ దానికంటే ముఖ్యం కార్యదీక్ష, దేహదారుఢ్యము, మనో నిశ్చయము మొదలైనవి. ఇంద్రియ నిగ్రహము, జిహ్వాచాపల్యము లేకుండుట ప్రధానపాత్ర వహిస్తాయి. ఆ నడకలో ఎదురయ్యే గురువులు, పుణ్యాత్ములు, సాధకులు, విద్వాంసులు, జ్ఞానులు, అజ్ఞానులు...మొదలైన వారి సాంగత్యము మనలో వివేకాన్ని పెంచుతుంది. ఈ కైలాస యాత్ర నాకు అటువంటి సంపదను చాలా ఇచ్చింది. ఆ సంపదను మీతో పంచుకునే అవకాశం రావటం నా అదృష్టం. ఒకరకంగా చెప్పాలంటే ఇలా పంచేందుకే నాకు పునర్జన్మ ఇచ్చి పరమాత్మ మళ్ళీ మీ అందరి మధ్యకు పంపాడని అనిపిస్తోంది.

'మన చుట్టూ వున్న ప్రపంచంలో ఎంతో మంది శారీరక, మానసిక, ఆరోగ్య, ఐశ్వర్య సంపదలతో, తులతూగుతూ, అత్యధిక సౌకర్యాలను, సదుపాయాలను అనుభవిస్తున్నారు. వారిలో ఎంతమంది ఆధ్యాత్మిక మార్గంలో జీవిస్తున్నారు? బదరీనాథ్,

కేదార్‌నాథ్, అమర్‌నాథ్, కైలాస మానస సరోవరం వంటి ఆ ఉత్తమ హిమాలయ యాత్రలకు పూనుకుని, బాహ్య అంతర్ముఖ ప్రకృతి సౌందర్యాలను ఆస్వాదించి సత్ప్రవర్తనను, సత్పరివర్తనను పొందినవారు ఎంత మంది వున్నారు? అటువంటి వారిని వేళ్ళమీద లెక్కించగలమంతే!

కీ॥శే॥ జవహర్‌లాల్‌నెహ్రూగారు ఎంతటి ఐశ్వర్యవంతులో మనకు తెలుసు. మన దేశానికి అత్యున్నత పదవిని అధిరోహించిన మహానుభావులు. వారికి కైలాస మానస సరోవర యాత్ర చెయ్యాలని ఎంతో కోరిక వుండేదట. కానీ ఆ కోరిక నెరవేర్చుకోలేకపోయానని వారి ఆత్మ కథలో రాసుకొన్నారట! దీనిని బట్టి చూస్తే ధనము, కీర్తి, ఐశ్వర్యములు ప్రధానం కాదు. యోగము-ప్రాప్తము-ప్రారబ్ధము-సిద్ధత్వము అన్నవి కలిసివస్తేనేగానీ ఈ జన్మరాహిత్య పునర్జన్మ భాగ్య కైలాస మానస సరోవర యాత్ర చెయ్యలేరని తెలుస్తున్నది.

మా పిన తండ్రిగారు శ్రీ జె.ఆర్.జి. సుబ్రహ్మణ్యం బ్యాంక్ ఆఫ్ బరోడాలో సీనియర్ ఆఫీసర్‌గా పనిచేసేవారు. వారు హనుమంతుని పరమ భక్తులు. వారు 1998లో ఈ కైలాస యాత్రకు వెళ్ళి (ప్రభుత్వం ద్వారా) 'మాల్పా' అనేచోట 360 మందికి పైగా భక్తులు, పనివారు, గుర్రాలు మొత్తం చనిపోయిన వారిలో ఒకరుగా కనుమరుగైన సంఘటన నాలో ఈ యాత్రకు ఆనాడు భీజం వేసింది.

నా సాధన ఫలించింది-నా యోగం సిద్ధించింది-నా కోరిక తీరింది. దిగ్విజయంగా యాత్ర పూర్తి చేసుకుని రాగలిగాను. వచ్చిన తర్వాత లోకం-జీవితం వింతగా కనిపిస్తున్నాయి.

అబినందనలు-ఆలింగనాలు! పాదనమస్కారాలు - పాద పూజలు!

గురుకృప-దైవకృప లభిస్తే ఇలా వుంటుంది. అహంకారం-విడిచి, ఒక దివ్యమైన, నవ్యమైన కార్యంలో నిస్వార్థంతో, అంకిత భావంతో విజయవంతమైతే ఆ శరారానికి కాని, 'వస్తువుకు కానీ ఎంతో విలువ వస్తుంది.!

ఈ సత్యం నాకు అర్థమైంది.

తెగింపు లేనిదే తత్వం తెలియదు!

రాపిడి రానిదే రాణింపు రాదు!

త్యాగం లేకుండా సత్యం అందదు!

కృషి లేకుండా ఋషి కాలేరు!

ఈ వాక్యాలు పాతవే అయినా, నేను ఈ యాత్ర ద్వారా వాటి ప్రాశస్త్యము" తెలుసుకున్నాను.



# కర్మ యోగిస్తేనే తీర్థ యాత్ర !



మైనస్ డిగ్రీల చలిలో దీక్షా యాత్ర

చతుర్విధాని స్వర్గే మర్త్యే రసాతలే

దైవాని మునిశార్దూల ఆసురాణ్యార్షాణిచ॥

మానుషాణీ త్రిలోకేషు విఖ్యాతాని సురాదిభిః॥

మానుషేభ్యశ్చ తీర్థేభ్య ఆర్షం తీర్థ మనుత్తమమ్॥

ఆర్షేభ్యశ్చైవ తీర్థేభ్య ఆసురం బహుపుణ్యదం।

ఆసురేభ్యస్తథా పుణ్యం దైవం తత్సార్వకామికమ్॥

బ్రహ్మపురాణమ్ - 70 అధ్యాయం (16-18)

కర్మ యోగించినప్పుడే తీర్థ దర్శనాలు, తీర్థస్నానాదులు చేసుకోగలుగుతాడు మనిషి.

తీర్థము అంటే తరింపజేయునది. గ్రాంధికంగా చూస్తే 'తీర్థము' అనే పదానికి "యజ్ఞము- ఉపాయము- క్షేత్రము-శాస్త్రము-అవతారము-మంత్రి-ఉపాధ్యాయుడు" మొదలైన అర్థములు కూడా ఉన్నాయి. ఈ తీర్థాలు ప్రపంచంలో నదీనద, పర్వత, వన, ఆశ్రమ, కొండ, సరోరూపాలలో ఎన్నో విధాలుగా కనపడుచున్నాయి. ఏది ఏమైనా గంగా, గోదావరీ మొదలగు నదీ జలాలలో 'తీర్థము' అను పదమునకు ప్రసిద్ధి కనపడుతోంది.

మనుష్యులు మానసికంగా, వాక్కుపరంగా శారీరకంగా చేసే దోషాలను తీర్థదర్శన, సేవ, స్నానాదుల ద్వారా పోగొట్టుకోవచ్చునట.

పై శ్లోకములో మనకు చక్కని భావము ఇవ్వబడింది.

తీర్థములలో స్నాన, దాన, తపోజపాదులు ఏకాస్త చేసినా కూడా అవి, అనంత ఫలాలను అందిస్తాయి. ఎంతో వ్యయ ప్రయాసలతో, అతి కష్టమైన అగ్ని సాక్షిగా చేసే యజ్ఞ యాగాదుల కంటే తీర్థములు సులభముగా ఫలితాలను మనకు ఇస్తాయి. మరింత, విశేషంగా చెప్పుకోవాలంటే తీర్థములను శ్రద్ధతో స్మరిస్తే చాలట, సర్వపాప దోషాలు హరించిపోయి మోక్షము లభిస్తుందట.

ఈ కైలాస మానససరోవరయాత్ర మనిషికి పునర్జన్మ వంటిదని చెప్పుకున్నాము. అంతేకాదు, తద్వారా తాను తరించటమే కాక ఇతరులను కూడా తరింపచేయగల శక్తి సిద్ధింస్తుందట. ఇక్కడ నాచిన్నతనంలోని ఒక సంఘటన చెబుతాను.

1970లో జరిగిన సంఘటన. 60 సంవత్సరాలకు పైబడిన మాతాతయ్యగారు మాఇంట్లో వుండేవారు. ఆయనకు ఆరోజుల్లో 50 రూపాయలు దాకా పెన్షను వచ్చేది. రాజమండ్రిలో ఉండేవాళ్ళం. స్థానిక మల్లాయపేటలో ఎవరో ఒక వ్యక్తి కైలాస మానస సరోవర యాత్ర చేసుకువచ్చారని మాతాతయ్యగారికి తెలిసింది. నన్ను తోడు తీసుకుని ఆవ్యక్తి కోసం వెళ్ళారు. ఆ వ్యక్తిని కలుసుకోవటానికి పూట పట్టింది మాకు. ఆయనను

చూస్తూనే మా తాతయ్యగారు ఆనంద పారవశ్యంతో సాష్టాంగ నమస్కారం చేసి కనీళ్ళతో పులకించి పోయారు. తన జన్మధన్యం అయిపోయిందని ఆవేశంగా మాట్లాడారు. మధ్య వయస్సులో వున్న ఆ వ్యక్తి ఎంత వారించినా వినకుండా అతని పాదాల వద్ద తన తల వుంచి శివనామం స్మరిస్తూ ఒకరకమైన ధ్యాన స్థితిలో ఉండిపోయారు మా తాతగారు. నాకు చాలా వింతగా వుంది కారణం, ఆ పరిస్థితి అర్ధంకాక పోయినా ఎందుకో నాకు కూడా ఏడుపు వచ్చింది. నన్ను కూడా ఆ వ్యక్తి పాదాలకు నమస్కరించమన్నారు. చేసాను. మా ఇద్దరి మీద నీళ్ళు చల్లారు. విభూతి బొట్టు పెట్టారు. ఆయన నాతల మీద చెయ్యిపెట్టి చాలా సేపు వుంచారు. దానికర్థం అప్పుడు తెలియలేదు. దాని ఫలితం ఇప్పుడు తెలుస్తోంది. ఆ తన్మయత్వంలో మా తాతయ్యగారు తన జేబులో వున్న పెన్షన్ డబ్బులు మొత్తం ఆయనకు సమర్పించారు.

తర్వాత ఇంటికి వచ్చాకా మానాన్నగారికి, ఆయనకు పెద్ద గొడవ జరిగింది. పెన్షన్ మొత్తం అలా ఇవ్వటం వలన మా తాతయ్యగారు ఇంట్లో నుంచి గెంటబడ్డారు. సాయంత్రం బయటకు వెళ్ళాల్సిన పరిస్థితి. మళ్ళా నన్ను తోడు రమ్మని స్థానిక పుష్కరాల రేవుకు దగ్గరలోనున్న రామాలయంలో ఉండటానికి నిశ్చయించుకున్నారు. ఆ వయసులో అయన పరిస్థితి నాకు బాధ అనిపించింది. "తాతయ్యా, పెన్షన్ మొత్తం ఇవ్వకుండా వుండాల్సింది!" నా అమాయక ప్రశ్న. "ఏడిశావ్ సాక్షాత్తు శివుడ్ని చూసివచ్చాను. అటువంటి వ్యక్తికి ఏమిచ్చినా శివుడికి ఇచ్చినట్లే. మంచిదయింది, ఇకరోజూ జపం బాగా చేసుకోవచ్చు" అని చెప్పారాయన. ఆయన కళ్ళలోని ధీమా నాకు ఇప్పటికీ గుర్తు వుంది.

అటువంటి శ్రద్ధా భక్తుల ఫలితమేనేమో, ఆయన కార్తీక మాసంలో, ఒక సాయంత్రం, మైలవరంలో, ఇంటి ఎదురుగా వున్న దేవాలయంలోని ధ్వజస్థంబంపైన వెలుగుతున్న దీపాన్ని దర్శించుకుని, ఇంట్లోకి వచ్చి, మంచం మీద కూర్చుంటూ ప్రాణాలు వదిలారు.

**మనిషి మంచి చెడ్డలు, భక్తి శ్రద్ధలు మరణ సమయంలో తెలుస్తాయంటారు.**

**సత్సంగాలు, సద్భావనలు, సత్కర్మలు మనిషికి జన్మసాఫల్యాన్ని అందిస్తాయి.**



# శ్రీ కైలాస మానస సరోవర యాత్ర ప్రారంభం

17-7-2002న ఎ.పి. ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి ప్రయాణం నిర్ణయించుకున్నాను. 15 రోజుల నుంచి ఒక రకమైన ఆందోళన. తిరిగి రాకపోతే...అన్న ఆలోచన నాలో బాగా బలంగా చోటు చేసుకుంది. యాత్రకు ఎన్ని రోజులు పడుతుంది? ఎంత డబ్బు కావాలి? ఏమీ అర్థం కాలేదు. గణపవరం శ్రీ గోపాలకృష్ణగారు ఎప్పుడో ప్రామిస్ చేశారు, 50 వేలు కావలన్నా సరే నాదగ్గరకు రండి ఇస్తాను అని. వారితో ఫోనులో మాట్లాడాను. వచ్చి తీసుకువెళ్ళండి అన్నారు. ఆ సమయంలో అనివార్య కారణం వలన నేను వెళ్ళలేక శ్రీ సుబ్బారావు గారిని పంపాను. శ్రీ గోపాలకృష్ణ గారు ఫోను చేసి "ఎంత ఇవ్వమంటారు?" అని అడిగారు. 'మీ ఇష్టం' అన్నాను. ఎప్పుడూ ఎవరినీ డబ్బు అడగటం నాకు అలవాటు లేదు. కొంచెం సిగ్గుగా అనిపించింది. "చెప్పండి ఎంత కావాలన్నా పరవాల్లేదు. నా దగ్గర వున్నాయి." అని ఆయన అన్నారు. నా ఎదురుగా వున్న సాయినాథుని ఫొటోలోకి చూస్తూ "11,500 ఇవ్వండి" అని అనేశాను "సరిపోతాయా?" అని ఆయన అన్నారు. 'చాలు' అన్నాను. భగవంతుని లీల కాకపోతే ఆయన నాకు ఎందుకు ఇవ్వాలి? ఎంతయినా ఇవ్వటానికి సిద్ధపడి వుండటం ఏమిటి?

సాయిశక్తి గొప్పతనం అది. సమర్థ గురువుని ఆశ్రయించిన వారికి సమస్య అన్నదే వుండదు.

ప్రయాణానికి ముందు రోజు శ్రీ నందుబాబా నా కోసం వచ్చారు!" నువ్వు చేసేది మామూలు యాత్ర కాదు. సాయి నిన్ను మంచి సింహాసనం మీద కూర్చోబెడతాడు. ఈ యాత్రలో నీకు సిద్ధులు లభిస్తాయి బేటా" అని కౌగిలించుకొని చెప్పారు.

సాయంత్రం సత్సంగం ఏర్పాటు చేశాను. 60 మందికి పైగా వచ్చారు. 'హరిః ఓమ్ సాయిరామ్' కేసెట్లు శ్రీ నందుబాబా ఆవిష్కరించారు. నా యాత్ర గురించి వివరిస్తూ అందరి ఆశీర్వాదం కోరాను. రెండు నెలలలో రాకపోతే ఇల్లు ఖాళీ చేసి సామాను తీసుకెళ్ళమని శ్రీమోహనరావు గారికి, వేదప్రియ గారికి చెప్పాను. పత్రిక విషయంలో కూడా అప్పగింతలు చేసేశాను. మనసు మూలలో ఎక్కడో తిరిగి రానన్న భావన నిలకడైంది. శ్రీ నందుబాబా కన్నీళ్ళు దానిని బలపరచాయి. కానీ ఆయన ఒక కొబ్బరికాయ ఇచ్చి, యాత్ర ముగించుకుని వచ్చాకా, షిర్డిలో, ధునిలో వెయ్యమన్నారు. నాకు ధైర్యం కోసం అలా చెబుతున్నారని అనిపించింది. నాతో పాటు ఆ కొబ్బరికాయ కూడా సిద్ధి పొందుతుందని అనిపించింది. రాత్రంతా ఒంటరిగా గడిపాను. కోరి కోరి, తెలిసి తెలిసి మరణాన్ని ఆహ్వానిస్తున్నానని అనిపించింది. కానీ ఎక్కడా భయం కానీ దిగులు కానీ లేదు. చాలా ఆశ్చర్యకరమైన స్థితి.

మొత్తం 44 సంవత్సరాల జీవితంలోని ఘటనలు-సంఘటనలు, విరహాలు- వేదనలు, అలజడి-ఆకలి, ప్రేమ-పిచ్చి, ఎడబాటులు-ఎదురు దెబ్బలు... ఇలా అన్నీ సినిమారీలులా మెదిలాయి. అన్నింటినీ ఒక చోట చేర్చి నాశనం చేసి, శూన్యంగా మార్చుకుంటున్న సమాధి స్థితిని అనుభవించాను.

రాత్రి 2 గంటలు దాటింది. ఆలోచనలు తెగటం లేదు. సామాను సర్దుకోవడం మొదలు పెట్టాను. శ్రీ నరసింహారావు చాలా సహాయం చేశాడు. ఉదయం 6 గంటలకు



తపోభూమి ఋషీకేశ్

సికింద్రాబాద్ చేరాను. శ్రీనరసింహారావు, వేదప్రియ, నాతోపాటు స్టేషనుకు వచ్చారు. శ్రీ గురుదేవ్ కుటుంబం, శ్రీ సూర్యనారాయణరావు గారి కుటుంబం స్టేషనులో సిద్ధంగా వున్నారు. వీరంతా చివరి వీడ్కోలు ఇవ్వటానికి వచ్చారనిపించింది.

రైలు కదిలింది. వారందరికీ చెయ్యివూపుతుండగా, ఎందుకో నాలో కన్నీరు లోలోపల పొంగింది. రైలుస్టేషను దూరమైన కొలదీ, నాకూ ప్రపంచానికీ దూరం పెరుగుతోందన్న భావన ఉప్పెనగా మారింది.

మనిషి ఎప్పుడూ ఆశతోనే జీవిస్తాడు. లౌకికమైన వెన్నో పొందుతాననే ఆశలోనే ఉంటూ కాలానికి ముడిపడతాడు."అన్నీపోతాయి, పోవాలి, పోయినా పరవాల్లేదు. మరణం కూడా ఒక వరమే" అన్న భావనతో శూన్యంలోకి ప్రయాణం చెయ్యటం నాలోని వైరాగ్యానికి చిహ్నమేమో అనిపించింది.

ఢిల్లీలో దిగగానే శేషసాయి స్టేషనుకు వచ్చాడు. తనింటికి తీసుకువెళ్ళాడు. సాయి పూజ చేశాను. 15 సంవత్సరాల తర్వాత మా కలయిక! అతను డిఫెన్స్ మినిస్టరీలో పనిచేస్తున్నాడు. నన్ను చూసి చాలా ఆశ్చర్యపోయాడు. శర్మాజీ, స్వామీజీగా మారటం ఊహించని విషయం కదా! నేపాల్ అంబసీలో కొన్ని రిఫరెన్సులు ఇచ్చాడు.

అదే రోజు మధ్యాహ్నం 12 గంటలకు ఉజ్జయినీ ఎక్స్‌ప్రెస్‌లో హరిద్వార్‌కు బయలుదేరాను. సాయంత్రం 5 గంటలకు చేరింది రైలు. అక్కడ నుంచి ఋషికేశ్ శ్రీ కైలాశ్ ఆశ్రమంకు వెళ్ళాను. శ్రీ మేధానందపురి స్వామీజీ గంగ ఒడ్డుకు వెళ్ళారట. కొంత సేపు తర్వాత వచ్చారు. వారు రాసిన శంకరాచార్య ప్రశ్నోత్తరి మణిమాల పుస్తకాలను ఇచ్చాను. ఈ యాత్రకు ప్రధాన ప్రేరణ వారిచ్చినదే. వారితో నాకు 30 సంవత్సరాల అనుబంధం. నాకు ఆధ్యాత్మిక గురువులు వారు. కైలాస ఆశ్రమంలో నాకు రూము ఇచ్చారు. రెండు రోజులలో నేపాల్ పంపిస్తానన్నారు.:

ఋషికేశ్ హిమాలయాలకు తొలిమెట్టు, తపోభూమి. సాధుసంత్‌ల దివ్యస్థలమది. గంగామాత ఒడి అది. సాధకులకు సిద్ధత్వాన్ని ఇస్తుంది ఆ నేల.

హిమాలయాలంలో ఒక్కొక్క ప్రాంతం ఒక దివ్య శక్తిని అందించే తీర్థక్షేత్రం. సత్యం, శివం, సుందరం...మూడూ అనుభవమౌతాయి. మరొక జన్మలాగ మారిపోతుంది జీవితం.

ఉత్తర భారతదేశంలో శివ-శక్తి తీర్థాలు ఎన్నో వున్నాయి. వాటిలోని కొన్ని క్షేత్రాలు మనం తెలుసుకొందాము.



# హిమాలయ దివ్య క్షేత్రములు

హరిద్వార్: ఢిల్లీ నుంచి సుమారు 5 గంటల ప్రయాణము. డెహ్రాడూన్‌కు 40 కి.మీ. దూరంలో వున్న పట్టణము. ఇక్కడ గంగానది ఉరకలు వేస్తూ వుంటుంది. సాయంత్రం "హరికీ పౌడి" దగ్గర గంగా మాయికి ఇచ్చే హారతి చాలా అద్భుత దృశ్యం. వందల సంఖ్యలో ఆశ్రమాలు, మందిరాలు, ధర్మశాలలు ఉన్నాయి. హరిని దర్శించుటకు ఈ పట్టణము ముఖద్వారము వంటిది. పర్వతము మీద మానసాదేవి మందిరము తప్పక దర్శించ తగినది. ఆ మందిరమునకు 'రోప్‌వే'లో వెళ్ళటం మంచి అనుభవం. శాంతికుంజ్, అంజనేయధామ్, భారతమాత మందిర్, శ్రీ కృష్ణధామ్ మొదలైన వెన్నో తప్పక దర్శించ తగినవి వున్నాయి. భారతదేశములోని ప్రతి గొప్ప మహాత్మునికి ఇక్కడ ఆశ్రమం వున్నది


నీలకంఠ పర్వత ప్రాంతంలోని అమృత కుటీర్‌లో...

హృషీకేశ్ : ఇది కూడా పెద్ద పట్టణముగా మారింది. హరిద్వార్ నుంచి సుమారు 21 కి.మీ. దూరంలో వున్నది. హిమాలయములు ప్రారంభపు మెట్టు. మరొక మాటలో చెప్పాలంటే హిమాలయాలకు పాద భూమి ఇది. ఇక్కడ కూడా అనేక పెద్ద, పురాతన ఆశ్రమాలు వున్నాయి. తపోభూమి. రామ్‌ఝూలా, లక్ష్మణ్ ఝూలా, గీతామందిరము, త్రివేణీ ఘాట్, 14 అంతస్థుల మందిరము, కైలాస ఆశ్రమం, శివానంద ఆశ్రమం, దయానంద ఆశ్రమం, ఆంధ్ర ఆశ్రమం...ఇవన్నీ చూడదగినవి. ఇది సాధు సిద్ధక్షేత్రము. జప, ధ్యానాదులకు అనువైన స్థలము.

యమునోత్తరి : ఇది హృషికేశమునకు 210కి.మీ. దూరములో, కేదార్‌నాథ్ మార్గంలో ఎత్తైన ప్రదేశములోనున్నది. యమునా నది ఇక్కడే పుట్టినది. ఇక్కడ ప్రత్యేకత 194.7 డిగ్రీల ఉష్ణ గుండము ధారలుగా ప్రవహించు 'తప్తకుండము' ఉన్నది. ఎవరైనా బియ్యము, బంగాళాదుంపలను మూటగట్టి, ఆనీటిలో ఉంచిన కొద్ది సేపటికి మెత్తగా ఉడికిపోతాయి.

గంగోత్తరి : ఇది సుందరమైన ప్రదేశము, ఈ క్షేత్ర మార్గ మధ్యములో అందంగా, ఆకర్షణీయంగా కనిపించు విశాలమైన, దట్టమైన దేవదారు వృక్షాలు, రకరకాల పూలవనాలు కనిపిస్తాయి. గంగామాతాజీ మందిరము తప్పక దర్శించదగినది. ఈ క్షేత్రము ఉత్తర కాశీకి 70 మైళ్ళ దూరములో, 10,300 అడుగల ఎత్తునుంచి గంగానది క్రిందికి పారు, దివ్య ప్రదేశము.

ఉత్తర కాశీ : ఇక్కడ వేదశాస్త్రం, పురాణ పండితులు ఎందరో వున్నారు. సిద్ధభూమి! మంత్రం, తంత్రాలు సిద్ధిస్తాయి. జపానికి తపానికి, అనుష్ఠానానికి అనువైన ప్రదేశమిది, వరుణ, అస్సీ నదులు కలిసిన చోటిది. ఇక్కడి ప్రత్యేకత కాశీ విశ్వనాథ్ మందిరం,

ఏకాదశ రుద్ర మందిరాలలో ధ్వజ స్తంభాలకు బదులుగా 20 అడుగుల ఎత్తున త్రిశూలములున్నవి.

గోముని : ఈ క్షేత్రము గంగోత్తరికి 14 మైళ్ళ దూరములోనున్నది. గంగానది ఆవరించిన పుణ్యప్రదేశము. ఎంతో కఠినమైన, ప్రమాదపూరితమైన, మంచుతో కప్పబడిన మార్గముంది. దీనిపైన 50 చ.మై విశాలమైన సమతల ప్రదేశమున్నది. దీనికి కుభేరుని నగరము 'అలకాపురి'గా పిలుస్తారు. అంతా మంచుతో కప్పబడి వుంటుంది. ఆక్రింద భాగమున మంచు గడ్డలు కరిగి నురుగులతో ప్రవహించు 'గంగామాయి' కనిపించును అక్కడ ఉండటానికి, ఎటువంటి సదుపాయము లేదు. అందువలన అదే రోజు గంగోత్తరికి చేరటం మంచిది. ఈ క్షేత్రమునకు పశ్చిమ భాగమున నీలకంఠ పర్వతమున్నది. దానిని దాటిన కేదార్‌నాథ్ క్షేత్రము వచ్చును. 22000 అడుగుల ఎత్తువున్న ఈ పర్వతమును దాటుట అందరికీ సాధ్యము కానిది. తూర్పు భాగమున నారాయణ పర్వతములు, స్వర్గారోహణ పర్వతములు, బదరీ క్షేత్రము ఉన్నాయి.

గుప్త కాశీ: వివిధ రకాల పూలతో, పరిమళాలతో, లతలతో నిండి వున్న క్షేత్రము. రుద్ర ప్రయాగ దాటగానే ఉన్నది. ఇచ్చట ప్రత్యేకత, అర్ధనారీశ్వరాలయము, విశ్వనాధాలయములలో స్పటికంతో చెయ్యబడినవి గ్రహాలు ఉన్నాయి. ఎప్పుడూ రెండు ధారలతో నింపబడుచున్న 4 అడుగుల కుండము ఉన్నది.

త్రిజోగి నారాయణము : ఇది ఎంతో పురాతనమైన క్షేత్రము. పార్వతీపరమేశ్వరుల వివాహము ఇక్కడ జరిగినట్లుగా మనకు ఆధారములు కనిపిస్తాయి. ఆనాటి హవనం తాలూకు అగ్ని ఈనాటికీ వెలుగుతూ కనిపిస్తుంది. ఉండానికి మంచి సదుపాయాలు వున్నాయి. ఇక్కడ నుండీ భస్మము తెచ్చుకొనుటకు మరువ కూడదు. 3 కి.మీ.లు నడచి వెళ్ళాలి. గుర్రాలు కూడా లభిస్తాయి . ఇక్కడ గంగోత్తరి, యమునోత్తరి నుంచి వచ్చు దారులు కనిపిస్తాయి.



## ఋషీ కేశ్ నుంచి ప్రయాణం !



కాట్ గోదామ్ హనుమాన్ మందిరంలో...

కైలాస ప్రయాణాన్ని మరణంతో ముడిపెట్టి చెప్పుకోవడం తప్ప, జీవించి కూడా కైలాసాన్ని దర్శించవచ్చన్న విషయం నాకు ఋషీకేశ్‌లో తెలిసింది. ఒకసారి హైదరాబాద్‌లో శివానంద ఆశ్రమానికి వచ్చిన నా అధ్యాత్మిక గురువులు శ్రీ మేధానందపురి స్వామీజీ "అతి తక్కువ ఖర్చుతో కైలాస మానససరోవరం వెళ్ళి వచ్చాను" అని చెప్పినప్పుడు నాలో కోరిక మొదలైనది. క్రిందటి సంవత్సరం వారితో వెళ్దామను కొన్నాను. కానీ అనుకూలించలేదు. కానీ ఈ సంవత్సరం ప్రేరణ అందింది. శ్రీ మేధానందపురి స్వామీజీ రమ్మన్నారు.

నాతోపాటు ఒక బ్రహ్మచారి కూడా వస్తానన్నారు. కానీ నేను ఋషికేశ్ వెళ్ళే సరికి అతను వెళ్ళిపోయాడు. కైలాస ఆశ్రమంలో మూడు రోజులు వున్నాను. నేపాల్‌లోని నేపాల్ గంజ్‌లో ఉన్న శ్రీహరి శంకరగిరి నాగా బాబా గారికి ఉత్తరం రాసిచ్చారు స్వామీజీ. అక్కడికి వెళ్తే ఆయన ఏర్పాట్లు చేస్తారన్నారు. నాలుగు రోజులలో గురుపూర్ణిమ వుంది. అది అయ్యాకా వెళ్ళమన్నారు. కానీ నాకు త్వరగా కైలాసయాత్ర పూర్తి చేసుకోవాలని ఆరాటంగా వుండటంతో బయలుదేరాను. శ్రీ స్వామీజీ మరొక మాట అన్నారు. ఒంటరిగా వెళ్ళడం కష్టం. లేకపోతే వచ్చే సంవత్సరం కొంత మందితో వెళ్ళవచ్చు. ఆలోచించండి" అని అన్నారు. వచ్చే సంవత్సరం దాకా ఆగటం నాకు ఇష్టంలేదు. "ఏం పరవాల్లేదు స్వామీజీ, మీ ఆశీర్వచనం. నాకు తోడుంటుంది. సాయినాధుడు ఏదొక రూపంలో నాకు దారి చుపిస్తాడు. నేను వెళ్తాను" అని చెప్పి బయలుదేరాను.

ఆంధ్రనిర్వాణ ఆశ్రమంలోని మూర్తిగారు నన్ను తన బిడ్డలాగా చూసుకుంటారు. వారు ఎంతో సహకరించారు. తీరా వెళ్ళే రోజున వేరేచనాలు మొదలయ్యాయి. నా దగ్గర అన్ని రకాల మందులు ఉండటం వలన వెంటనే వేశాను. మధ్యాహ్నం 1-30కు ఋషికేశ్ నుంచి పాసింజర్ రైలు ఎక్కి హరిద్వార్ చేరాను. సాయంత్రం 5.30 గంటలకు గోండా-ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరాను. అక్కడ ఒక అనుభవం ఎదురైంది.

ట్రైన్ చాలా రష్‌గా ఉంది. నేను ఎక్కాల్సింది ఎస్-5 కోచ్. సామాను చాలా బరువుగా ఉంది. అతి కష్టంతో మోసుకుని వెళ్తున్నాను. ఇంతలో ఒక పోర్టర్ వచ్చి "స్వామీజీ ఏ కోచ్‌కి వెళ్ళాలి" అని అడిగాడు. చెప్పాను. నేను తీసుకు వస్తాను అన్నాడు. 20 రూపాయలు అడిగితే 10 రూపాయలకు బేరం ఆడాను. అతను విసుక్కుంటూనే ఒప్పుకుని, నా బ్యాగ్ తీసుకున్నాడు. ప్లాట్ ఫారం మీద సన్యాసులే ఎక్కువగా కనిపిస్తున్నారు. నేను జనాన్ని తప్పించుకుంటూ నడుస్తూ నా వెనక వస్తున్న పోర్టర్ కోసం

తిరిగాను. పోర్టర్ లేడు. అసలే విరేచనాల కారణంగా చాలా నీరసంగా ఉంది. అక్కడే ఆగిపోయి అంతా వెతికాను. ఎక్కడా అతను కనిపించలేదు. నేను అతని వెనక నడవాల్సింది. అతనికి బ్యాగ్ ఇచ్చి ముందుకు కదిలాను. మొత్తం 16 వేలు డబ్బు, బట్టలు, తినుబండారులు అన్నీ ఆ పెద్ద పిట్ బ్యాగ్‌లో (వీపుకు కట్టుకునే బ్యాగ్) ఉన్నాయి. ఆ పోర్టర్ కనిపించలేదు. నేను, నా చేతిలో కర్ర మిగిలాము. ఎంత వెదికినా పోర్టర్ జాడలేదు. 10 నిముషాలు అయిపోయింది. ట్రైన్ కదలే సమయం అయింది. నాలో నిరాశ చోటు చేసుకుంది. ఆ పోర్టర్ నా బ్యాగ్ తీసుకుని ఎటో పారిపోయి ఉంటాడని నిర్ణయించుకున్నాను. ఒక రకమైన దుఃఖం వచ్చింది నా ప్రయాణం తొలి దశలోనే దెబ్బతింది. అంత అజాగ్రత్తగా ఎలా వున్నానా? అని అనిపించింది. ట్రైన్ కదలబోతోంది. నాలో ఆలోచన శూన్యమైంది. జేబులో 200 రూపాయలు మాత్రమే వున్నాయి.

ఇంతలో హఠాత్తుగా ఆ పోర్టర్ నా దగ్గరకు వచ్చి తిడుతున్నట్లుగా అరుస్తూ "అక్కడే వున్నావు ఏంటి స్వామి. నేను ఎస్. 5 దగ్గరకు వెళ్ళాను. తొందరగా ఎక్కు" అని ఎదురుగా వున్న కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కించాడు. నాకు నోటి మాట రాలేదు కదులుతున్న రైలులోకి ఎక్కాను. అతను డబ్బులు అడిగాడు. జేబులో చెయ్యి పెట్టి తీసాను. 50 రూపాయలు నోటు వచ్చింది. ఇచ్చాను. చిల్లర లేదన్నాడు. 'ఉంచుకో' అని ఆనందంగా చెప్పాను. కొన్ని క్షణాలు ఏమి జరిగిందో తలచుకుంటే ఆశ్చర్యంగా అనిపించింది. ఇక ఆ పోర్టర్ కనిపించడన్న నిరాశలో పడిపోయిన సమయంలో అతను రావటం, ట్రైను ఎక్కడం..."ఆహా, సాయిరాం" అని కళ్ళుమూసుకుని తలచుకున్నాను. తర్వాత స్టేషన్‌లో దిగి నా కోచ్‌లోకి వెళ్ళాను.

నా బెర్త్‌కు ఎదురు బెర్త్ మీద గోరక్‌పూర్ వెళ్తున్న ఒక సఫారీ వాలా ఉన్నాడు. అతను ఒక గంట నిద్రపోయి లేచి హిందీలో "మహరాజ్..మీతో కొంచెం సేపు మాట్లాడాలని ఉంది" అంటూ నాబెర్త్ మీదకు వచ్చి రాత్రి ఒంటి గంట వరకు ఆధ్యాత్మికంగా చర్చిస్తూనే ఉన్నాడు. మధ్యలో నాకు కూల్ డ్రింక్ ఇచ్చాడు. తాను టిఫిన్ తిన్నాడు. అతని పర్సనల్ లైఫ్ విషయాలు చెప్పి అనుమానాలు తెలిపాడు. నేను చెప్పే మాటలు అతని మీద మంచి ప్రభావం చూపాయి. పడుకోటానికి వెళ్తూ నా చేతిలో 100 రూపాయలు దక్షిణ పెట్టాడు. నేను వద్దు అన్నాను. కానీ వినలేదు. మంచి కాలక్షేపం. హిందీ నాకు అంతగా రాకపోయినా అతనికి అర్థం అయ్యేలాగ నాలోని భావాన్ని, ఆధ్యాత్మికంగా మాట్లాడి మెప్పించడం, నా గురించి నాకే ఆశ్చర్యం కలిగింది.

రైలు తెల్లవారు ఝామున 5.30 గంటలకు గోండా స్టేషన్‌కు చేరింది. అక్కడి నుంచి నేను మీటర్‌గేజ్ ట్రైన్‌లో 'రూపేడియా' అనే స్టేషన్‌లో దిగాలి. అది ఇండియా బోర్డర్. అక్కడకు చేరే సరికి మధ్యాహ్నం 2 గంటలు అయ్యింది. అక్కడి నుంచి నేపాల్ బోర్డర్ దాటి 'నేపాల్ గంజ్' అనే ఏరియాలోకి వెళ్ళాలి. టాంగాలో వెళ్ళాను. అక్కడ ఇండియా కరెన్సీ, నేపాల్ కరెన్సీ రెండూ చెల్లుతాయి. మన పది రూపాయలు వారికి 16 రూపాయలు. టాంగాలో వెళ్తుంటే బోర్డర్‌లో నా బ్యాగ్ అంతా చెక్ చేశారు. నేపాలి

పోలీసులు ఎక్కడికి, ఎందుకు వెళ్తున్నానో అన్ని వివరాలు అడిగారు. భాగేశ్వరి అలయందగ్గర దిగాను. ఆ ప్రక్కనే హనుమంతుని మందిరం ఉంది. అక్కడికే నేను వెళ్ళాలి. మధ్యాహ్నం సుమారు మూడు గంటలు అవుతోంది. హనుమాన్ మందిరంలో భక్తులు ఎవరూ లేరు. ఒక ముసలాయన, పొడుగాటి గడ్డంతో పడుకుని వున్నాడు. ఆయనే 'హరిశంకర గిరి నాగా బాబా' అయివుంటారని తలచాను. పిలిచి లేపాను. ఆయన పెద్ద పెద్ద కళ్ళతో చూస్తూ నా వివరాలు అడిగాడు. 'నువ్వు వస్తున్నావని నాకు తెలుసు' అని అన్నాడు. నేను మేధానందపురి స్వామీజీ హిందీలో రాసిచ్చిన లెటర్ చూపించాను. అది చదివి. నన్ను కూర్చోమన్నాడు. తాను లోపలికి వెళ్ళాడు. కొంతసేపు తర్వాత వచ్చి "ఇప్పుడు నేపాల్‌లో వాతావరణం బాగాలేదు. మావోవాదుల గొడవలు ఎక్కువగా వున్నాయి. స్వామీజీలను చంపి డబ్బులు లాక్కుంటున్నారు. విమానం కూడా గత పదిరోజులుగా వెళ్ళటంలేదు. కైలాస యాత్ర ఇప్పుడు కష్టం వెనకకు వెళ్ళడం మంచిదని బాబా చెబుతున్నారు." అంటూ చాలా నిర్లక్ష్యంగా మాట్లాడారు. ఆ మాటలు వినగానే నాలో నిస్సత్తువ అయిపోయింది. ఎంతో ఆశతో వచ్చాను. ఆయన మాటలను బట్టి హరిశంకరగిరి నాగాబాబా ఆయన కాదని తెలిసింది. లోపల వున్నారట. ఆయనకు లోపలి నుంచి గట్టిగా హిందీలో "అంతా ఇక్కడకు వస్తే మేము ఏమి చేస్తాము. వెనకకు పొమ్మనండి. కైలాస యాత్ర అంటే ఆట అయి పోయింది. ప్రాణలతో వెనకకు వెళ్ళమనండి." అని హిందీలో అరుస్తున్నాడు. కొంత వరకు అర్థం అయ్యింది. ఆ మాటలు నన్ను బాగా బాధ పెట్టాయి. నేపాల్ ఇంతవరకు తెలియదు. రెండు రోజుల నుంచి అన్నం తినలేదు. నీరసంగా ఉంది. ఏమి చేయాలో అర్థం కాలేదు.



శ్రీ హరిశంకరగిరి నాగా బాబాతో...

## నేపాల్‌లో ఎదురుచూపు !



భాగేశ్వరీ మందిరంలో నేపాలీ లామాతో...

మనిషికి దుఃఖాన్ని ఇచ్చేవి మూడు అంశాలు -

1) కోరికలు 2) బంధాలు 3) ఆశించడం

నేను ఈ కైలాస యాత్రకు అత్యాశతో బయలుదేరానేమో అని పించింది. నాకు ఎక్కడా ఏ అడ్డంకు రాదని, నేను ఆశ్రయించిన వారు నన్ను ఆదరించి ముందుకు పంపేస్తారని లోలోపల నాలో అతి నమ్మకం ఉన్నట్లుంది. అందుకే ముందు చూపు లేకుండా ఒంటరిగా బయలుదేరాను. లేదా సదా సాయీశ్వరుడు అండగా వుండి నన్ను కాపాడుతూ అడుగడుగునా నడిపిస్తాడన్న శ్రద్ధ, విశ్వాసము కూడా కారణం కావచ్చు.

శ్రద్ధా విశ్వాలతో భగవంతుణ్ణి నమ్ముకున్న వారికి ఆటంకాల పేరుతో, కష్టాల రూపంలో పరీక్షలు ఎదురవ్వక తప్పదు. అప్పుడే మనలో దృఢత్వం బలపడుతుంది.

లోపల నుంచి హరిశంకరగిరి నాగాబాబాగారి మాటలతో నిరాశపడ్డ నేను లేచి ఎదురుగా వున్న ధుని దగ్గరకు వెళ్ళి ఊది బొట్టుపెట్టుకున్నాను, ఆ ప్రక్కనే గుడిలో వున్న నిలువెత్తు అంజనేయస్వామికి మనసారా నమస్కరించు కున్నాను.

'ఎలాగైనా, వెనకకు వెళ్ళకుండా కైలాస యాత్రకు వెళ్ళే మార్గం చూపించు తండ్రీ! ఎన్ని కష్టాలు వచ్చినా పరవాలేదు ఎన్ని రోజులు పట్టినా పరవాలేదు. ఈ యాత్ర ఫలించేలా చెయ్యి స్వామీ!" అని కోరుకున్నాను.

ముసలాయన మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు. త్రాగాను శరీరం కొంత శాంతించింది.

లోపల గదిలో నుంచి ఇన్‌షర్ట్ చేసుకున్న ఒక వ్యక్తి వచ్చాడు. "ఎంత డబ్బు తెచ్చావు?" హిందీలో అడిగాడు నేను చెప్పాను.

అతను లోపలికి వెళ్ళి వచ్చి "రెండు మూడు రోజులు ఉండు. వాతావరణం కారణంగా విమానం కదలటం లేదు. అవకాశం చూసి పంపుతానన్నాడు బాబా" అని అన్నాడు.

నాలోని ఆశ చిగురించింది. "పరవాల్లేదు. ఎన్ని రోజులైనా వుంటాను. బాబా గారిని నా మీద దయవుంచి సహాయం చెయ్యమని చెప్పండి" అని అన్నాను.

ఆ మందిరం అంతా పొగ చూరి వుంది. ప్రతిరోజు అక్కడ ధుని పూజ చేస్తారని తెలుస్తోంది.

అంతలో ఒక కుర్రాడు వచ్చి అన్నం తినటానికి రమ్మన్నాడు. సమయం నాలుగు దాటింది. కానీ ఆకలిగా వుండటం వలన కాదనకుండా లేచాను.



తోటి సాధువులతో
శ్రీ మృత్యుంజయపురి నాగా బాబా సన్నిధిలో...

ఆ రాత్రి నిద్ర పట్టలేదు. దోమలు విపరీతంగా వున్నాయి. హనుమంతుడు వున్న గదికి ఎదురుగా పడుకున్నాను. అర్థరాత్రి దాటాకా నిద్ర పట్టింది.

హఠాత్తుగా మెలుకువ వచ్చింది. సమయం 2.45 అయ్యింది. ప్రక్క హాలులో లైటు వేసి వుంది. ఎవరో కదులుతున్నట్లు అనిపించింది. లేచి అటు వెళ్ళాను. ధుని దగ్గర ఒక వ్యక్తి కూర్చుని ధుని పూజ చేస్తున్నారు. సన్నగా పొగ వస్తోంది. జుట్టు పొడవుగా వుంది. గెడ్డం ముడివేసి వుంది. కేవలం లంగోటా ధరించి వున్నారు. నన్ను చూశారాయన.

ఆయనే హరిశంకర్ గిరినాగాబాబా అయి వుంటారని నిర్ధారించుకున్నాను. చేతివేళ్ళు సైగ చేస్తూ తన దగ్గరకు రమ్మని సైగ చేశారు. మెల్లగా వెళ్ళాను. క్రింద కూర్చోమన్నారు. ధునిలోంచి ఊది తీసి నా నుదుటి మీద అడ్డంగా రాసి వెళ్ళి పడుకొమ్మని సైగ చేశారు. నేను తిరిగి వచ్చి నా ప్రక్క మీద కూర్చున్నాను. శరీరము మనసు చాలా తన్మయత్వంగా మారాయి. కళ్ళు మూసుకుంటూ 'హరిఃఓమ్ సాయిరామ్' మంత్రం జపించటం మొదలుపెట్టాను. కొంత సేపటికి జపం ఆగిపోయింది. ఎదురుగా ఆంజనేయ స్వామి కూర్చుని ఆశీర్వదిస్తున్నట్లుగా దర్శనం పొందాను. విచిత్రం ఏ మిటంటే ఆయన ఒంటిమీద ఎర్రని దుస్తులు ధరించి వున్నారు. ప్రక్కనున్న గధ మీద 'శ్రీరామ' అనే పదం రాసి వుంది. అలాగంటకు పైగా గడిపాను.

మరునటి ఉదయం నాగాబాబా శిష్యుడు 'కృష్ణాజీ పండిట్' నా ఫొటోలు తీసుకుని, నేను వారి ఆశ్రమంలో గోసేవలో పని చేస్తున్నట్లుగా తమ ఆశ్రమం నుంచి ఒక పత్రం తయారుచేసి నేపాల్‌గంజ్‌లో వున్న నేపాల్ గృహమంత్రాలయంలో ఇచ్చాడు. వారి నుంచి నా పేరు మీద అధికారిక అనుమతి పత్రం తీసుకువచ్చాడు. నేపాల్ లోను, చైనాలోను ఆ పత్రం వుంటే ఎవ్వరూ ఆపరట. అతి ముఖ్యమైన పత్రం అది. లామినేట్ చేయించుకుని వుంచాను.

వాతావరణంలో మార్పురాకపోవడం వలన విమానాలు కదలటంలేదు. 100 మంది దాకా వెయిటింగ్ లిస్ట్‌లో వున్నారు. నాకు 5000 రుపాయలకు నేపాల్ కరెన్సీ ఇప్పించాడు కృష్ణాజీ. గవర్నమెంట్ విమానంలో కొండ దాటటానికి రూ. 1500/- అవుతుంది. ఆ కొండ దాటిన తరువాత 5 రోజుల నడకవుంటుంది. అప్పుడే చైనాలోకి వెళ్తామట.

వారం రోజులు గడిచిపోయాయి. విమానాలు వెళ్తున్న జాడలేదు. పగలంతా హనుమంతుని మందిరంలో గడపటం, సాయంత్రం, ఎదురుగా వున్న భాగేశ్వరి మందిరంలో కూర్చోవటం.



నేపాల్ కొండల మధ్య ప్రయాణ మార్గంలో...

భాగేశ్వరి మందిరం నేపాల్‌లో ఒక శక్తి పీఠంగా చెప్పుకుంటారు. సింహవాసినిగా వున్న దుర్గమ్మవారు ఆరాధ్యమూర్తి. వాక్‌సిద్ధిని ప్రసాదించే 'వాగేశ్వరి'గా కూడా చెప్పుకుంటారట. ప్రతిరోజూ అమ్మదర్శనం చేసుకొన్నాను. విశాలమైన మందిరం ఎదురుగా పెద్ద కొలను మధ్యలో శివుని మందిరం. అక్కడికి వెళ్ళేందుకు వంతెనను కట్టారు. రెండు కిలో మీటర్ల వైశాల్యంలో చుట్టూ ప్రదక్షిణ చేసేందుకు వీలుగా గచ్చు చేశారు. కూర్చునేందుకు సిమ్మెంటు బెంచీలు వేశారు. సాయంత్రం సమయంలో అక్కడ గడపటం చాలా ఆహ్లాదంగా వుంది. కైలాసమానస సరోవరం వెళ్ళటానికి వచ్చిన కొందరు స్వామీజీలు అక్కడ కలిశారు. విమానాలు ఎప్పుడు వెళ్తాయో తెలియక 15 రోజులనుంచి ఎదురు చూస్తూ వున్నారట పాపం. తిండి సమస్య, పడుకోవటం సమస్య! నాకు ఋషికేశ్ నుంచి మేధానంద పురి స్వామీజీ రికమెండేషన్ వుండటం వలన ఎటువంటి సమస్య లేకుండా హనుమాన్ గుడిలో ఆశ్రయం దొరికింది.

శ్రీకైలాస మానస సరోవరం వెళ్ళటానికి నేపాల్‌గంజ్ ద్వారా వెళ్ళే మార్గం కాక చాలా మార్గాలు వున్నాయి.

***

## శ్రీ కైలాస మానస సరోవర యాత్రా మార్గాలు !


పవిత్ర కైలాస పర్వత ప్రాంతంలోని మంచుకొండలు

కైలాస మానససరోవర యాత్ర సంకల్పం అందరికీ రాదు. వచ్చినా అది సఫలీకృతమవ్వడం అంత తేలిక కాదు. పూర్వీకులు ఎంతో దృఢసంకల్పంతో తమలో భక్తి, శక్తి, యుక్తులను అనుసరించి రకరకాల దారుల గూండా వెళ్ళేవారు. కానీ ఇటీవల కొన్ని సంవత్సరాలుగా అన్ని మార్గములు భారత చైనా సైనికులు కాపలా కాస్తున్నారు కనుక యధేచ్ఛగా వెళ్ళుట కష్టంగా వుంది.

### కైలాస మానస సరోవర యాత్రకు పిలుపు

భారతదేశము, చైనాలు కుదుర్చుకున్న ఒడంబడిక ప్రకారము ప్రతి సంవత్సరము ఏప్రిల్ నెలలో భారత విదేశాంగ మంత్రిత్వ శాఖవారు ఈ యాత్రలందు ఆసక్తి కలిగిన వారినుండి దరఖాస్తులు కోరుతూ రేడియోలు,టి.వి.లు, వార్తాపత్రికల లోనూ ప్రకటనలు చేస్తారు. ఆసక్తి వున్నవారు తమ దరఖాస్తుతో తమ పాస్‌పోర్టు నెంబరును తప్పకుండా తెలపాలి. పాస్‌పోర్టు వుంటేనే 'వీసా' లభిస్తుంది. అలా పంపబడిన దరకాస్తులనుండి 200 నుంచి 300దాకా వ్యక్తులను మాత్రమే లాటరీ పద్ధతిలో ఎంపిక చేసి టెలిగ్రాము ద్వారా యాత్ర తేదీని తెలుపుతూ పిలుపునిస్తారు.

ఒక్కొక్క బృందములో 20 నుంచి 30 మంది వుంటారట. ఎంపిక అయిన వ్యక్తులు తమ పాస్‌పోర్టులతో సహా జిల్లాలోని విదేశాంగ శాఖ ఆఫీసులో రిపోర్టు చెయ్యాలి. ప్రమాదకరమైన ఊపిరితిత్తుల వ్యాధులు, రక్తపోటు, హృద్రోగము వంటి వ్యాధులు వున్నవారు ఈ యాత్రకు పూనుకోకూడదు. అందువలన యాత్రకు వచ్చిన వ్యక్తులను విదేశాంగ శాఖవారు ఢిల్లీలోని ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రత్యేక వైద్యుల చేత శరీర పరీక్షలు జరిపిస్తారు. ఆ వైద్యులు పరీక్షించి పరిపూర్ణ ఆరోగ్యవంతులుగా నిర్ధారించిన పిదపనే యాత్రకు అనుమతిస్తారు.

ఆ తరువాత వీసాకు డబ్బు కట్టించుకుంటారు. ఆ సొమ్ము 60 వేలుదాకా వుంటుందని అంటారు. పై ఖర్చులతో కలిపి కైలాస యాత్రకు లక్ష రూపాయలు దగ్గర దగ్గర అవసరం అని అంటారు.

నేను వెళ్ళింది పూర్తిగా కాలినడక కనక అతి తక్కువ ఖర్చుతో పూర్తి చేసుకున్నాను. ఎంతో ఆశ్చర్యం కదూ!

**ఈ యాత్రకు అన్నింటి కన్నా ముఖ్యంగా కావలసింది మనోధైర్యము, పట్టుదల, తెగింపు, సహనశక్తి మొదలైనవి.**



నేపాల్ గంజ్ హనుమాన్ మందిరంలోని మహాత్ముడు

## యాత్రా మార్గములు

ఋషీకేశ్‌లో శ్రీ స్వామి మేధానందపు తెలిపిన మార్గము.

హరిద్వార్ నుండి గోండావరకు రైలులో,

నారోగేజ్ రైలు మార్గంలో గోండా నుండి రూపేటియా వరకు. అక్కడ నుండి టాంగాలో నేపాల్ గంజ్‌లోకి . అక్కడ C.D.O. అధికా నుంచి అనుమతి పత్రం తీసుకొని విమాన ద్వారా హుమ్లా జిల్లాలోని 'సెమీకోట్' కు చేరుకోవాలి. సెమీకోట్ నుండి అయిదురోజుల పాటు నడక తర్వాతా 'నేపాల్ హిల్సా' అనే ప్రాంతాన్ని దాటుకొని 'సేరా - టిబెట్ బోర్డర్' కు చేరుకోవాలి. అక్కడ నుంచి లారీలో 'తాక్లాకోట్'కు చేరాలి. అక్కడ పాస్ రాయించుకొని లారీ ద్వారా 'ధార్చిన్' చేరాలి. అక్కడ కైలాస పర్వత ప్రదక్షిణ మొదలవుతుంది. ఇది కాక మరికొన్ని మార్గాలు.

- ఢిల్లీ నుండి బస్సు మార్గములో మురదాబాద్, రాంపూర్, రుద్రపూర్, టనక్‌పూర్, అల్మోరా, పిథోరాగడ్ నుంచి ధార్చులా చేరుతారు. అది హిమాలయాలలో చక్కని ప్రదేశము. అక్కడ మనకు భారతీయ, నేపాల్, చైనా మూడు సంస్కృతులు కనిపిస్తాయి. అక్కడనుంచి 'తవాఘాట్' దాకా బస్సు, జీపుల సౌకర్యం లభిస్తుంది. అ తర్వాత నడకతో ముందుకు వెళ్ళాలి. దర్చ్యాంగ్, కాలాపానీ, లిపుపాస్, మొదలైన ప్రాంతాల కొండలు దాటుకుంటూ 'తక్లాకోట్' చేరుకొంటారు. ఈ దూరం సుమారు 900కి.మీ. ఉంటుంది. 16,750అడుగులు ఎత్తును దాటాల్సి ఉంటుంది. ఈ మార్గం మంచి మార్గంగా నిర్ణయించారు. ప్రభుత్వం వారు తమ బృందాలను ఇటు నుంచి తీసుకువెళ్తారు. 'అల్మోరా' అనేది ప్రముఖ పట్టణము. ఒకప్పుడు అక్కడిదాకానే బస్సులు వెళ్ళేవి. అక్కడ నుంచి నడక మీద వెళ్ళేవారు యాత్రికులు
- అల్మోరా నుంచి 'భాగేశ్వర్' 'మిలామ్' ల మీదుగా ఉంతాధురాపాస్ (1759[illegible] అడుగుల ఎత్తు) దాటుకుంటూ జయంతిపాస్ (18500 అడుగుల ఎత్తు) మీదుగా "కుంగి బింగ్రిపాస్' (18300 అడుగుల ఎత్తు) దాటి 'జ్ఞానిమా' మీదుగా కైలాస్ వెళ్ళవచ్చు. ఈ మార్గము గుండా దూరము 340 కి.మీ. ఉంటుంది.
- ఆల్మోరా, అస్కోట్, గేలా, ధార్మాపాస్ దాటుకుని గ్యానిమా నుండి 18510 అడుగుల ఎత్తును దాటి వెళ్ళే మార్గము 365 కి.మీ. ఉంటుంది.
- బదరీనాథ్ వెళ్ళే దారిలోని 'జోషిమఠ్' నుండి 'దుంజన్ నితి పాస్' (1640[illegible] అడుగుల ఎత్తు) మీదుగా 'తోజన్ లా పాస్' (16350 అడుగుల ఎత్తు) ద్వారా 'సిబ్చిలిమ్' మీదుగా గ్యానిమా నుండి దాటి వెళ్ళే మార్గం ఒకటుంది. ఇటు దూరము 260 కి.మీ. ఉంటుంది.

- జోషిమఠ్ నుండి "గుంలా నిలిపాస్" (16600 అడుగుల ఎత్తు) దాటి 'సంగ్రామమండి', సిచ్చిలిం నుండి', గ్యానిమామండి' మీదుగా వెళ్ళే మార్గం 320 కి.మీ. ఉంటుంది.
- 'జోషిమఠ్' నుండి "హోటినిఆపాస్" (16400 అడుగుల ఎత్తు) మీదుగా గ్యానిమామండి' ద్వారా వెళ్ళే మార్గం 260 కి.మీ. ఉంటుంది.
- 'బదరీనాథ్' నుండి 'మానాపాస్' (18400 అడుగుల ఎత్తు) దాటి 'ధూలింగ్ మఠ్', "దాపానాగ్రా", గ్యానిమామండి, మీదుగా 380 కి.మీ. మార్గము.
- "ముఖుహ గంగోత్రి' నుండి 'నీలింగ్', 'జెలుభాగాపాస్' (17490 అడుగుల ఎత్తు) దాటి 'పూలింగ్', 'ధూలింగ్ థపా', 'గ్యానిమామండి' దాటి వెళ్ళే మార్గం 385 కి.మీ. ఉంటుంది.
- 'సిమ్లా' మీదుగా 'రాంపూర్', షిబిపాస్' (15400 అడుగుల ఎత్తు) 'షిరిలింగ్ లా పాస్' (16400 అడుగుల ఎత్తు) 'లోఖెలా' (18510 అడుగుల ఎత్తు) 'చార్ఘూటీ లాపాస్ (16200 అడుగుల ఎత్తు) తీర్థపురి మీదుగా 760 కి.మీ. దూరము
- శ్రీనగర్ నుండి 'జోజిలాపాస్' (11,580 అడుగుల ఎత్తు) 'నమ్మిక్‌పాస్' (13000 అడుగుల ఎత్తు), 'పోటులాపాస్' (13450 అడుగుల ఎత్తు) దాటుకుని 'దేర్ చోక్', 'గార్టక్' 'బార్‌గాట్లా', తీర్థపురి' ల మీదుగా వెళ్ళే మార్గం 970 కి.మీ. ఉంటుంది.
- 'లాసా' నుండి 'తాషిలుంపో' మీదుగా వెళ్ళే మార్గం 1300 కి.మీ. దాకా వస్తుంది.
- నేపాలు రాజధాని ఖాట్మాండు నుండి 'టింకర పాస్' (18500 కి.మీ అడుగుల ఎత్తు), ముక్తినాథ్, గోచార్ నుండి దాటుకొని వెళ్ళే మార్గం ఒకటి చాలా అనుకూలంగా వుంటుందట. అక్కడ నుండి పూర్తిగా కైలాస పర్వతం, మానస సరోవరం వరకు రోడ్డు వుంది. ప్రైవేట్ సంస్థల ద్వారా వీసా తీసుకొని ట్రావెల్స్ కార్లలో వెళ్తుంటారు. దీనికి కూడా 90 వేలదాకా ఖర్చు వస్తుందని అంటారు. ఈ మార్గం నుండి వెళ్ళే దూరం 1300 కి.మీ. ఉంటుంది. ఈ మార్గం ద్వారా 1996 లో అవధూత శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజి గారు వెళ్ళారట. ఇటీవల శ్రీశ్రీశ్రీ చినజీయర్ స్వామీజి కూడా తమ శిష్యులతో ఈ మార్గం ద్వారా కైలాస యాత్రను చేశారు. పూర్తిగా కారులో వెళ్ళగలిగే మార్గమిది.
- **నేను వెళ్ళింది వేరే మార్గం. 'ధార్చూలా' నుండి కాళీనదికి కుడివైపున వున్న కొండలు మీదుగా 18500 అడుగుల ఎత్తైన కొండలు దాటుకుంటూ 'గాగా', టింకర్‌లు దాటుకుంటూ, ప్రమాదకరమైన 'టాటా ఛడాయి' (19000 అడుగుల ఎత్తు' దాటి తాక్లాకోట్ గుండా వెళ్ళే మార్గం సుమారు 980 కి.మీ. దూరం ఉంటుంది.**

ఇలా చాలా మార్గాలు వున్నాయి.

నేను 'నేపాల్ గంజ్' లో విమానం కదలిక కోసం ఎదురు చూస్తు గడుపుతున్న రోజులలో గురుపూర్ణిమ పండగ వచ్చింది. నాకు చాలా ఇష్టమైన రోజు అది. శ్రీ శంకర గిరి నాగాబాబా దగ్గర వుండటం నా అదృష్టంగా భావించాను. ఆయనలోనే 'సాయి' ని



నేపాల్ గంజ్‌లో అభయ గణపతి

చూసుకున్నాను. ఆ రోజు బండారా ఏర్పాటు చేశారు. ఎంతో మంది శిష్యులు వచ్చారు. నేను ఆయనకు దక్షిణ ఇద్దామని 300 రూపాయిలు తీశాను. ఆయన తిట్టినంత పనిచేసి తీసుకోలేదు. మధ్యాహ్నం భోజనాలకుముందు నేపాలీ రూపాయలు 21 నాకు ఇచ్చి నమస్కరిస్తొంటే నేను దూరంగా జరిగాను. "సంత్ మా ఆశ్రమానికి రావటం మా అదృష్టం" అంటూ బలవంతంగా దక్షిణ ఇచ్చారు. ఆయనలోని నిరాడంబరత అది. దూరంగా ఒక ఊరేగింపు వస్తూ కనిపించింది. ఒక బండిమీద పెద్ద ఫోటో పెట్టి వుంది. దూరం నుంచి చూస్తే, చాలా ఆశ్చర్యం, ఆ ఫోటోలోని రూపం నాదిగా కనిపించింది. కళ్ళు మూసుకుని మళ్ళీ తెరిచి చూశాను. ఆ ఊరేగింపు దగ్గరకు వచ్చింది. ఆ ఫోటోలో తెల్లని దుస్తులలో ఉన్న వ్యక్తి సంత్ శ్రీ ఆశారాం బాపూజీ. నాలో అలా ఎందుకు జరిగిందో తెలియదు. మధ్యాహ్నం పడుకుంటే కలలో హైదరాబాద్‌లో వాన పడుతున్నట్లు సాయి భక్తులందరు తడుస్తూ కార్యక్రమాలు చేస్తున్నట్లు కనిపించింది. తర్వాత నేను హైదరాబాద్ వచ్చి చెబితే వారు ఆశ్చర్యపోయారు. నేను వెళ్ళినప్పటినుంచి ప్రతి గురువారం, శనివారం, భజనలలో నేను క్షేమంగా తిరిగిరావాలని ప్రార్థనలు చేస్తున్నారట. ఆ గురుపూర్ణిమ రోజున పల్లకి ఊరేగింపులో శ్రీనందూ బాబా ఫోటోతో పాటు నా ఫోటో కూడా పెట్టి ఊరేగించారట. సాయంత్రం పెద్ద వాన వచ్చిందట. అలాగే తడుస్తూ కార్యక్రమం చేశారట. అదంతా తెలిసి చాలా ఆశ్చర్యం కలిగింది.

10 రోజులు గడిచిపోయాయి. ప్రభుత్వం వారి విమానం కదలడం లేదు. కృష్ణజీ నాకు ఒక సలహా ఇచ్చాడు. ఖాట్మాండు నుంచి ప్రైవేట్ విమానం ఒకటి లగేజి తీసుకొని వస్తుందని అందులో వెళ్తే 3000 రూపాయలు దాకా అవుతుందని అన్నాడు. అది రెండింతలు ఛార్జీ. బాగా ఆలోచించాను. ఎన్ని రోజులు ఇక్కడ వుంటాను? పైగా వర్షాలు పెరిగితే ముందు దారి కూడా కష్టం అని చెబుతున్నారు. వెళ్ళటానికి నేను సిద్ధపడ్డాను. ఒకతను నాకు టిక్కట్టు ఏర్పాటు చేశాడు. నా బ్యాగ్ బరువు 14 కేజీలు వుంది. 15 కేజీలు దాటి తీసుకోరట. నాతో పాటు ఆ విమానంలో మరో ముగ్గురు మాత్రమే వున్నారు. వారు కూడా కైలాస్ వెళ్తున్నారట. అందరం కలిసి వెళ్దామని అనుకున్నాము. ఒకరికి ఒకరు తోడు అని ఆనందించాము. 1400 అడుగులు ఎత్తు కొండను దాటుకుని విమానం హుమ్లా సెమీకోట్ విమానాశ్రయంలో దిగింది. అక్కడ కూడా ఒక హనుమాన్ మందిరం ఉంది. అక్కడకు వెళ్ళాము. మా దగ్గరున్న రొట్టెలు తిని నీరు తాగాను. టీ దొరికింది. తీరా సాయంత్రం ఒక వార్త తెలిసింది. కొండ కూలిపోయి ఒక గ్రామం మొత్తం కనిపించటం లేదట. పైగా మధ్యలో మావోవాది టెర్రరిస్టులు యాత్రికులను కొట్టి డబ్బులు లాక్కొంటున్నారట. అయోధ్య నుంచి వచ్చిన ఇద్దరు స్వామీజీలు చెప్పారు. ఒకాయన



శ్రీ మృత్యుంజయపురి నాగా బాబా

పాపం, ఏడుస్తూ తన దగ్గరున్న 18 వేలు లాక్కున్నారని అంటుంటే నాకు బాధ కలిగింది. ఆ దారిలో వెళ్ళడం చాలా ప్రమాదం అని వాళ్ళు చెప్పటంతో నా యాత్ర ముందుకు వెళ్ళే ఆశ కనిపించలేదు. వర్షాలు పెరిగే సూచన కనిపిస్తోంది. చూస్తూ చూస్తూ ప్రమాదాన్ని వరించాలా? అన్న ప్రశ్న. అందరం అక్కడ గడిపాము. ఎన్నో విషయాలు చర్చించుకున్నారు. అంతా హిందీలోనే మాట్లాడుతున్నారు. ఏమి చెయ్యాలన్న చర్చ మొదలైంది. ముందుకు వెళ్ళడం ప్రమాదం అని, వచ్చే సంవత్సరం కొంచెం ముందుగా మే నెలలో రావటం మంచిదని అన్నారు. వెనకకు వెళ్ళాలన్నా విమానం లేదుగా! తెలుసుకుందామని మేము విమానం దిగిన చోటుకు వచ్చాము విమానం తిరిగి వెళ్తోందట. మళ్ళీ విమానాలు ఎప్పుడు వెళ్తాయో చెప్పలేమని, వచ్చేది వుంటే వెంటనే రమ్మని అన్నారు. మేమంతా కొంచెం నిరాశగా వున్నా, వెనకకు వెళ్ళేందుకు, మళ్ళీ ఆ అవకాశం దొరకదని నిర్ణయించుకొని తిరిగి నేపాల్ గంజ్ వచ్చేశాము. నేను హరిశంకరగిరి నాగా బాబా దగ్గరకు వెళ్ళ లేదు. 'రానీ తలాబ్' దగ్గర వున్న 'ఉదాసీన్ ఆశ్రమం' లోకి వెళ్ళాను. మరొక కొత్త అనుభవం అక్కడ ఎదురైంది.

## నేపాల్ ఉదాసీన ఆశ్రమంలో- నాగా బాబా ఇచ్చిన మలుపు!

ఒక స్వామీజీ ఉదాసీన్ ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నారు.

వంట చేసేందుకు ఆయన దగ్గర ఇద్దరు కుర్రాళ్ళు వున్నారు. వారు రోజంతా గంజాయి పీలుస్తూనే వుంటారు. ఆ ఆశ్రమం చాలా చిన్నది. వెనుక తోట మాత్రం చాలా వుంది. రాత్రి సమయంలో దోమలు విపరీతంగా వున్నాయి. అరగంట కూడా సరిగా నిద్ర పట్టలేదు.

నిజానికి తరువాత ప్రయాణం ఎటో తెలియటం లేదు. ఎన్నో ఆశలతో వచ్చిన నేను వెనుకకు తిరిగివెళ్ళటం ఇష్టం లేదు. ఎలాగైనా మానస సరోవర యాత్ర చేసుకోవాలని వుంది కానీ, శ్రీ మేధానందపురి స్వామీజీ చెప్పిన మార్గంలో ఇక ఆశలేదు. ప్రభుత్వ విమానాలు ఇంకా కదలటం లేదు. ఎంతోమంది ఆశతో నేపాల్ గంజ్‌లో ఎదురుచూస్తున్నారు. ఉదాసీన్ ఆశ్రమంలో వంట చేసే ఒకతను రేడియోలో వార్తలు విని "వర్షాలు కారణంగా కొండలు పడిపోతున్నాయి. మావోవాదులు దారుణంగా ప్రవర్తిస్తున్నారు. ఇంకెందుకీ ఆశ? వెనుకకు వెళ్ళిపోయి మళ్ళీ సంవత్సరం రండి" అంటూ కొంచెం కోపంగా చెప్పాడు. అతను అనేది నిజమే వార్తలను బట్టి నేపాల్ కొండలలో ప్రమాదం కనిపిస్తోంది. నేను మౌనంగా తల ఊపాను. కానీ వెనకకు వెళ్ళాలని లేదు.

సాయంత్రం ఇండియా బోర్డర్ దగ్గరకు వెళ్ళి వేదప్రియ, మోహన్‌రావు, మధులతో ఫోనులో మాట్లాడాను. నా దగ్గర ఆరువేలు ఖర్చయిపోయాయి. ఎలాగైనా ఆరువేలు పంపమని కోరాను. ఇంతవరకూ ఎవరినీ డబ్బులు అడగలేదు. కానీ ఈ పరిస్థితిలో అడగక తప్పలేదు. వారు పాపం వెంటనే పంపుతాం అన్నారు. ఎక్కడకు పంపాలన్నారు. ఋషికేష్‌లో ఉన్న శ్రీమూర్తిగారికి పంపమని వారి దగ్గర నుంచి నేను తీసుకుంటానని అన్నాను. శ్రీమూర్తిగారికి ఫోన్‌చేసి విషయం చెప్పాను.

రెండు రోజులు గడిచిపోయాయి. రోజూ సాయంత్రం భాగేశ్వరి మందిరం దగ్గర కూర్చుని వస్తున్నాను. ఒకరోజు, గురువారం సాయంత్రం నేపాల్ గంజ్ బజార్లో నుంచి వెళ్తోంటే ఒకతను వచ్చి హిందీలో "స్వామీ, మిమ్మల్ని బాబా పిలుస్తున్నారు" అని అన్నాడు. నాకాశ్చర్యం వేసింది. నాకు తెలుసున్న బాబా ఎవరున్నారు? నన్నేనా? అని అడిగాను అవునన్నాడు. మౌనంగా అతని వెనక వెళ్ళాను. చెక్క తలుపులున్న ఒక షాపులోకి తీసుకువెళ్ళాడు. ఒకాయన పొడగాటి జుట్టుతో, పొట్టి చొక్కా, పంచె ధరించివున్నాడు. ఆయన పక్కన కాషాయ బట్టలు ధరించిన ఇద్దరు వున్నారు. అందరి మెళ్ళో పూసల దండలున్నాయి. ఆ ప్రక్కనే వున్న టేబుల్ లైట్ కాంతిలో పెద్దాయన ముఖం స్పష్టంగా కనిపిస్తోంది. ఆయన పేరు "మృత్యుంజయపురి నాగా బాబా" అని, నన్ను పిలిచింది ఆయనే అని, నన్ను తీసుకువెళ్ళిన వ్యక్తి పరిచయం చేశాడు. వెంటనే నేను ఆయనకు పాద నమస్కారం చేశాను. "నువ్వు ఎప్పుడూ ఎవ్వరికీ నమస్కరించకు. నీకే పదిమంది నమస్కరిస్తారు. నీ పాదపూజ చేస్తారు". అని అన్నాడు. నాకు నవ్వు వచ్చింది. "నాలోని అహంకారాన్ని పెంచాలనుకుంటున్నారా బాబాజీ" అని అడిగాడు. వెంటనే ఆయన నేపాలి భాషలో ప్రక్కవాళ్ళతో ఏదో అన్నాడు. ఆయన మాటలలో జ్ఞాన మార్గం అన్న వాక్యం అర్థం అయ్యింది. నన్ను మెచ్చుకున్నాడని తెలుస్తోంది. ఆ తరువాత ఆయన భగవంతుడిని చూశావా? జీవితానికి ఏమి కావాలి? నీ లక్ష్యం ఏమిటి? మరణం వస్తే ఏమి చెయ్యాలి?... ఇలాంటి ప్రశ్నలు చాలా వేశాడు. నాకు తెలుసున్నంత వరకూ సమాధానం చెప్పాను. "ఏ ఏ శాస్త్రాలు చదివావు?" అని అడిగాడు "నాకున్నదంతా అనుభవ జ్ఞానమే తప్ప ఏమీ చదువలేదు. శ్రీసాయి సచ్చరిత్రను మాత్రం అనుసరిస్తున్నాను" అని చెప్పాను. "నీవు కొన్ని జన్మలుగా సాధువుగా వున్నావు. ఈ జన్మలో కూడా అలాగే మారావు. నాతో వస్తావా 'సంత్'ని చేస్తాను?" అని అడిగారు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఈ సన్యాసం కూడా నేను ఊహించినది కాదు. కాశీలో బాబా ఇచ్చిన ఆదేశం. ఈ కైలాస మానస సరోవర యాత్ర కూడా అలాగే సంకల్పించబడింది. మళ్ళీ ఈ 'సంత్' అనే పాత్ర ఏమిటి? ఇంకా సన్యాసి అంటే ఏమిటో తెలుసుకోలేదు కదా! ఆ విషయాన్నే ఆయనతో చెప్పాను. "నువ్వు కొన్ని సంవత్సరాలుగా జీవిస్తున్నది సాధు మార్గంలోనే. ఈ రోజుల్లో సన్యాసి అవ్వటం పెద్ద కష్టం కాదు. ఎర్ర గుడ్డ చుట్టుకొని మెళ్ళో ఒక మాల వేసుకుని 'సన్యాసులం అయ్యాము' అని చెప్పుకుంటున్నారు ఎంతోమంది. 'సంత్'గా మారటం ఒక జ్ఞానస్థితి. సన్యాసం ఒక దీక్షమాత్రమే! నీవు నాతో వస్తే 'సంత్'గా సాధన ఇస్తాను వస్తావా?" అని ఆవేశంగా మాట్లాడుతూ అడిగాడు. ఆయన ముఖంలో తీవ్రత, భీకరత్వం కనిపించాయి. ఆయన గంజాయి వెలిగించి అందరికీ ఇస్తూ నాకూ ఇచ్చాడు. నాకలవాటు లేదన్నాను. ప్రక్కనున్న ఒక వ్యక్తి "బాబా, మనం అమర్‌నాథ్ వెళ్తున్నాము కదా!

ఈయనను ఎక్కడికి తీసుకువెళ్తావు?" అని అడిగాడు. "ఇతను వస్తానంటే, నేను అమరనాథ్ రాను. మీరు వెళ్ళండి. ఇతనితో నాకు చాలా పనుంది. హిమాలయలలోకి తీసుకు వెళ్ళాలి ఇతన్ని" అని అన్నాడు బాబా. ఆయనను అమర్‌నాథ్ రమ్మని వాదించారు. కానీ ఒప్పుకోలేదు. నాకు ఏమి చెప్పాలో తెలియడం లేదు. నాగాబాబాల గురించి చాలా విన్నాను. వారు చాలా క్రూరంగా ప్రవర్తిస్తారట. మనిషి మాంసం తినటానికి కూడా వెనకాడరట. నన్ను ఒక్కడిని తనతో రమ్మంటున్నాడు. వెళ్ళాలా, వద్దా?

ఆయన హిమాలయ గురువుల గురించి, సాధన గురించి ఎంతో చెప్పాడు. సమయం 8 గంటలు అయ్యింది. చీకటి పడిన విషయం తెలియలేదు. "నాకు కైలాస మానస సరోవరం వెళ్ళాలని వుంది. అది ముఖ్యం, వచ్చాక హిమాలయాలలోకి వెళ్ళవచ్చు" అని అన్నాను. "నేను కైలాస పర్వతం దగ్గరకు కూడా తీసుకువెళ్తాను. హిమాలయాలలోంచి అడ్డదారి వుంది. కాలినడకన వెళ్ళవచ్చు. ముందు నాతోరా నీకు చూపిస్తాను" అని అన్నాడాయన. "నాదగ్గర డబ్బులు తక్కువ ఉన్నాయి." అన్నాను. ఆయన నియమము తన చేత్తో రూపాయి తాకడు. ఎవరినీ డబ్బులు అడగడు. తనకు అవసరమైనవి అవ్వే తనకు అందుతాయట. "నీకు డబ్బుతో పనిలేదు. నీ డబ్బులు మిగులుతాయి. ఎక్కువ ఖర్చులేకుండా నేను తీసుకువెళ్తాగా" అన్ని అన్నాడాయన. అయినా ఆయన మీద నాకు నమ్మకం బలపడడం లేదు. 'ఇక కైలాస యాత్ర చెయ్యలేను" అని అనుకుంటున్న దశలో ఆయన కలిశారు. ఒకవేళ ఆయన ద్వారా ఆ మార్గం దొరకవచ్చు. కానీ బాహ్యంగా మనిషిని చూస్తుంటే భయంకరంగా వున్నాడు. పైగా నాగాబాబా. ఎన్నో అనుమానాలు నాలో మొదలయ్యాయి. "రేపు ఉదయం, మీకు చెబుతాను" అని అన్నాను. ఆయనకు కొన్ని ఫోటోలు తీశాను. "నీకోసం అమర్‌నాథ్ మానుకుంటాను తప్పకుండా వస్తావుగా?" అడిగారు మృత్యుంజయపురి నాగాబాబా. "నాకోసం ఎందుకు అలా చేస్తున్నారు". "నీకు మంచి అర్హత వుంది. హిమాలయాలలో ఒక ఆశ్రమానికి తీసుకువెళ్తాను. అక్కడ నిన్ను సంత్‌గా మారుస్తాను. నీలాంటి వాళ్ళు నాకు మళ్ళీ దొరకొద్దూ" అని అన్నాడాయన. ఆయన మాటలు వింటుంటే ఆనందించాలో, బాధపడాలో తెలియడం లేదు. నాకూ అంతటి అర్హత వుండే అంటున్నాడా? లేక నానుంచి ఏమైనా ఆశిస్తున్నాడా?

తిరిగి ఉదాశీన్ ఆశ్రమానికి వచ్చాను. వారు రొట్టెలు వండుతున్నారు. ఆశ్రమ పెద్ద నా ప్రయాణం గురించి అడిగారు. నేను మృత్యుంజయపురి నాగాబాబా గురించి చెప్పి" ఆయన నన్ను హిమాలయాలలోకి తీసుకువెళ్తానంటున్నాడు. అక్కడ కొండలలోనుంచి కైలాస పర్వతం కూడా ఎక్కిస్తానంటున్నాడు". అని చెప్పాను. వాళ్ళు వెంటనే "వాడు దొంగ" అతని మాటలు నమ్మకు. నేపాల్ గంజ్‌లో ఎంతో మంది కుర్రాళ్లను అలాగే చెప్పి గంజాయి తెప్పించుకుంటారు. గంజాయి, నల్లమందు లేకుండా బ్రతకలేడు. కొంత దూరం వెళ్ళి నీ దగ్గరున్న డబ్బులు లాక్కొంటాడు. వాడు చాలా ప్రమాదరకమైన వ్యక్తి" అని చెప్పారు. నాలో ఊగిసలాటగా వున్న అనుమానానికి వారి మాటలు మరింత బలాన్ని ఇచ్చాయి. ఎక్కడో కాస్తంత బలంగా ఉన్న నాలోని ఆశ నీరుగారి పోయింది. రొట్టెలు తింటుండగా వాళ్ళు మళ్ళీ ప్రస్తావన తెచ్చి అతనితో వెళ్ళవద్దని, తిరిగి ఇండియాకు వెళ్ళిపొమ్మని అన్నారు. నేను అలాగే చేస్తాను అని తలూపాను.



నేపాల్ కొండలలో హిమాలయ మార్గము

రాత్రంతా నిద్ర పట్టలేదు. ఒక పక్క దోమలు, మరొక పక్క కైలాస యాత్ర ప్రయాణం వెళ్ళాలని ఎంతో ఆశగా వున్నా మృత్యుంజయపురి నాగాబాబాను తలచుకుంటే భయం వేస్తోంది. నాకు తెలియకుండానే నిద్రపట్టింది.

నాలుగు గంటలకు లేచి స్నానం చేశాను. ధ్యానానికి కూర్చున్నాను. సాయిబాబాకే నివేదించుకున్నాను. ఏమిచెయ్యాలో చెప్పమని ఏమీ సమాధానం రాలేదు. తెల్లారింది. ఆ ఆశ్రమంలో 500 సంవత్సరాల క్రిందటి చెట్టువుంది. ఎంతోమంది మహాత్ములు ఆ చెట్టుకింద ధ్యానం చేసుకొని సిద్ధులు పొందారట. ఉదయం 7 గంటలకు ఆ చెట్టుకింద కూర్చుని నా ప్రశ్నను విన్నవించుకున్నాను.

పది నిమిషాల తర్వాత నా చెవులలో స్పష్టంగా వినిపించింది **"తుమ్ చలే జావ్. తుమ్హా రేలియే నాగాబాబా కో భేజా హ మహరాజ్, ఏ ఈశ్వర్ కా ఆదేశ్ హై"** అన్న మాటలు వినిపించాయి. ఉలిక్కిపడ్డాను. అక్కడ ఎవ్వరూ లేరు. ఆ మాటలు చాలా స్పష్టంగా వున్నాయి. వెంటనే కాగితం మీద రాసుకున్నాను. నాలో ఆనందం చోటుచేసుకుంది. నిరాశతో వున్న నేను నాగాబాబా గురించి ఎందుకు భయపడ్డానో తెలియలేదు.

ఆ అవకాశం నా కోసం వచ్చింది. నేను నమ్మిన సాయిబాబా ఆయన రూపంలో వచ్చాడేమో! అని వెంటనే బజారులోకి వెళ్ళి ఆయనను కలిశాను. ఆయనతో 'రావటానికి నేను సిద్ధమే' అన్నాను. నా దగ్గరున్న నేపాలీ కరెన్సీని ఇండియా కరెన్సీగా మార్చుకున్నాను. వేరొక ఇండియా బోర్డర్‌కు వెళ్ళాలని, సాయంత్రం 4 గంటలకు రూపేటియాలో రైలు దొరుకుతుందని సిద్ధంగా వుండమని అన్నాడాయన. ఆయన ప్రక్కన కాషాయ వేసంలో వున్న వ్యక్తి నాదగ్గరకు వచ్చి "బాబాతో కొంచెం జాగ్రత్తగా వుండు" అని అన్నాడు. మళ్ళీ ఇదేమిటి? అని అనుకున్నాను. అయినా అంతా బాబా దయ! ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. ఇక ఏమీ ఆలోచించకుండా ముందుకుపోవడమే అని అనుకున్నాను.



# నాగా బాబాతో ప్రయాణం !

అసాధ్యం అనుకున్న దశలో నా కైలాస మానస సరోవర యాత్ర మలుపు తిరిగింది.

మనిషిలో నమ్మకం, విశ్వాసం, ప్రయత్నం తీవ్రంగా వుంటే అసాధ్యం లేదు. లక్ష్యానికి తగిన సంసిద్ధత పరిపూర్ణంగా వుంటే ఎటువంటి సమస్యకైనా పరిష్కారం -మార్గదర్శకత్వం అందించేందుకు, ప్రకృతి లేదా భగవంతుడు లేదా పరమాత్మ లేదా సాయి బాబా.... ఏ పేరుతో పిలిచినా, ఆ శక్తి స్వరూపం మన కోసం ఎప్పుడూ సిద్ధంగా వుంటుందని నాకు బాగా అర్థం అయ్యింది.



బాబాజీ గుహలో నాగా బాబా, పూజారి గౌరహరి, నారద

శ్రీ మృత్యుంజయపురి నాగా బాబా "కైలాసం నేను చూపిస్తాను, నీకు సంత్ స్థితిని అందిస్తాను" అంటూ విశ్వాసంతో తనను అనుసరించమనటం భగవంతుని కృపగా తోచింది నాకు.

నిజానికి ఈ యాత్ర వలన లాభం ఏమిటి? కైలాస పర్వతాన్ని దర్శిస్తే, మానస సరోవరంలో మునిగితే ఏమి వస్తుంది? ముక్తి వస్తుందా? మోక్షం వస్తుందా? పుణ్యం లభిస్తుందా? అసలు తీర్థయాత్రల వలన మనం పొందేది ఏమిటి? పైన చెప్పుకున్నవి లభించేట్లయితే ఇప్పటివరకు కొన్ని లక్షల మంది పవిత్ర తీర్థయాత్రలు చేసి వున్నారు. కొన్ని వేల మంది ఈ కైలాస మానవ సరోవర యాత్ర చేసివున్నారు. వీరంతా ముక్తిని పొందారా? ఎటువంటి మార్పు వారి జీవితంలో చోటుచేసుకుంది? అసలు అటువంటి ప్రభావం ఏమైనా కనిపిస్తోందా? ఒకవేళ కనిపిస్తే అది అందరిలోనూ సమానంగా కనిపిస్తోందా? ఈ ప్రశ్నలకు సమాధానాలు వెతికితే సత్యం అర్థం అవుతుంది.

జగద్గురు ఆది శంకరులు చెప్పినట్లు

"కురుతే గంగా సాగర గమనం
వ్రత పరిపాలన మథవా దానమ్!
జ్ఞాన విహీన స్సర్వమతేన
ముక్తింభజతిన జన్మశతేన!!

భావార్థం : గంగ, సాగర సంగమాలు ఎన్నింటిలోనో స్నానం చేసినా, వ్రతాలు, పూజలు, నోములు చేసినా, లాభం లేదు. జ్ఞానం పొందకుండా నూరు జన్మలు ఎత్తినా ముక్తి అన్న దానిని ప్రాప్తించుకోలేదు. సర్వ శాస్త్రాలు ఈ విషయాన్నే నిర్ధారిస్తున్నాయి.

కనుక ఇటువంటి యాత్రలు చేసేటప్పుడు అడుగు అడుగులో, అణువు అణువును ఆస్వాదిస్తూ అవగాహన పెంచుకుంటూ వెళ్తేనే మనకు జ్ఞానం లభిస్తుంది. అటువంటి జ్ఞానం కారణంగానే మనకు జీవితం అర్థం అవుతుంది.

శ్రీ మృత్యుంజయపురి బాబాకు తెలియని విషయం లేదు. శాస్త్రాలమీద మంచి అవగాహనవుంది. మంత్ర, తంత్ర విద్యలు నేర్చుకొన్నాడు. హిమాలయాలలో అన్నీ తిరిగివచ్చాడు. ఆయనకున్న గొప్ప లక్షణం ఆశువుగా కవిత్వం చెప్పడం. ఏ విషయం మీదనైనా సరే అప్పటికప్పుడు హిందీలో కవిత అల్లేస్తాడు. ఏ విషయం గురించైనా సరే చర్చ మొదలు పెట్టినా గంటలకొలది మాట్లాడతాడు.

సాయంత్రం 4 గంటలకు 'నేపాల్ గంజ్'నుంచి ఇండియా బోర్డర్ రూపేటియా స్టేషన్‌కు వచ్చాము. బయలుదేరేముందు శ్రీ నాగబాబా 6 ముఖాల రుద్రాక్షను యజ్ఞోపవీతంలో దూర్చి మాలగా చేసి నా మెళ్ళో వేసి "**నీకు ఇది రక్షగా వుంటుంది. రాత్రి నువ్వు ఏకముఖి రుద్రాక్ష కావాలని అడిగావు కదా! ఈ ఆరు ముఖాల రుద్రాక్ష ఏకముఖితో సమానం. నీకు దీని ద్వారా ఆ శక్తి లభిస్తుంది. ఇది నా దగ్గర కొన్ని సంవత్సరాల నుంచి వుంది. నీకు ఇస్తున్నాను నీవు నా పరంపరలోకి వచ్చావు. సంత్‌గా పిలవబడతావు. నీకు ఆధ్యాత్మికంగా మంచి ఉన్నతి లభిస్తుంది**" అని తన భుజం మీద వున్న చిన్న తుండును నా భుజం మీదవేశాడు. వెంటనే నేను వంగి పాద నమస్కారం చేశాను. "నీవు జర్నలిస్టువి కనుక నేను ప్రయాణంలో ఎన్నో విషయాలు చెబుతాను అవసరమనిపిస్తే రాసుకో" అని చెప్పాడు.

మేము 4-30 గంటలకు రూపేటియా వచ్చాము. అక్కడ నుంచి రెండు స్టేషనులో అవతలవున్న 'నాన్‌పారా' స్టేషన్‌లో దిగాము. అక్కడ నుంచి వేరే రూట్‌లో ఇంకొక రైలు ఎక్కి 'మైలాని' అనే జంక్షన్‌కు బయలుదేరాము.

చిమ్మ చీకటి అంటే ఏమిటో తెలిసింది. రైలు వెళ్తున్నంత సేపు కంపార్ట్‌మెంట్‌లో లైటు వెలుగుతుంది. రైలు ఆగితే ఆ లైటు ఆరిపోతాయి. ఆ ప్రాంతమంతా అడవి ప్రాంతం అవ్వటం వలన స్టేషన్‌లలో కూడా కరంటు లేదు. లాంతరు వంటి దీపాలు ఒకటి రెండు కనిపించాయి. ఆ రూటులో రైళ్ళు కూడా చాలా తక్కువ. నేపాల్ బోర్డర్ అనుకొని, ఇండియా రూట్‌లో వెళ్తుంది రైలు. మూడు గంటల ప్రయాణం తర్వాత కాళీనది వచ్చింది. దగ్గర దగ్గర 25 నిముషాలు నది మీద కట్టిన డామ్ మీద రైలు వెళ్తోంటే ఆ దృశ్యం చాలా బాగుంది. అంతగా వెలుగు లేకపోయినా అంత విశాలమైన నదిని చూడటం అద్భుతంగా అనిపించింది. ఆ నదిలో 7 నదులు కలుస్తాయట! అన్నీ హిమాలయాల నుంచి వస్తాయట. మనకు తెలియని సుందర భారత దేశం ఎంత వుందో! ఈ రైలు ప్రయాణంలో నేను రకరకాల ప్రశ్నలు వేశాను. ఆయన నాకు అనుభవానికి దగ్గరగా వివరించారు. కదిలే రైలు, మసక వెలుతురు అవ్వటం వలన రాసుకోవటం కుదరలేదు.

గురువు గురించి నేను ప్రశ్నించినప్పుడు ఆయన కబీరు మాటలు గుర్తుకు తెచ్చారు.

**"గురు బిన్ కౌన్ బతాయే బాట్"**

ఏ విషయావగాహనకైనా గురువు తప్ప వేరెవరు సరైనా మార్గం తెలుపగలరు? ఎంత సత్యమో కదా! **గురువు సన్నిధిలో గురువు కృపలోనే మన సాధన ప్రారంభమవుతుంది. ఆ గురువు యొక్క అనుగ్రహంతోనే మనలోని సాధన స్థిరపడుతుంది. వృద్ధి చెందుతుంది. అఖరికి గురువు కృపతోనే సాధన పరిపూర్ణమై, పరిపక్వమై జ్ఞానస్థితిలో కూర్చో బెడుతుంది.**

ఇలా గురువు గురించి గంటకుపైగా తెలిపాడు నాగాబాబా. గురువుతో కలిసి నడుస్తూ ఆయన చెప్పింది చేస్తూ, ఆయన అడిగింది అందజేస్తూ, ఆయన నీడలో గడిపితే చాలట. మరొక పూజతో పనిలేదట. ఆయన (గురువు) తనంత వాడిగా శిష్యుణ్ణి మార్చుకుంటాడట!

నేను నమ్ముకున్న సిద్ధయోగి శ్రీ షిర్డి సాయి బాబా ఈయన రూపంలో వచ్చి, నన్ను తనతో తీసుకువెళ్తూ, తన కృపను ఆయన మాటల ద్వారా నాకు తెలుపుతున్నట్లుగా అనిపించింది.

మేము జనరల్ కంపార్టుమెంటులో ఎక్కాము. అందులోనే ఎక్కుదామని ఆయన అన్నాడు. కారణం ఉత్తరాంచల్‌లో, రైళ్ళలో సాధు, సంతులు జనరల్ బోగిలో ఎక్కితే టిక్కెట్లు అడగరట...!

క్రమేపి ఆ బోగి ఖాళీ అయిపోయి, మేమిద్దరం, మరొక వ్యక్తి మాత్రమే మిగిలాము. ఒక్క క్షణం నాలో ఒకరకమైన ఆందోళనపూరితమైన అలోచన పుట్టింది. **నాగాబాబాలు నరమాంసం తింటారని, ఈయన మోసగాడని, జాగ్రత్తగా వుండాలని, నేను గతంలో విన్న మాటలు గుర్తుకువచ్చాయి. అంతే కొన్ని నిముషాల పాటు రవ్వంత భయం నాలో చోటుచేసుకుంది.** కిటికీలోంచి రివ్వున వస్తున్న చల్లని గాలిని కూడా పట్టించుకోకుండా దూరంగా కనిపిస్తున్న చీకటి రూపాలను గుచ్చి గుచ్చి చూస్తున్నాను. వేగంగా వెళ్తున్న రైలు కారణంగా దయ్యాల్లా పరుగెదుతున్న ఆ రూపాలు గుర్తించటానికి వీలుపడటంలేదు. ఒక్కసారి బెర్తుమీద పడుకుని గంజాయి పీలుస్తున్న మృత్యుంజయ పురి నాగాబాబా వైపు చూశాను. ఆయన 'మస్త్' అనే స్థితిలో ఉన్నాడు అనిపించింది. నల్లగా వున్న ఆయన ఒంటిమీద చొక్కాతీసేశాడు. కట్టుకున్న ఎర్రపంచెను గోచీలాగా వెనుకకు బిగించాడు. పొడవైన జుట్టు ఆయన చిలుము పీలుస్తుంటే ఆ చీకటి బోగిలో నిప్పు రవ్వరాజుకుని వెలుగును నింపింది ఒక్క క్షణం.

రాత్రి 12.30 గంటలకు 'మైలాని' అనే స్టేషనులో దిగాము. అది జంక్షన్. అక్కడినుంచి మరొక రైలు మారాలట! అది మరొక రెండు గంటల దాకా రాదన్నారు. ప్లాట్‌ఫారం చివరకు తీసుకువెళ్ళారు నన్ను. తన పంచెను విప్పినేలమీద పరచుకొని చిన్న మూటలాంటి సంచిని తలకింద పెట్టుకుని విశ్రాంతిగా పడుకున్నాడు. ఒంటిమీద పొట్టి చేతుల తెల్లని చొక్క, కింద గోచీలాంటి గుడ్డ! ఎంత స్వేచ్ఛ! ఎంత నిర్భయం! ఎంత నిరాడంబరం! నేను కూడా ఆయనకు దగ్గరగా దుప్పటి పరచుకుని నడుం వాల్చాను. కొంతసేపు తర్వాత రైల్వే అధికారి వచ్చి ప్లాట్‌ఫారం మీద వ్యక్తులను టిక్కెట్లు అడుగుతున్నారు. నాకు భయం వేసింది. ఇప్పటికి రెండు రైళ్ళు మారాము. మూడవ రైలు ఎక్కుతున్నాము. ఎక్కడా టిక్కెట్టు కొనలేదు.

నాగాబాబాతో, అధికారి వస్తున్న విషయం చెప్పాను! ఏం పర్వాలేదు. పడుకో అన్నారు. చివరికి అతను మా దగ్గరకు వచ్చాడు. "ఎక్కడికి వెళ్తున్నారు మహారాజ్" అని అడిగాడు.

నాగాబాబా లేచి చెప్పాడు. అతను మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. సరికొత్త అనుభవం నాకు!

ఒక గంట తర్వాత ఆ అధికారి మళ్ళీ మా దగ్గరకు వచ్చాడు. **నాగాబాబా ప్రక్కనే పరచివున్న లుంగీమీద కూర్చున్నాడు. ఈయన గంజాయి సిద్ధంచేసి వెలిగించి ఆయనకు ఇచ్చాడు. ఇద్దరు ఒకరి తర్వాత మరొకరు నాలుగైదు సార్లు పీల్చారు. ఇద్దరు తమ తమ స్థితులు మర్చిపోయి మరో లోకంలో విహరించారా! అన్నట్లు** కనిపించింది నాకు. ఏవేవో కబుర్లు. నాకు చాలా కొద్దిగా అర్థం అయ్యాయి.

2 గంటల ప్రాంతంలో రైలు ఎక్కి ఉదయం 8 గంటలకు 'కాలకువా' స్టేషన్‌లో రైలు దిగాము. అక్కడ నుంచి మేము వెళ్ళాల్సిన స్టేషన్ అరగంట ప్రయాణంలో ఉందట. కానీ రావాల్సిన రైలు ఎప్పుడొస్తుందో తెలియదు.

శ్రీ నాగాబాబా ప్లాట్‌ఫారం చివరలో గడ్డివున్న ప్రాంతంలో కూర్చుందామని తీసుకువెళ్ళాడు. రైలు పట్టాలమీద, రైళ్ళకు నీరు నింపే కుళాయి కనిపించింది. స్నాన కార్యక్రమం చేసేద్దామన్నాడు. అంతే ఆయన చేసి వచ్చిన తర్వాత నేను చేసి వచ్చాను. నా దగ్గరున్న అటుకులు, బిస్కట్లు తీశాను. కొన్ని తిన్నాము. ఆయన చిలుం వెలిగించగానే, ఎక్కడినుంచి వచ్చారో, నలుగురైదుగురు వచ్చారు. వారిలో ఒక 'సాధువు' కూడా ఉన్నారు. ఆయన పేరు అఘోరీ బాబా! ఆయన మానస సరోవరం వెళ్ళివస్తున్నాడట. ఆయనతో కలిసి ఫొటోలు దిగాము. మధ్యాహ్నం 12 గంటలకు 'కాటేగోదామ్' స్టేషన్‌లో దిగాము. అది నైనితాల్‌కు 30 కి.మీ దగ్గరలో వున్నది.అది ఆఖరి రైలు స్టేషను హిమాలయాలలో ఇక నడక లేదా జీపులు వంటి వాహనాలలో వెళ్ళాల్సిందే! పెద్దనదిపైన వున్న వంతెన దాటిఎత్తైన కొండమీద వున్న హనుమంతుని మందిరంలోకి తీసుకువెళ్ళాడాయన. అక్కడివారు ఆయనను గుర్తుపట్టారు. క్రింద పారుతున్న నదిలో స్నానం చేద్దామన్నాడాయన. చేసి వచ్చాక మా దగ్గరున్నవి తిని, నీళ్ళు తాగి 2 గంటలకు మినీ బస్సు లాంటిది వస్తే ఎక్కి 'హరిఖండ్'లో నున్న ఆశ్రమానికి బయలుదేరాము. ఎత్తైన కొండలమధ్య, ముద్ద కర్పూరం చెట్లను దాటుకుంటూ 35 కిలో మీటర్లు దట్టమైన అడవుల మధ్య సుమారు వంద ఎకరాలలో ఉన్న ఆశ్రమం అది.

మూడువేల సంవత్సరాల క్రితం జీవించి, ఇప్పటికీ కొంతమందికి ప్రత్యక్ష దర్శనం ఇస్తున్న శ్రీమహావతార్ బాబాజీగారి పరంపరలోని శ్రీ భగవాన్ హైడాఖండవాలే బాబా గారు స్థాపించిన ఆశ్రమం వారి శిష్యులు కీ.శే. భగవాన్ హైడాఖాన్ విహారిగారు నడిపిన దివ్యలీలలు ఎన్నో ఉన్నాయి.



# హైడాఖాన్ బాబా ఆశ్రమంలో సాధన!



బాబా ఆశ్రమంలోని తొమ్మిది దేవాలయాల సముదాయం

బస్సుదిగి రోడ్డు ప్రక్కనే వున్న రాళ్ళమధ్యనుంచి నడక ప్రారంభించాము. అక్కడ నిలబడి ఒక్కసారి చుట్టూ చూశాను. హిమాలయ సౌందర్యం అద్భుతం. ఆకాశాన్ని అంటిన కొండ వరుసలు. దూరంగా అందంగా మెలికలు తిరిగి కనిపిస్తున్న గంగానదిపాయ. కర్పూరపు వృక్షాలు, దేవదారు వృక్షాలు, సిద్ధి పొందిన సాధువుల్లా నిరాడంబరంగా, నిటారుగా ఆకాశంవైపు నిలబడి ఉన్నాయి! ముందు శ్రీ మృత్యుంజయపురి నాగాబాబా నడుస్తున్నారు. వారి వెనుక సుమారు 15 కేజీల బరువు వీపుమీద, చేతిలో కర్ర, స్లీపింగ్ బ్యాగ్‌తో నేను నడుస్తున్నాను. అంత బరువు మోసుకువెళ్ళటం నరకంగా వుంది. ఏదో ఒకరకంగా దీనిని తగ్గించాలి అని నిర్ణయించు కున్నాను. ఆ కొండల మధ్య మేము ఆగిన చోట ఒక లోయ వుంది. అక్కడనుంచి ఇంకా క్రిందకు నడుస్తుంటే మేము పాతాళానికి వెళ్తున్నామా అని అనిపించింది. బరువు మొయ్యలేక రెండు మూడు చోట్ల ఆగుతూ, గంట తర్వాత హైడాఖాన్ బాబా ఆశ్రమానికి చేరాము. ఆశ్రమం ఎదురుగా వున్న టీ కొట్టు దగ్గర కూర్చున్నారు బాబా. ఆ కొట్లో వున్న వ్యక్తితో మాటలు కలిపి చిలుము వెలిగించి తను పీల్చి, అతనికి ఇచ్చాడు. కొన్ని సంవత్సరాల క్రితం తను వచ్చిన విషయాలన్నీ చెప్పుకున్నాడు. అరగంటలో అక్కడికి గ్రామపెద్ద మనుషులు చేరిపోయారు. వాళ్ళ మాటలు నాకు అర్థం కాలేదు. మూడు నాలుగు రౌండ్లు చిలుము పంచబడింది.

తర్వాత ఆశ్రమంలోకి వెళ్ళాము. అక్కడివారంతా నాగాబాబాను గుర్తించారు. ఆశ్రమం చాలా పెద్దది. వంద ఎకరాల దాకా వుందట. ఒక హాలులో మా సామాను పెట్టుకున్నాము. ఇద్దరు ముగ్గురు విదేశీయులు కూడా కనిపించారు. బాగా ఆకలిగా వుంది. మా దగ్గరున్న అటుకులు, బిస్కట్లు తిన్నాము.

"మనం ఉండాల్సింది ఇక్కడకాదు. నాతో రండి" అని నాగాబాబా ఆ ప్రక్కనే ఉన్న దారిగుండా వంద మెట్లు క్రిందకు దిగుతూ తీసుకువెళ్ళారు. సాయం సంధ్య అవుతోంది. మరింత పాతాళంలోకి వెళ్ళినట్లుగా అనిపించింది. ఆశ్చర్యం, అక్కడ సుందరమైన పూలతోట ఉంది. ప్రత్యేకమైన ఎత్తులో ధుని, మందిరం ఏర్పాటు చేశారు. అక్కడ ఎవ్వరూ శుభ్రం చేసినట్లు లేదు, ఆకులతో నిండి కొన్ని రోజులుగా ఎవ్వరూ పట్టించు కోనట్లుగా వుంది. వెంటనే మృత్యుంజయపురి నాగాబాబా గోచీపెట్టుకొని చీపురుతో మొత్తం శుభ్రం చేయటం మొదలు పెట్టారు. రెండు గంటలలో నీళ్ళతో కడిగేసి అద్దంలా చేశారు.

"ఇదే మన స్థలం. ఇక్కడున్నన్ని రోజులు మనం ఇక్కడే గడపాలి. ఈధుని చాలా పురాతనమైనది. ఎందరో మహాత్ములు ఇక్కడ ధ్యానం చేసుకున్నారు. రాత్రిళ్ళు ఇక్కడ

**వుండటం మంచిది. మీ సాధన ఫలిస్తుంది" అని చెప్పారు.**

చీకటి పడిపోయింది. నాకయితే అంతా క్రొత్తగావుంది. కొంచెం దూరంగా పారుతున్న గంగ నీళ్ళలో స్నానం చేసి వచ్చాము. కొండ రాళ్ళ మధ్య కట్టిన ఆశ్రమం అవ్వటం వలన చీకట్లో భయం భయంగా అనిపిస్తోంది. ఏడున్నరకు రొట్టెలు పెడతారట. ఇద్దరం పైకి ఆశ్రమంలోకి వచ్చాము. కడుపునిండా అన్నం తిని రెండు రోజులయ్యింది ఎప్పుడెప్పుడా అని వుంది.

భజన మందిరంలో హారతి తీసుకుని, క్రిందనున్న భోజనశాలలోకి వెళ్ళాము. కడుపునిండా రొట్టెలు తిన్నాము. శరీరం శాంతించింది.

తిరిగి ధుని వున్న తోటలోకి వెళ్ళాము. ఆయన ఎక్కడ సంపాదించాడో రెండు క్రొవ్వొత్తులు తెచ్చారు. ఒకటి వెలిగించి వుంచాడు. ధునిలో కట్టెలు రగులుకొని సన్నని మంట, పొగ లేచాయి. దట్టమైన హిమాలయ పర్వతాలు, అడవుల మధ్యవున్నామట. ఎలుగుబంటులు, తోడేళ్ళు బాగా తిరిగే ప్రాంతమట. రాత్రి ఒంటరిగా బయటకు వెళ్ళవద్దని చెప్పాడాయన. తను మాత్రం చిలుము పీలుస్తూ ఏవో మాటలు చెబుతున్నారు. ధుని చుట్టూ అరుగులాగవుంది. ప్రక్కనే చాలా ఆసనాలు ఉన్నాయి. వాటిని వరుసగా పేర్చి ప్రక్కలాగా చేసుకొని పడుకున్నాక నాకు తెలియకుండా నిద్రపట్టింది.

అర్థరాత్రి నిద్ర లేపారు. అలసట మీద పడుకున్నానేమో కళ్ళు తెరవాలని అనిపించలేదు. నాగాబాబా నన్ను కుదుపుతూ పిలిచారు. లేచి కూర్చున్నాను.

"విను దూరంగా ఎలుగు బంట్లు అరుస్తున్నాయి" అని చీకట్లో దూరంగా చూపించారు. ఆ మాటకు నాకు నిద్ర మత్తు వదిలింది. ఆయనతో పాటు బయటకు వచ్చాను. అంతా నిర్మానుష్యం, చీకటి. ఎక్కడో దూరంగా రెండు మూడు దీపాలు ఉండీ లేనట్లుగా కనిపిస్తున్నాయి. అంతా మసక మసకగా కనిపిస్తోంది. పిట్టగోడలాగ ఉంది. దానిమీద కూర్చున్నారు. నేను కూడా కూర్చున్నాను.

**"రాత్రిళ్ళు ఎక్కువ నిద్రపోకూడదు. పగలు పడుకున్నా పరవాలేదు. మనకు రాత్రి సమయంలోనే ప్రకృతి అనుకూలిస్తుంది"** అని అన్నారాయన.

కొన్ని సంవత్సరాల క్రితం నందుబాబా ఇవ్వే మాటలు చెప్పారు. మళ్ళీ రెండవసారి ఈయన నోటమ్మట వింటున్నాను. "రాత్రి పడుకోవటం మనిషికి సహజం కదా!? అని అడిగాను.

"అది మామూలు మనుషులకు. మనలాంటి వాళ్ళకు కాదు. మన సాధన అంతా రాత్రి వేళే! సిగరెట్టు కాలుస్తావా?"అడిగారాయన.

"నాకు అలవాటు లేదని చెప్పానుగా! మళ్ళీ అడుగు తున్నారు ఎందుకు? అది అంత అవసరమా".

"నీవు అవధూత సాంప్రదాయంలో ఒకడివి కదా! నిన్ను సంత్‌గా మారుస్తాను. ఇక్కడ. నీవు చాలా అదృష్టవంతుడివి. బాబాజీ ఆశీర్వాదం నీకు వుంది. అందువల్లనే నాకు పరిచయం అయ్యావు. నీకు ఈ ఆశ్రమం చూపించాలని చోటా కైలాస్ పర్వతం మీదకు

తీసుకువెళ్ళాలని ఎందుకో నాకు చాలా బలంగా అనిపించింది. అందువల్లనే నేపాల్‌గంజ్‌లో వాళ్ళు ఎంత బలవంతం చేసినా వినకుండా నీతోపాటు ఇక్కడకు వచ్చాను" అని అన్నాడాయన.



బాబా ఆశ్రమంలో ధుని పూజ చేస్తూ...

"నేను సిగరెట్టు గురించి అడిగాను. అది కాల్చటం అవసరమంటారా?" నాలో దానిని కాల్చాలని ఆలోచన ఎక్కడో ఉన్నట్లుంది.

"అవసరం అని కాదు. మన సాంప్రదాయంలో అటువంటిది ఏదో ఒకటి తోడు తీసుకుంటారు. దానిద్వారా సంకల్ప బలంతో అంతర్ముఖం అవ్వటం జరుగుతుంది. దేహాతీతంగా వెళ్ళి, ఇంద్రియాల మత్తును అధిగమించటానికి మరొక మత్తును శరీరంపై ప్రయోగించటం లాంటిదిది" అన్నారాయన.

"సమాజం అటువంటి మత్తు పదార్థాలను ఒప్పుకోదు కదా"! అడిగాను.

"మనకు సమాజం ఒప్పందం కాదు కావల్సింది. మన సాధన సత్యదర్శనం. జ్ఞానం పొందటం. అక్కడ ప్రజలు వాటిని తప్పుపడతారు. మళ్ళీ వాటికి లైసెన్సులు ఇస్తూ వ్యాపారాలు చేస్తారు. కోటీశ్వరులు అవుతారు. సమాజం, ఈ మామూలు జనం ద్వంద్వంలో వుంటారు. పైకి ఒక మాట. లోపల ఒక మాట. అందుకే వాటిని పట్టించుకో కూడదు. మన దృష్టి పరమాత్మవైపు వుండాలి. మాయను ఆధారం చేసుకుని మాయను దాటటం. మనల్ని శాసించే హక్కు పరమాత్మకే వుంది. బాహ్యంలో జీవించే వ్యక్తులు మనల్ని బాహ్యంగా మాత్రమే చూస్తారు. అంతకన్నా వారికి శక్తి లేదు. మన ఆత్మశక్తి, సాధనాశక్తి వారికి తెలియదు. వివేక వైరాగ్యాలను పొందే మనం ఎవరికీ భయపడకూడదు. అన్నీ అనుభవాలే మనకు. 'నిర్భయం' తొలి లక్షణం కావాలి". అని చిలుము వెలిగించి గుండెనిండా పీల్చారు. చీకట్లో ఆయన నల్లని ముఖం వింతగా కనిపించింది. పొడవుగా వేళ్ళాడుతున్న జుట్టు, గడ్డంతో ఆయన వేరుగా కనిపిస్తున్నారు. ఆయన మాటలు కూడా తీవ్రంగా వున్నాయి. మంచి నిద్రలో ఉన్న నన్ను లేపి ఇక్కడకు తీసుకువచ్చి ఇదంతా చెప్పటం ఏమిటో! ఆశ్చర్యంగా వుంది.

"టైము మూడు అవుతోంది. ఈ సమయంలో గురుమంత్ర జపం తొందరగా సిద్ధిస్తుంది. నీవు తీవ్రంగా సాధన చెయ్యి. ఈ ప్రపంచాన్ని పట్టించుకోకు. ఈ ప్రజలు తాము మారరు, ఇంకొకరిని మారనీయరు. మనం అలౌకిక జీవులం. వీలైనంత ఎక్కువగా ఏకాంతంలో గడపాలి. నీవు-గురువు- పరమాత్మ..... ఇంతే ప్రపంచం కావాలి. అప్పుడే జన్మరహస్యం. కర్మరహస్యం, సృష్టి రహస్యం తెలుస్తాయి. నీవు నాతో ఉండిపో. ఈ హిమాలయాలన్ని తిరుగుదాం" అని అన్నాడాయన.

"నాకు కైలాస పర్వతం మానస సరోవరం ఎప్పుడు చూపిస్తారు?" అడిగాను.



విదేశీయ భక్తులు, ఆశ్రమ పూజారి గౌరహరి, బండారీ బాబాలతో...

"ఇక్కడ బాబాజీ అనుగ్రహాన్ని పొందితే, చోటా కైలాస్ పర్వతాన్ని దర్శించుకున్నాక వాటిని చూపిస్తాను. అసలు ఇక అవి చూడనక్కర్లేదు. అన్నీ ఇక్కడే వున్నాయి". దూరంగా కొండను చూపిస్తూ... "అదిగో అదే కైలాస పర్వతం. ఈ పారుతున్ననీళ్ళు మానస సరోవర జలం" అని అన్నాడాయన.

నా మనసు ఆలోచనలో పడిపోయింది. ఆయన నేపాల్‌లో అన్నమాటలకు, ఇప్పుడు చెబుతున్న మాటలకు పొంతన కుదరటం లేదు. అక్కడ "నాతో వస్తావా, కైలాస పర్వతం ఎక్కిస్తాను. డబ్బులతోపనిలేదు. కొండలలో అడ్డబడి నడుచుకుంటూ వెళ్తే కొన్ని రోజులలో కైలాసపర్వతాన్ని చేరుకుంటాం. మానస సరోవరంలో స్నానం చేసి వద్దాం. నన్ను నమ్ము" అని అన్నాడాయన. ఇప్పుడేమో "ఇదే కైలాస్. దీనిని దర్శించుకుంటే సరిపోతుంది" అని అంటున్నాడు. కొంచెం నిరాశగా అనిపించింది. కానీ వేరే దారి లేదు అయనను అనుసరించి చివరికి ఏమవుతుందో చూడాలి.

ఆయన లేచి వెళ్ళి ధునిలోని కట్టెలు సర్ది వచ్చి "పద స్నానం చేద్దాం" అన్నాడు. తువ్వాలు కోసం వెళ్ళబోతుంటే "ఏమీ అక్కరల్లేదు పద" అన్నాడు. నా చేతులలో కొంత బూడిద వేశాడు. వెచ్చగా వుందది "పళ్ళు తోముకో" అన్నాడు. చిన్నతనంలో పిడకల బూడిదతో (కచిక) తోముకున్న అనుభవం వుంది కనుక మారుమాట్లాడకుండా పళ్ళుతోమటం మొదలుపెట్టాను.

ఒంటిమీదున్న గోచీని కూడా తీసేసి ఆయన నీళ్ళలో కూర్చున్నాడు. మోకాళ్ళ లోతు మాత్రమే వున్న నీళ్ళలో కూర్చుంటే కానీ తల స్నానం చెయ్యటం కుదరదు. నేను కూడా దిగంబరత్వంతో హాయిగా స్నానం చేశాను. అరగంట పైగా నీళ్ళలో గడిపాము.

దూరంగా గుళ్ళో గంటలు మ్రోగాయి.

"పూజారి లేచినట్లున్నాడు" అని అన్నాడాయన.

హిమాలయాలలో 'తొలి ఉదయం' అలా ప్రారంభ మైంది నాకు!





నేపాల్ గంజ్‌లోని

స్వామి శ్రీ హరిశంకరగిరి నాగా బాబా



హిమాలయ యోగి, మహర్షి

స్వామి శ్రీ త్రిలింగ తీర్థ శంకరాచార్య



నేపాల్ గంజ్‌లోని దివ్య వృక్షం దగ్గర

ఒక హిమాలయ సాధకుడు

# 'సంత్ దీక్ష-దివ్యదర్శనం'



ఆశ్రమంలో దివ్య ఘంట మ్రోగిస్తూ...

ఆశ్రమం ఎదురుగా వున్న హోటల్‌లో టీ త్రాగి వచ్చాము. ఆ తరువాత మళ్ళీ మెట్లుదిగి ధుని దగ్గరకు వచ్చి కెమెరా తీసుకుని బయలుదేరాము. అవతలి వైపు, అంటే సుమారు అర్థ కిలోమీటరు దూరంగా వుంటుంది. ఆ ప్రక్కన కొన్ని మందిరాలు కనిపిస్తున్నాయి. అసలైన ప్రదేశం అదేనని అక్కడకు వెళ్దామని తీసుకు వెళ్ళాడు నాగాబాబా. మధ్యలో రెండు పాయలుగా నీళ్ళు పారుతున్నాయి. ఒక పాయను గంగ, రెండవ పాయను మానస సరోవరం అని అంటారట. ఒకదానిలో నీళ్ళు అంతగా లేవు అక్కడే మేము తెల్లవారుఝామున స్నానం చేసినది. రెండవ ప్రవాహంలో మాత్రం నడుముదాకా తడిసేంత నీళ్ళు వున్నాయి. కష్టపడి దాటి అవతలకు వెళ్ళాము.

తొమ్మిది దేవాలయాలు వరుసగా వున్నాయి. దత్తాత్రేయుడు, గోరక్‌నాథ్, లక్ష్మీదేవి, సంతోషిమాత, ఈశ్వరుడు ఇలా తొమ్మిది మందిరాలు అనుకుని వున్నాయి. గోపురాలు విడివిడిగా వున్నాయి. అక్కడ వాటన్నిటినీ శుభ్రం చేస్తూ, పూజ చేసే పూజారి ఒకరున్నారు. ఆయన పేరు గౌడహరి. ఆయన నన్ను చూస్తూనే వచ్చి పాద నమస్కారం చేసి "సంత్ మహాత్మా రండి. మిమ్మల్ని చూస్తూంటే సాయిబాబాను చూసినట్లుంది" అని అన్నాడు. నాకాశ్చర్యం వేసింది. అక్కడ సాయిని ఎరిగినవారు, భక్తితో పూజించేవారు ఉండటం! హైడఖాన్ బాబాను సాయి అంశగా చెప్పుకునే వారట!

అక్కడ మరొక వ్యక్తి వున్నాడు. వెడల్పాటి పసుపు నామాలు, బొట్లు పెట్టుకుని, మెడలో రుద్రాక్షమాలలు ధరించి, చేతిలో ఇత్తడి కమండలం పుచ్చుకుని ఉన్నాడు. ఆయన పేరు 'నారద' అని పిలుస్తారట. అందరిని తీసుకుని మందిరం వెనకకు తీసుకువెళ్ళారు నాగబాబా.

**అక్కడ ఒక గుహ ఉంది. అక్కడే బాబాజీ ప్రకటమయ్యారట. సంవత్సరాల క్రితం మాట. ఆనాటి నుండి ఈ నాటి వరకు బాబాజీ అక్కడ కూడా కొందరికి దర్శనం ఇస్తూనే వున్నారట.**

ఆ గుహలో నన్ను కొంతసేపు కూర్చుని ధ్యానం చేసుకోమన్నారు మృత్యుంజయపురి నాగాబాబా. లోపలికి వెళ్ళి కూర్చున్నాను. కొంచెం చీకటిగా వుంది. నాకు తెలుసున్న మూల మంత్రాలు జపించుకున్నాను. కొంతసేపు మౌనంగా కూర్చున్నాను. ఓంకారం వంటి స్వరం, ఎవరో గుసగుసలుగా మాట్లాడుకుంటున్నట్లుగా వినిపించాయి.ఎంతో శ్రద్ధతో విన్నాను. కొంత సేపు తర్వాత వినిపించలేదు బయటకు వచ్చాను. పూజారి గౌడహరి నన్ను బయటకు రాగానే "ఏమైనా వినిపించాయా? అని అడిగారు చెప్పాను.

"అలా చాలా సేపు వినిపిస్తాయి. స్పష్టంగా మాటలు కూడా వినిపిస్తాయి. బాబాజీతో చర్చలు కూడా చేస్తుంటారు కొంతమంది" అని చెప్పాడాయన.

మృత్యుంజయపురి నాగబాబా పది సంవత్సరాలు క్రితం వచ్చాడట. అప్పటి విషయాలన్నీ వాళ్ళు చర్చించుకున్నారు. నేను అక్కడున్న ఆశ్రమమంతా చూశాను. గోవులు ఉన్నాయి. గడ్డి కత్తిరించే యంత్రము అన్ని వున్నాయి. బాబాజీది కర్మమార్గమట. కర్మద్వారా జ్ఞానాన్ని పొందాలట. కర్మ క్రియలే ఉత్తమ జ్ఞానాన్ని 'అందిస్తాయని బోధించే వారట. పాలు కారుతున్న లేత మొక్కజొన్న కండెలు తెప్పించారు. పచ్చివి తిన్నాము. కొన్ని కాలిపించి తిని పించారు. ఉదయం ఫలహారంగా అవి ఉపయోగ పడ్డాయి.

స్కాంధ పురాణంలో ప్రథమ కైలాసంగా చెప్పబడిన పవిత్రమైన ప్రదేశమది అని బాబాజీ ఆ ప్రక్కనే వున్న దారి గుండా 7 కి.మీ ఎత్తులోను నాలుగు పర్వతాలు దాటి 5వ పర్వతంగా వున్న కైలాస పర్వతం మీద ధ్యానం చేసుకునే వారని చెప్పారు. ఆ కైలాస పర్వతం మీదకు వెళ్ళటం చాలా అవసరం అని నాగబాబా అన్నారు. మరుసటి రోజు వెళ్దాం అన్నారు. అక్కడ మూడు గంటలకు పైగా గడిపి ఆశ్రమానికి బయలుదేరాము. క్రింద బట్టలన్నీ విప్పి నీళ్ళలో దిగి మళ్ళీ కట్టుకుని వచ్చాము. వాళ్ళకు మామూలే. నా వింత అనుభవం.

మాసిన బట్టలు ఉతుక్కుని ఆరవేసుకున్నాము. తల స్నానం మనసు తీరాచేశాను. మధ్యాహ్నం కడుపు నిండా రొట్టెలు తిని వచ్చి ధుని దగ్గర పట్టాలు పరచుకుని నిద్రపోయాము. లేవగానే మళ్ళీ ధుని మందిరమంతా నీళ్ళతో కడిగి శుభ్రం చేశాము. ఆ రాత్రి సంత్ దీక్ష ఇస్తానని, సాధనా రహస్యం, ఉపదేశం ఇస్తానని అన్నారు నాగాబాబా. రాత్రి తక్కువ ఆహారం తీసుకోమన్నారు. రాత్రంతా కూర్చుని వుండాలని చెప్పారు.

సంధ్యవాలిపోయే సమయం అది. స్నానానికి వెళ్ళాము. నీళ్ళలో కూర్చుని వుండగా ఆయన కొన్ని మంత్రాలు తను చదివారు. నాతలపై నీళ్ళు ధారలా తన హస్తంగుండా పోశారు. నాచేత కొన్ని మంత్రాలు చెప్పించారు. కైలాస పర్వతానికి నమస్కరించమన్నారు. "సహనావవతు ......." శ్లోకం చెప్పించారు. ఇద్దరం తడి బట్టలతో ధుని దగ్గరకు వచ్చాము. అక్కడవున్న దివ్య గంటను కొట్టమన్నారు. ధుని ధగర పూజ లాంటి క్రియ చేయించి, నాకు ఊది బొట్టు పెట్టారు. వారికి పాద నమస్కారం చేసుకుని ఆశీర్వదించ మన్నాను. వారు నన్ను రెండు చేతులతో హత్తుకుని "నీకు నాకు ఎప్పటి బంధమో ఇక్కడకు తీసుకు వచ్చింది. నేను దీక్ష తీసుకున్న ఆశ్రమం ఇది. 20 సంవత్సరాలు పైగా అయ్యింది. నా చేతులతో నీకు ఆ మంత్రం ఇచ్చి గురుకార్యం నెరవేర్చాను. నీవు చాలా గొప్పవాడివి అవుతావు. అవధూత సాంప్రదాయం గొప్పది. నీకు త్వరగా సిద్ధిస్తుంది. సంత్ స్వామిగా నీకు మంచి స్థితి దొరుకుతుంది" అన్నారు.

నాకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వారి మాటలు నా హృదయాన్ని కరిగించాయి. నా తండ్రి బోధిస్తున్నట్లుగా అనిపించింది. మా నాన్నగారు కూడా వారిలాగే పొట్టిగా నల్లగా వుండేవారు. విపరీతంగా సిగరెట్లు కాల్చేవారు. ఆ సిగరెట్ల కారణంగానే చనిపోయారు. ఈయన మాటలు స్పర్శ ఆయనను గుర్తుకుతెచ్చాయి. ఏదో తెలియని ఆవేశం పొంగి ఆపుకోలేనంత ఎక్కిళ్ళతో

కన్నీళ్ళుగా బయటపడింది. అదుపు చేసుకోలేకపోయాను. ఆయన నాకు మళ్ళీ ఊదిపెట్టి వీపుమీద రాశారు. నాకు తెలియకుండానే వారి తొడమీద తల ఆన్చి కొన్ని నిముషాలు గడిపాను. నాలోని ఆవేశం చల్లారింది. కన్నీళ్ళు మీట నొక్కినట్లుగా ఆగిపోయాయి. "పద పైకి మందిరంలోకి వెళ్దాం" అని లేచారు ఆయన. నా జీవితంలో మరచిపోలేని నిముషాలు అవి.

60 మందికి పైగా అవధూతలను, మహాత్ములను కలిశాను. కానీ ఇటువంటి అనుభవం నాకు కలగటం తొలిసారి. మెట్లెక్కి మందిరంలోకి వచ్చాము. భజన జరుగుతోంది. విదేశీభక్తులు కూడా ఉన్నారు. గంటదాకా భజనలు పాడారు. నమశ్శివాయ మంత్రం కీర్తనగా పాడారు. అన్నీ హిందీ భజనలు. చివరగా ప్రార్థన చెప్పారు. ప్రసాదంగా చాక్లెట్లు, స్వీట్లు ఇచ్చారు. అవి తీసుకుని భోజనశాలకు వెళ్ళాము. రొట్టెలు, కూరపెట్టారు. వింతైన విషయం ఏమిటంటే అక్కడ సాధకులు మంచినీళ్ళు గ్లాసును ఎడంచేత్తో ముట్టుకోరు. ఎంగిలి అయినా, కుడిచేత్తోనే మంచినీళ్ళు తాగుతారు. రొట్టెలు తిన్న తరువాత ఇసుకతో ప్లేట్లు, గ్లాసు తోమి తెస్తారు. ఆ ఇసుక పిండిలా మెత్తగా వుంటుంది. నేను కూడా ఆ పద్ధతిని అనుసరించాను.

10 గంటల ప్రాంతంలో ధుని దగ్గరకు వెళ్ళాము. చిమ్మ చీకటిగా వుంది. నాగాబాబా కొవ్వొత్తి వెలిగించారు. యథాప్రకారం మెత్తటి ఆసనాలను పొడవుగా, ప్రక్కబాగా సర్దుతుంటే "ఈరాత్రి మనం నిద్రపోకూడదు. కూర్చునే వుండాలి.నీ జీవితంలో ఈ రాత్రి సాధనాపరంగా ఒక మలుపు అవుతుంది" అన్నారాయన. ఒకదానిమీద ఒకటి రెండు ఆసనాలు ఒత్తుగా వేసుకుని కూర్చున్నాను. ధునిలోని ఊదితో నుదిటిమీద, చేతుల మీద, గుండెల మీద విభూతి రేఖలు దిద్దుకున్నాను. పెద్దచలిగా లేదు వాతావరణం. ఒంటిమీద బట్టలు ఏమీ ఉండకుండా, దిగంబరంగా మార్చి, పద్మాసనంలో కూర్చోమన్నారు.

నాకు తెలిసిన గురు మంత్రాలు చెప్పుకుని ధునికి నమస్కరించమన్నారు. ఆ తరువాత కనులుమూసుకుని, ఏ మంత్ర జపం లేకుండా కూర్చోమన్నారు. నాకు వెనుకగావున్న బాబాజీ పాదుకలకు నమస్కరించి కనులు మూసుకుని, ధునికి ఎదురుగా, దిగంబరంగా పద్మాసనంలో కూర్చున్నాను. ఆయన కూడా పద్మాసనంలో నిటారుగా కూర్చున్నారు.

కొంతసేపు ఏవేవో ఆలోచనలు వచ్చాయి. జరిగిన ప్రయాణం గురించి, జరగబోయే ప్రయాణం గురించి ఆలోచనలు వచ్చి, వాటికి అవే మాయమయ్యాయి. దూరంగా ఎవరో అరుస్తున్న శబ్దాలు వినిపించాయి. నాకు దగ్గరగా ఎవరో నడిచినట్లయి కనులు తెరిచాను. కొవ్వొత్తి ఆరిపోయి వుంది. నాగాబాబా ధునిలోని కట్టెలు సర్ది మంట చేస్తున్నారు.

"నీవు కనులు మూసుకుని ఉండు. కొన్ని దర్శనాలు అవుతాయి. కొంతసేపు తర్వాత నిన్ను నేను పిలుస్తాను. అంతవరకు అలాగే నిన్ను నీవు ధ్యానిస్తూ వుండు". అన్నారు. నేను మళ్ళీ ధ్యానస్థితిలోకి వెళ్ళాను. మళ్ళీ కొంతసేపు అనవసరమైన ఆలోచనలు వచ్చి పోయాయి. ఆ తర్వాత వెండి లాంటి తెల్లని కాంతిలో పెద్ద భవనం. ఆ భవనం ముందు పెద్ద జ్యోతి మంటలాగ వెలుగుతూ ఉంది. ఆ జ్యోతి మనిషి అందుకోలేనంత ఎత్తులో ఉంది. దానిచుట్టూ కొంతమంది స్త్రీ, పురుషులు నగ్నంగా కళ్ళుమూసుకుని కూర్చునివున్నారు. ఒక్కొక్కరికీ,



స్వామీజీ దగ్గర మంత్ర దీక్ష తీసుకున్న విదేశీయుడు

దగ్గరిగా, ముందు చిన్న కలశంలాంటి చెంబులు వున్నాయి. కూర్చున్నవారు కూర్చున్నట్లుగానే పైకి లేచి జ్యోతికి నమస్కరించి క్రిందకు బొమ్మల్లాగా వస్తున్నారు. నేను ఆ దృశ్యాన్ని దూరంగా నిలబడి చూస్తున్నాను.

ఇంతలో ఒక వ్యక్తి గడ్డం పొడవుగా వుంది, లంగోటా మాత్రమే ధరించి వున్నాడు. వయసు మాత్రం 15 సంవత్సరాలు ప్రాంతంలో వుంటుంది. గాలిలో నడుస్తూ నా దగ్గరకు వచ్చి, నా జుట్టుపట్టుకుని లేపుకుని తీసుకు వెళ్తున్నాడు.ఇద్దరం గాలిలో నడుస్తున్నాం. జ్యోతి దగ్గరకు తీసుకెవెళ్ళి నన్ను జ్యోతిలోకి తోసేశాడు. మంటలాంటి జ్యోతిలోకి పడిపోయాను. నా ఒళ్ళు కాలిపోతోంది. నాకు తెలుస్తోంది. నల్లటి మసిలాగ అయింది. ఆశ్చర్యం నా తల మాత్రం రవ్వంత కూడా కాలలేదు. కళ్ళు, ముక్కు, చెవులు, గుండు.. అన్నీ మామూలుగానే ఉన్నాయి. నేను అలా దర్శిస్తుండగానే హఠాత్తుగా మొత్తం మాయం అయిపోయింది. కేవలం ఆకుపచ్చని రంగులో వున్న పెద్ద పర్వతం కనిపించింది.

నేను ధ్యానిస్తూనే వున్నాను. కళ్ళు తెరవబుద్ధి కావటం లేదు. అలా కొంత సమయం గడిచింది. నా శరీరం మీద స్పర్శ తగలటం వలన బాహ్య స్పృహలోకి వచ్చాను.



## ప్రథమ కైలాసానికి ప్రయాణం !


ప్రథమ కైలాస యాత్రలో విదేశీ డాక్టర్‌తో...

"మెల్లమెల్లగా కళ్ళు తెరువు" నాగా బాబా మాట వినిపించింది.

కళ్ళు తెరిచాను. కొవ్వొత్తి వెలుగులో ఎదురుగా ధుని, ప్రక్కనే నిలబడి నాగాబాబా నా చెయ్యిపట్టుకొని లేపారు. "పద బయటకు వెళ్దాం" అన్నారు.

లేవబోతూ నన్ను చూసుకుంటే ఆశ్చర్యం వేసింది. నా ముఖం మీద, ఛాతీమీద విభూతి చల్లివుంది. అదంతా ఎలా వచ్చిందో నాకు అర్థం కాలేదు. ఎవరో నామీద చల్లినట్లుగా వుంది.

లేచి బయటకు వచ్చాను. నా ఒంటిమీద గుడ్డలేదన్న విషయం అప్పుడు స్ఫురణకు వచ్చి వెనకకు వెళ్ళి కండువాను చుట్టుకుని వచ్చాను.

దూరంగా, పిట్టగోడమీద నాగాబాబా కూర్చుని వున్నారు. ఆయనకు ఎదురుగా కూర్చున్నాను.

"ఎలా వుంది?" అడిగారాయన.

"చాలా బాగుంది. ఏదో లోకంలో వున్నట్లుంది. నిజానికి చీకటి అంటే నాకు భయం. అలాంటిది ఇక్కడ అసలు భయం అనిపించటంలేదు. మీవల్లనేమో"

"ధ్యానంలో ఏమి కనిపించింది?" అయన సూటిగా అడిగారు.

జరిగినదంతా వివరంగా చెప్పాను.

"చాలా గొప్ప యోగత్వం నీది. నీకు తెలియని విషయం ఒకటి జరిగింది. నాకు నిద్రపడుతూ వుంది. హఠాత్తుగా ఎందుకో కళ్ళు తెరిచాను. నీ ఒంటిమీద చిన్న చిన్న మంటలు రగులుతున్నాయి. ముఖ్యంగా గుండెమీద భుజాల మీద ఎక్కువగా పైకిలేస్తున్నాయి. నాకు ఏమి చెయ్యాలో తెలియలేదు. ఎదురుగా వున్న ధునిలోంచి బూడిద తీసి నీమీద చల్లటం మొదలుపెట్టాను. అంతే ఆశ్చర్యంగా ఆ మంటలు చల్లబడిపోయాయి. ఆ సమయంలో నీవు మాత్రం అలాగే వున్నావు. నీ ముఖంలో ఎటువంటి మార్పులేదు. చాలా గంభీర స్థితిలో వున్నావు నీవు అనిపించింది. అందుకే నిన్ను పిలవలేదు. కొంతసేపు తరవాత నిన్ను చూశాను. ఉన్మత్త స్థితిలో వున్నట్లుగా కనిపించావు. అది ఎక్కువ సేపు ఉండకూడదు. (నీ విషయంలో) అందుకే తట్టిలేపాను". అన్నారు.

నేను ఏదో తెలియని ఆవేశంలో, ఆయన చేతులు తీసుకొని నా కళ్ళకు హత్తుకున్నాను. ఆయన నా తలమీద తన చెయ్యిని వుంచారు. తెల్లారేకా కైలాస పర్వతం పైకి వెళ్దామని, ఆ పర్వతంపైన మహావతార్ బాబాజీ ధ్యానం చేసుకున్నారని, స్కాంధ పురాణంలో ప్రథమ

కైలాస పర్వతంగా దీనికి పేరు వుందని చాలా విషయాలు చెప్పారు.

కాలకృత్యాలు తీర్చుకుని నదిపాయలో స్నానం చేసి వచ్చి, యథాప్రకారంగా ధునిదగ్గర కూర్చున్నాను.

ఉదయం 9 గంటలకు ప్రథమ కైలాస పర్వతం పైకి బయలు దేరాము. నేను, నాగాబాబా, మరో ఇద్దరు, ఒక విదేశీ డాక్టర్ కలిసి బయలుదేరాము. ఒకతను దారిలో తినటానికి పనికి వస్తాయని మొక్కజొన్న కండెలు లేతవి కొనుకుని వచ్చాడు. మధ్యాహ్నానికి తిరిగి వచ్చేస్తామని అన్నారు నాగాబాబా.

సుందరమైన హిమాలయాల అడవులలో నడక అక్కడక్కడ కష్టంగా అనిపిస్తుంది. కాని అస్వాదించగలిగితే అణువణువు పులకరింతగా ఉంటుంది. ఆ గాలిలోనే ఒక శక్తి వుంటుందనిపించింది నాకు.

అందరమూ కమండలాలలో నీళ్ళు నిండుగా నింపుకున్నాము. పైకి వెళ్ళాక నీళ్ళు దొరకవని అన్నారు. కొండలు ఎక్కటం కష్టంగా వుంది. మధ్యలో చిన్న గ్రామం కనిపించింది. ఒక కుర్రాడు వచ్చాడు. అతనిని 'తినటానికి ఏమైనా తీసుకురా, డబ్బులు ఇస్తాము" అని అన్నాము.

ఆ కుర్రాడు పావుగంటలో కొన్ని రొట్టెలు, ఉల్లిపాయలు తెచ్చాడు. ఉదయం నుంచి ఏమి తినకపోవడం వలన, నడక వలన ఆ రొట్టెలు అమృతంలాగ కనిపించాయి.

తరువాత నడుస్తూ రెండు గంటల తర్వాత చోటా కైలాస్ అనే ప్రాంతానికి చేరాము. ఒక పెద్ద చెట్టు క్రింద కూర్చున్నాము. నాగాబాబా చాల నీరసం అయిపోయారు. విరేచనాలు అవుతున్నాయి. కొంచెం సేపు అక్కడ ఆగుదాం అన్నారు. ఒక మూగ కుర్రాడు మా దగ్గరకు వచ్చాడు. అతనికి చెవుడు కూడా వుంది. మొత్తానికి సైగలు చేసి అగ్గిపెట్టె కొన్ని కర్రలు తెప్పించారు. మొక్కజొన్న కండెలు కాల్చుకుని తిన్నాము. మధ్యహ్న భోజనంగా సరిపోయింది. అమెరికన్ డాక్టరుకు హిందీ అర్థం కావటం లేదు అప్పుడప్పుడూ నేను అతనితో ఇంగ్లీష్‌లో మాట్లాడుతూ కంపెనీ ఇచ్చాను.

నాగాబాబా ఒక గోనెపట్టా పరచుకుని నిద్రపోయారు. అందరం మొక్కజొన్న కండెలు తిని నీళ్ళు తాగాక ఆయనను లేపాము. మాట చాలా నీరసంగా మారింది. "నేను రాలేను" అని అన్నాడాయన. మా అందరి గుండెల్లో రాయిపడింది. ఆయన వలనే ఈ ప్రయాణం. ఇంకా రెండు కొండలు పైకి ఎక్కి దాటితే కైలాస పర్వతం ఉంటుందట. మిగిలిన వాళ్ళం "ఏమైనా సరే వెళ్ళివద్దాం, ఇంతకన్నా అవకాశం మళ్ళీరాదని" అనుకున్నాం. నాగాబాబా, తాను కొంతసేపు విశ్రాంతి తీసుకొని వెనకకు ఆశ్రమానికి వెళ్ళిపోతానని అన్నారు. 12 సంవత్సరాలు పైనున్న మూగ అబ్బాయితో పైసలు ఇస్తాము కైలాస పర్వతం చూపించమని అడిగాము. అతడు వస్తానన్నాడు.

మధ్యాహ్నం రెండు గంటలకు మా ప్రయాణం పైకి ప్రారంభమైంది. మాకు ప్రేరణ ఇచ్చిన నాగాబాబా క్రిందనే వుండిపోయారు. ఆ మూగ అబ్బాయి మా అందరికంటే ముందు నడుస్తూ దారి చూపించాడు. అక్కడక్కడ ఆగుతూ వెళ్ళాము. అమెరికన్ డాక్టర్

కూడా ఎంతో శ్రద్ధతో వచ్చాడు. తన కెమెరాతో కొన్ని ఫోటోలు తీసుకున్నాడు. పైకి వెళ్తున్న కొలదీ హిమాలయాల సౌందర్యం అద్భుతంగా వుంది. ఫోటోలు తీశాను. మధ్యలో రెండు మూడుసార్లు వాన చినుకులు పడ్డాయి. పెద్దగా తడవలేదు.



అద్భుత హిమాలయ సౌందర్యం

మనుషులు కనిపించనంత మొక్కల గుబురులలోంచి నడవవాల్సి వచ్చింది. అది దారేనా? అలా వెళ్ళితే కైలాస పర్వతం దాకా చేరగలమా? అన్న ప్రశ్నలు ఉదయించాయి. మాకు మార్గదర్శకుడుగా వున్న మూగ, చెవుడు అబ్బాయిని గుడ్డిగా నమ్మి అనుసరించటమే మా పని. అలా పోతూనే వున్నాము. సాయంత్రం 5 గంటలకు కైలాస పర్వతం దగ్గరకు చేరాము. ఆ పైనుంచి చూస్తుంటే ప్రకృతి అందం మాటల్లో చెప్పలేనిది.

**కావ్యాలలో హిమాలయ సౌరభాలు :**

మన భారతదేశానికి ఎల్లలు, నామరూపాలు నిర్ణయించటంలో ఈ హిమాలయాలు ఆధారం.

**"ఉత్తరం యత్ సముద్రస్య, హిమాద్రేశ్చవ దక్షిణమ్,**

**తద్వర్షం, భారతం నామ, భారతీయాత్ర సంతతిః!"**

పురాణాలలో సముద్రానికి ఉత్తరంవైపు, హిమాలయ పర్వతాలకు దక్షిణం వైపున్న ప్రాంతమే భారతదేశము అని నిర్ధారించబడినది.

ఈ పర్వత శ్రేణులన్నీ భౌతికంగా ఒక రకమైన సౌందర్యాన్ని, ఆహ్లాదాన్ని మనకందిస్తే, మరొకవైపు ఆధ్యాత్మికంగా ఇవి ఎనలేని శక్తి స్వరూపాలు. ప్రపంచలోని నిజమైన సాధకులు ఎవరైనా సరే ఇక్కడకు రావలసినదే! ఋషులెందరో తమ తపోశక్తిని అనుమడింప చేసుకున్న నేల ఇది. అడుగు అడుగున, చూడగలిగితే, పౌరాణిక, సాంస్కృతిక, ఆర్ష ప్రాధాన్యత మనకు గోచరమవుతుంది. ఇక్కడ మేరు పర్వతం అతిశక్తివంతమైనది. సర్వదేవతలూ అక్కడ నివాసం వుంటారని ఋషులు, యోగులు నిర్ధారించారు.

కేదార్‌నాథ్, బదరీనాథ్ అమరనాద్, కైలాస మానస సరోవరం, మేరు పర్వతం, ఖాట్మండులో పశుపతినాథ్, కాశీ ఇవన్నీ హిమాలయ పర్వత శ్రేణిలోని స్థలాలు. ఇప్పుడు మేము ఎక్కిన పర్వతం అన్నింటికీ మొదలుగా వున్న శివ, శక్తి స్వరూప పర్వతం. అందువల్లనే దీనిని ప్రథమ కైలాస్ అన్నారు. ఇక్కడ నుంచి పైన చెప్పిన అన్ని పర్వతాలకు దారులు వుంటాయట. హిమాలయ యోగులు ఎంతోమంది ఈ ప్రాంతాలన్నీ తిరుగుతూ జీవితాన్ని శివార్పణం చేస్తారట! ఈ పర్వతాలలో గత కొన్ని సంవత్సరాలుగా తిరుగుతూ హిమాలయ గురువులను సంపాదించుకోవటం నా అదృష్టంగా భావిస్తున్నాను.

పరమ పురుషుడైన వాసుదేవుడు తన సంకల్పంతో వైకుంఠము నుండి వచ్చి తానే నారాయణుడుగా మారి తపస్సు చేసిన బదరికాశ్రమము ఈ పర్వతాలలోనే వుంది. అక్కడే నారాయణుడు అష్టాక్షరీ మంత్రాన్ని వివరించి, లోకులకు అందించారు.

బదరీనాద్ మార్గమధ్యంలో అయిదు ప్రయాగలు కనిపిస్తాయి. గంగా, యమున, సరయు, అలకానంద, బ్రహ్మపుత్ర.....మొదలైన నదులు పుట్టిన మూల పర్వతాలు ఇవి.

మనం పూజిస్తున్న ముక్కోటి దేవతలను ప్రత్యక్షంగా దర్శించుకోవాలన్నా, వారి శక్తిని గ్రహించాలన్నా, జన్మ రాహిత్యం పొందాలన్నా, ఈ పర్వతాలే వేదిక. మన సామాజిక ప్రపంచంలో చేసే పూజలు, దానాలు, సేవలు మనలో చిత్తశుద్ధిని, ఏకాగ్రతను, సద్భావనను, సత్ప్రవర్తనను పెంపొందిస్తాయి. ఈ పర్వతాలలో చేసే క్రియలు, జపం, ధ్యానం, సాధనలు.. త్వరగా ఫలించి వివేక వైరాగ్యాలు, విరక్తి, ముక్తి, మోక్షం వంటివి సులభంగా పొందుతామట!. అందుకే ప్రతివ్యక్తి తమ జీవిత కాలంలో కొంతైనా ఈ నేలమీద గడపటం చాలా అవసరం.

నన్ను నడిపిస్తున్న హిమాలయ యోగులు, స్వామీజీలకు నేను పాదాభివందనం చేసుకుంటున్నాను.

ఈ నా కైలాస మానస సరోవర యాత్రలో ఎదురవుతున్న అనుభవాలు నన్ను ఎంతో ప్రక్షాళన చేస్తున్నాయి.

తొలి కైలాసం చేరుకున్నాను.

కాలినడకన వెళ్ళాలన్న సంకల్పం, ఇలా నాగాబాబా సహాయంతో, నాకే తెలియని ప్రాంతాలలో గడపటం, సంత్ సాధన....ఇవన్నీ నా పూర్వ జన్మపుణ్యాం, ఈ జన్మలో, ఈ దేహాన్ని ఇచ్చిన తల్లిదండ్రుల పుణ్యాం, నాలో వైదిక బీజాన్ని వేసి, బాల్యం నుంచి మార్గదర్శకత్వం చేసిన మా తాతగారు శ్రీ సోమయాజులు గారి ఆశీర్వాదం... ఇలా ఎన్నో కలిసి వచ్చి ఈ ముక్తి పర్వతాల మీదకు తీసుకువచ్చాయని అనిపిస్తోంది.

వాన మొదలైంది.

దూరంగా ఒక రేకుల షెడ్డులాంటిది కనిపించింది. అటువైపు పరుగుతీశాము. ఒకతను మాకు ఎదురుగా వచ్చి మళ్ళీ వెనకకు వెళ్ళాడు. అతని చేతిలో పిస్తోలు వుంది. మేము అతని వద్దకే చేరాము. పెద్ద కొండరాయి మీద నుంచి రేకును వాలుగా దించారు. అందరం దాని క్రిందకు చేరాము. అతడు లాల్చీ, పైజామా ధరించి పఠానులా వున్నాడు. హిందీలో మాట్లాడి పరిచయం చేసుకున్నాము. పైన ఎవ్వరూ వుండరని, కేవలం దర్శనం చేసుకుని కిందకు వెళ్ళాలని అన్నారు. కానీ ఆయన వుండటం మా అదృష్టం. సాయంత్రం ఆరు గంటలు అవుతోంది. ఇక తిరిగి వెళ్ళాలంటే అర్ధరాత్రి అవుతుంది. మాతో వచ్చిన మూగ కుర్రవాడు క్రిందికి వెళ్ళిపోతానన్నాడు. అతనికి డబ్బులు ఇచ్చి పంపాము.

# ప్రథమ కైలాస దర్శనం !



ప్రథమ కైలాస స్థానం

మూగ కుర్రవాడు వెళ్తూ నాదగ్గరకు వచ్చి నమస్కరించాడు. నా కెందుకో అతని మీద చాలా జాలిగా అనిపించింది. జేబులోంచి ఇంకొక 10 రూపాయిలు తీసి ఇచ్చాను. వద్దని సైగ చేశాడు. తీసుకోమ్మని బలవంతంగా అతని చేతిలో పెట్టాను. అతను దూరంగా వెళ్ళిపోతుంటే ఏదో తెలియని దుఃఖం లాంటిది. కలిగింది. నామీద నాకే ఆశ్చర్యంగా అనిపిస్తోంది. నా హృదయం చాలా సున్నితంగా అయిపోతుంది. ప్రతి చిన్న దానికి స్పందిస్తోంది. సరాసరి హృదయం స్పందించి. కళ్ళలో తడి నిండుతోంది. విచిత్రంగా వుంది.

షెడ్డులో కూర్చున్నాను. ఒకరితో ఒకరం పరిచయం చేసుకున్నాము. పఠానులా వున్న వ్యక్తి, తన గురువు జమునాగిరి నాగాబాబా, క్రిందకు గ్రామంలోకి వెళ్ళారని కొంతసేపు తరువాత వస్తారని అన్నారు.

సాయం సమయం కరిగిపోతోందికానీ, ఇంకా చీకటి పడలేదు.

ముగ్గురం కలిసి శివలింగం దర్శనానికి వెళ్ళాము. కొండపై భాగాన చిన్న మంచెలాగ కట్టారు. శివలింగం చక్కగా కనిపించింది. ఎవరూ పూజలు చేసినట్లు లేదు. ఆ ప్రక్కనే ఎండిపోయిన పూలు కనిపించాయి. ఆ లింగానికి ఎదురుగా కర్రలు కట్టి వున్నాయి. ఆ కర్రలకు గంటలు వేలాడుతున్నాయి.

మహావతార్ బాబాజీ తపస్సు చేసుకున్న కైలాస పర్వతం. అక్కడ ఒక రాయి మీద కూర్చుని కొన్ని క్షణాలు 'ఓం నమశ్శివాయ' మంత్రం జపం చేశాను. వాతావరణం అంతా మబ్బుగా వుంది. చినుకులు పడుతూ, ఆగుతూ వున్నాయి. ఆకాశానికి ఎంతో దగ్గరగా వున్నామా అని అనిపించింది. నేను ఫోటోలు తీయించుకున్నాను. మబ్బు వలన బాగా రాకపోవచ్చు. అయినా ఫారన్ డాక్టర్ చేత తీయించుకున్నాను.

అక్కడ ఒక ఆశ్రమం కట్టాలని శ్రీ జమునాగిరి నాగాబాబా ఆశయం. పునాదులు లేచి వున్నాయి. అంత కొండపైన నిర్మాణం అంటే చాలా సాహసంతో కూడిన పని. గుర్రాల ద్వారా రాళ్ళు, ఇసుక, సిమెంట్ తెప్పిస్తారట.

షెడ్డుకు ఎదురుగా ఒక రేకుల రూము వుంది. అది ఏమిటని అడిగాను. నాగాబాబా అందులో వుంటారట. పఠాను మాకు టీ కలిపి ఇచ్చాడు. చాలా హాయిగా అనిపించింది తాగగానే. చీకటి ఆవరించింది. రాత్రికి ఆహారం ఏమిటని మాతో వచ్చిన ఇద్దరం హిందీలో మాట్లాడుకున్నాము. అది విని పఠాను (అతని పేరు చెప్పాడు కానీ గుర్తు లేదు.) "నేను

రొట్టెలు చేస్తాను. భయపడకండి" అన్నాడు. నాగాబాబా గదిలో వున్న కొన్ని డబ్బాలు తెచ్చాడు. వాటిలో కారం, ఉప్పు, పిండి వంటివి వున్నాయి.

ఇంతలో దూరంగా, పెద్దగా చప్పుడు అయ్యింది. కొండరాళ్ళు ఏవో దొల్లుతున్నట్లు అనిపించింది నాకు. అంత నిశ్శబ్ద వాతావరణంలో, ఆ శబ్దం భయం కలిగించింది.

ఏమిటది అని అడిగాను.

అతను "నాగబాబా వస్తున్నారని" హిందీలో చెప్పాడు. మరి ఆ శబ్దం ఏమటి? అని అడిగాడు అతను సమాధానం చెప్పేలోపే ఎత్తైన గుర్రం మీద జడలు విరబూసుకుని, కాషాయ రంగు దుస్తులు ధరించివున్న నాగాబాబా వచ్చారు. ఆయన వస్తూనే "ఏం చేస్తున్నావురా?" అంటూ గట్టిగా అరిచాడు. పఠాను వెళ్ళి గుర్రాన్ని పట్టుకున్నాడు. ఆయన క్రిందకు దిగాడు. ఆయనతో వచ్చిన సామానుల సంచీని తీసుకుని ఆయన గదిలో పెట్టాడు. నాగాబాబా సరాసరి మా దగ్గరకు వచ్చాడు.

పొడవైన జుట్టు నల్లని ముఖం, తెల్లని పళ్ళు, ఒంటిమీద వున్న చొక్కా విప్పేసి, చూడటానికి భయంకరంగా వున్నాడు.

"వీళ్ళకు టీ ఇచ్చావా?" అని గట్టిగా అరిచాడు. ఇచ్చాడని మేము తాగామని చెప్పాము.

అమెరికా డాక్టరు గురించి వివరాలు అడిగాడు చెప్పాము.

....బాబాజీ ఆశ్రమంలో పూజారి గురించి ఎలా వున్నాడని అడిగాడు.

అంతా అరుపులు. ఆయన మాటలు వింటుంటే భయంగానే అనిపిస్తోంది. పఠాను రొట్టెలు, చేసేందుకు పిండి కలుపుతున్నాడు. "నేను చేస్తాను రొట్టెలు- నువ్వు సబ్జీ చెయ్యమని" అన్నాడు అతనితో. అతను సంచిలోంచి కొన్ని ఉల్లిపాయలు తీశాడు. అందరం కలిసి వలిచాము. ఇంతలో నాగాబాబా గంజాయి చిలుము వెలిగించాడు. నాకు ఇచ్చాడు. "నాకు అలవాటు లేదని " అన్నాను." "అరె, ఆశ్చర్యంగా వుందే! మా జాతి వాడివై వుండి అది అలవాటు లేదా" అని అన్నాడు. నేను ఏమీ మాట్లాడలేదు. నవ్వి ఊరుకున్నాను. నా ప్రక్కనున్న వాళ్ళిద్దరికీ ఇచ్చాడు. వాళ్ళు కూడా వద్దన్నారు. విదేశీ డాక్టరు మాత్రం తీసుకుని రెండుసార్లు బలంగా పీల్చి ఇచ్చాడు. నేను ఆ డాక్టరును "ఎలా వుంది" అని అడిగాను. అతను చాలా బాగుంది' అని సైగ చేశాడు నవ్వుతూ.

నిజం చెప్పద్దూ! నాలోకూడా, ఒకసారి దాని ప్రభావం ఏమిటో రుచి చూడాలని ఎక్కడో చిన్న కోరిక రేగింది. కానీ ధైర్యం చాలలేదు.

నాగాబాబా, పఠాను ఇద్దరు ఒకరి తరువాత ఒకరు తృప్తిగా గంజాయిని పీల్చుకున్నారు. ఇద్దరు గట్టిగా, ఖుషీగా మాట్లాడుతూ రొట్టెలు, కూర చేసి మాకు పెట్టారు. భగవంతుడు ఆ చీకటి రాత్రి, అంత ఎత్తైన కొండమీద అలా వారి ద్వారా ఆశ్రయం, ఆహారం అందించకపోతే మా పరిస్థితి ఏలా ఉండేదో! నాగాబాబా ఏదో బాషలో భజన పాడాడు. నేను తెలుగులో పాడాను. అర్థంకాకపోయినా అందరం చప్పట్లు కొట్టుకుంటూ గడిపాము. 8.30 గంటలకే అర్ధరాత్రి అయిపోయినట్లుగా నిశబ్దరాత్రి. దూరంగా ఏవో కూతలు, అరుపులు సన్నగా వినిపిస్తున్నాయి. చల్లగాలి బాగా వీస్తోంది ప్రక్కన తెరలాగా

కట్టిన ప్లాస్టిక్ కాగితం చాలా చప్పుడు చేస్తోంది. దానిమీద, కదలకుండా బలమైన రాళ్ళు పెట్టాము. రాత్రి అక్కడ ఉంటామని తెలియక మేము ఏమీ తెచ్చుకోలేదు. క్రింద ఒక ప్లాస్టిక్ కాగితాన్ని పరచుకొని దానిమీదనే సర్దుకు పోవాలని అన్నారు. చుట్టు ప్రక్కల ఎలుగుబంట్లు బాగా తిరుగుతున్నాయని, కొంచెం జాగ్రత్తగా ఉండమని, రాత్రంతా పొయ్యిలో నిప్పు ఆరిపోకుండా పొగ వచ్చేలా చూసుకొమ్మని చెప్పి నాగాబాబా, పఠాను ఆ చిన్నగది దగ్గరకు వెళ్ళిపోయారు.

మేము నలుగురం బయట, చిమ్మ చీకటిలో రేకు క్రింద, ప్లాస్టిక్ కాగితంను క్రింద పరచుకొని దానినే మరొక మడతగా చేసుకొని కప్పుకొని, అందులోకి దూరి వరసగా పడుకున్నాము.

నాకు తొందగా నిద్ర రాలేదు. ఆకలి మీద ఉన్న మాకు రొట్టెలు ఎంతో హాయినిచ్చాయి. కానీ చాలా బరువుగా, మందంగా అనిపించింది. కొంతసేపు తర్వాత బయటకు వెళ్ళాల్సిన పని పడింది. కప్పుకొని హిందీ వాళ్ళిద్దరూ నిద్రపోతున్నారు. విదేశీ డాక్టరును లేపాను. అతనికి నా సమస్య ఇంగ్లీష్‌లో చెప్పాను. ఇద్దరం కలిసి బయటకు వచ్చి, దూరంగా మూత్రవిసర్జన చేసి వస్తూ నాగాబాబా గదివైపు చూశాము. తలుపులు తీసి వున్నాయి, ఒక పెద్ద నూనె దీపం వెలుగుతోంది. చూద్దామని నేను అటు కదిలాను. నాతో ఆ డాక్టరు కూడా వచ్చాడు.

ఇద్దరం ఆగదిలోకి తొంగి చూశాము. పఠాను నిద్ర పోతున్నాడు. నాగాబాబా ధుని ముందు కూర్చుని, ఆసనంలో ఏదో జపిస్తున్నట్లు వున్నాడు. ధునిలోంచి పొగ వస్తోంది. చిన్న రేకుల గది అవ్వటం వలన పొగంతా లోపలేవుంది. లోపలికి వెళ్ళి ఆయన దగ్గర కూర్చోవాలని అనిపించింది. కానీ ధైర్యం చాలలేదు. నాగాబాబా మమ్మల్ని చూశాడు ఆయన ముఖం చాలా భయంకరంగా వుంది. మమ్మల్ని చూసి 'ఏం కావాలని' సైగ చేశాడు. ఏమీలేదని అన్నాను నేను. విదేశీ డాక్టరును పిలిచి చిలుముని ఇచ్చి పీల్చమన్నాడు. అతను మనసుతీరా పీల్చాడు.

నేను నాగాబాబా దగ్గరకు వెళ్ళి,క్రింద కూర్చుని నమస్కరించి ఆశీర్వదించమని, ధునిలోని ఊది పెట్టమని అడిగాను. ఆయన పకపకా నవ్వాడు. అక్కడ నవ్వాల్సిన అవసరం ఏముంది? పఠాను నిద్ర లేచాడు. అతనిని చూసి 'నీవు నిద్రపోరా' అని నా నుదుటి మీద ఊధిని అడ్డంగా నామాలుగా రాసి, 'మనిద్దరం ఒకటేరా!' అని నావీపు మీద తన చేతితో రాసి, ప్రక్కనే ఉన్న త్రిశూలంతో వెన్నెముక భాగాన పైనుంచి కిందికి కొన్ని సార్లు రాశాడు.

"సాయిబాబా నీ కూడా వున్నాడురా. నీకు బాబాజీ కరుణ దొరికింది. లేకపోతే ఈ కైలాస పర్వతం మీదకు రాలేరు. ఇక్కడ అర్ధరాత్రి ఉండలేరు" అంటూ నాతలమీద ఊది చల్లాడు. "నిన్ను చూసి అసూయపడే వాళ్ళు పెరుగుతారు. అందుకే సమాజంలో ఉండకు, ఇక్కడకు వచ్చేయ్" అన్నాడు. నేనేమి మాట్లాడలేదు. ఆయనే మళ్ళీ "నిన్ను బదనామ్ చేసిన వాళ్ళు నీ చూపుతో నాశనం అవుతారు. నీ పెదాల వాక్కుబలం (జబాన్) గొప్పది. పతనం అయ్యేవాళ్ళే నీ గురించి చెడుగా మాట్లాడతారు" అని అన్నాడు.



ప్రథమ కైలాస మార్గంలో...

నాకు తెలిసి నాగురించి చెడుగా అనుకునే వాళ్లు ఎవరూ లేరు.

ప్రక్కనున్న డాక్టరును చూపిస్తూ 'వీడితో చెప్పు. వీడి భార్య కూడా మంచి సాధకురాలు. వీడి కొడుకుకు బాబాజీ పేరు పెట్టమను. ఇతని ద్వారా గొప్ప సేవ జరుగుతుంది. చాలా డబ్బు సంపాదిస్తాడు' అని చెప్పారు. నేను ఇంగ్లీషులో మాటలన్నీ అతనికి అర్థమయ్యేలా చెప్పాను.

నాగబాబా తన ప్రక్కనేవున్న చెంబులోని నీళ్ళను గ్లాసులో పోసుకొని, కొన్ని త్రాగి ఆ గ్లాసును మాకు అందించి "సగం సగం త్రాగండి" అని అన్నాడు ఇద్దరం అలాగే తాగాము.

"పొండి, పడుకోండి" అని అన్నాడు. ఇద్దరం బయటకు వచ్చాము.

చలిగాలి విసురుగా వుంది. చినుకులు పడుతున్నాయి. పరుగులాంటి నడకతో రేకు క్రింద, డేరాలాంటి ప్రదేశంలోకి దూరి, ప్లాస్టిక్ కాగితం ముసుగులో ముడుచుకుని పడుకున్నాము.

తెల్లవారుఝామున నాగబాబా అరుపులు. పఠాను వచ్చి మమ్మల్ని లేపాడు. ఇంకా చీకటి పోలేదు. దీపం వెలుగులో వాచీ చూసుకున్నాను. 5 గంటలు అయ్యింది. "ఇంత తొందరగా ఎందుకు లేపారు" అడిగాను.

నాగబాబా "హల్ద్వాని" గ్రామానికి వెళ్తున్నాడని సామానంతా ఆ గదిలో పెట్టాలని అన్నాడు. మొత్తం ప్లాస్టిక్ కాగితాలతో సహా అన్నీ తీసి గదిలో పెట్టారు. వెలుతురు వచ్చాక మేము వెళ్లామని అన్నారు. ఆశ్చర్యం 5.30 గంటలకే వెలుతురు రావటం ప్రారంభించింది.

నాగాబాబా, పఠానులతో మేము, తక్కువ వెలుతురు లోనే ఫోటో దిగాము.

కైలాస మానస సరోవరం వెళ్ళటానికి దారి చెప్పమని అడిగాను. హల్ద్వాని వస్తే అక్కడ కాలు సిద్ధమందిరంలో తాను వుంటానని, అక్కడున్న కాలు సిద్ధ నాగాబాబా నాకు సహాయం చేస్తాడని చెప్పి, రమ్మని ఆయన గుర్రం మీద పఠానుతో వెళ్ళిపోయాడు.

మేము నలుగురం తిరుగు ప్రయాణం మొదలు పెట్టాము.

రెండు కొండలు దిగగానే చిన్న గ్రామంలో మాకు పెద్దగ్లాసులతో పాలు ఇచ్చారు. అందరం ఆనందంగా తాగాము. వేడిగా వుండటం వలన, చలికి హాయిగా అనిపించింది. తర్వాత తెలిసింది. అవి మేకపాలని! నేను మొదటి సారి త్రాగటం, వింత అనుభవం.

మధ్యాహ్నానికి బాబాజీ ఆశ్రమం చేరాము. మృత్యుంజయపురి నాగాబాబా గురించి వివరించాను. ఆయన 9 దేవాలయాలు ఉన్న చోటనే వున్నారు. అంతకు ముందు రోజు నుంచి విరేచనాలు బాగా ఎక్కువ అవ్వటం వలన ఆశ్రమంలోకి కూడా వెళ్ళలేదట.

మందులు వేసుకున్నారట. చాలా నీరసంగా అలసిపోయారు. ధుని దగ్గరకు కూడా వెళ్ళలేదట!

ఆ పరిస్థితిలో ఇక నా ప్రయాణం ఎటు? ఆయనను నమ్ముకునే, ఆయన ద్వారానే ఇక్కడ దాకా వచ్చాను. చైనా దగ్గరున్న కైలాస మానస సరోవరాన్ని చూడగలనా? నాకు ఇంతేనా ప్రాప్తి! నాలో ఆందోళన మొదలైంది.

మధ్యాహ్నం భోజనం చేసి ఆయన దగ్గరకు వెళ్ళాను. నా ప్రయాణం సంగతి ఏమిటని అడిగాను. ఆయన "నేను చెప్పిన కైలాస పర్వతం ఇదే! ఈ కొండలలోంచి అడ్డదారిలో వెళ్తే కైలాస మానస సరోవరానికి వెళ్ళవచ్చు. కాని ఇప్పుడు నా వల్లకాదు ఎన్ని రోజులకు కోలుకుంటానో తెలియదు. మరి నీ ఇష్టం" అని చేతులు ఎత్తేశారు. తనకు కైలాస మానస సరోవరం రావాలని వుంది కానీ, ఈ పరిస్థితిలో కొన్ని రోజుల దాకా కదలలేనని అన్నారు.

అంతకు ముందు రోజు రాత్రి ధ్యానంలో జరిగినది. నావంటి మీద మంటలు లేచాయని, మృత్యుంజయపురి నాగాబాబా చేసినవి, చెప్పినవి నాతో వున్న ఇద్దరితో చెప్పాను. వారు చాలా ఆశ్చర్యపోయారు. మృత్యుంజయపురి దగ్గర ప్రస్తావన తెచ్చి, తమకు కూడా ధ్యానాన్ని ఇవ్వమని, దీక్షను ప్రసాదించమని అడిగారు. ఆయన అందుకు ఒప్పుకోలేదు సరికదా నేను చెప్పినవన్నీ "అతని కలలో చూశాడు. నేనేమీ ఇవ్వలేదు. నాదగ్గర అటువంటి శక్తులేమీ లేవు. అవన్నీ అతని యొక్క అనుభవాలు. నాకు సంబంధం లేదు." అని దాటేశారు. నాకు ఆశ్చర్యం వేసింది. ఎందుకలా అబద్ధం చెబుతున్నారని అడిగాను. అందుకు ఆయన "చూడు మహరాజ్! ఈ హిమాలయాలో ఎన్నో నేర్చుకుంటారు. అవన్నీ వారి వారి యోగ్యతను బట్టి లభిస్తాయి. ఒకరికి జరిగినట్లు ఇంకొకరికి జరగదు. ఒకరు పొందినది మరొకరు పొందరు. నీకు నేను చెప్పినవి, నీకు చూపించినవి, నిన్ను ఇక్కడకు తీసుకు వచ్చినది, ఇవన్నీ నీ వ్యక్తిగత అదృష్టం. నీకు బాబాజీ అనుగ్రహం బాగా వుంది. లభించాయి. ఇందులో నా ప్రసక్తి తక్కువ. ఈ ఆశ్రమంలో వ్యక్తులు ఇంకొక మహాత్ముణ్ణి రానీయరు. అందువలన నా గురించి ఎవరికీ ఏమీ చెప్పకు. అంతా మనిద్దరి మధ్య వుండాల్సిన రహస్యాలే. కనుక ఇక్కడ మనం ఏమీ తెలియని వ్యక్తుల్లాగా సేవచేస్తూ, సాధన చేసుకోవాలి. గుప్తంగా జీవించాలి. లేకపోతే ప్రాణానికే ప్రమాదం. అందువలన నా గురించి ఎవరికీ చెప్పకు. నీకు భవిష్యత్తు వుంది. నా ఆశీర్వాదం ఎప్పుడూ నీతో ఉంటుంది. నీతో మరో ఇద్దరు వున్నారు. వారు పేరుకు సాధకులు. వారిలో కొస్తంత వైరాగ్యం కూడా లేదు. వారు కూడా కైలాస యాత్రకే వస్తారట. రానీ, నీకు తోడుకోసం వారిని బాబాజీ కలిపారు. నీ వలన వారికి యోగం, కానీ వారిలో లావుపాటి వ్యక్తి కైలాసందాకే వచ్చి వెనుకకు వచ్చేస్తాడు. ప్రదక్షిణ చెయ్యడు. రెండవ వాడు పిరికితనంతో త్వరాగా పూర్తి చేసుకుని నిన్ను విడిచి ఇంకొకరితో వెళ్ళిపోతాడు. ఎవరినీ నమ్మకు, నీవు ఒంటరిగా వెళ్ళు, నీ తోడు ఈశ్వర్‌బాబా వుంటాడు" అని అన్నారు మృత్యుంజయపురి నాగాబాబా. జమునాగిరి నాగాబాబా హల్ద్వాని రమ్మన్నారు" కాలు సిద్ధ నాగబాబా ద్వారా కైలాస యాత్రకు అవసరమైన కాగితాలు ఇప్పిస్తారని చెప్పాను.



హల్ద్వానీ మార్గంలో...

"మంచిది వెళ్ళు. నేను బాగుంటే రేపు ఉదయం ఆశ్రమంలోకి వస్తాను. కలిసి వెళ్దాము. ఒక వేళ రాలేకపోతే నీవు వెళ్ళిపో. ఇక మనం ఎప్పుడు కలుస్తామో ఏమో. వెళ్ళిరా! "అని అన్నారు. నేను వారి పాదాలకు నమస్కరించాను. ఆయన నన్ను గుండెలకు హత్తుకున్నారు. నాకు కన్నీళ్ళు వచ్చాయి.

చీకటి పడింది. భోజన సమయం అవుతోంది. మేము ఆశ్రమంలోకి వచ్చాము. భోజనం చేసి ధుని దగ్గరకు వచ్చి పడుకొన్నాము. గత రాత్రి ప్రథమ కైలాస పర్వతం మీద నిద్ర. ఈ రోజు ఇక్కడ. రేపు ఏమిటి? కాలు సిద్ధ నాగాబాబా ద్వారా సహాయం లభిస్తుందా? కైలాస మానస సరోవరం చూస్తానా.? ఇక్కడ నుంచి ఏమిటి నాకు మార్గం? అంతా అయోమయంగా వుంది. వెనుకకు వెళ్ళిపోవాలా? నాజన్మకు కైలాస యాత్ర వుందా లేదా?

ఇలా ఎన్నో ఆలోచనలు చుట్టుముట్టాయి. అంతా బాబా దయ. ఏం జరగాలో, ఏమి జరపాలో ఆయనకే తెలుసు. ఉదయం 6 గంటలకు ఎవరు వచ్చినా, రాకపోయినా హల్ద్వానికి వెళ్ళాలి. ఆ తర్వాత ఏమవుతుందో చూడాలి? చుట్టూ అంధకారం. దూరంగా జంతువుల అరుపులు, నిద్రరావటం లేదు. ధునిలో మంటను సర్ది, 'హరిఃఓమ్ సాయిరామ్' మంత్ర జపము మొదలు పెట్టాను.



# ప్రయాణంలో మలుపు-మహాత్ముల దర్శనం



కాలుసిద్ధ నాగాబాబా

ఉదయాన్నే లేచి స్నానం, పూజ, ధ్యానం ముగించుకుని శ్రీ మృత్యుంజయపురి నాగబాబా గురించి ఎదురు చూశాను. వారు రాలేదు. నాతోబాటు ఉన్న ఇద్దరూ "ఆయన రారు. ఆరోగ్యం బాగాలేదు. ఆయనకోసం ఎదురుచూస్తే మన సమయం వృథా అవుతుంది. మనం పోదాం" అన్నారు.

నాకు బాధ కలిగింది. ఈ ఆశ్రమం వరకూ తీసుకు వచ్చింది ఆయనే. నిజానికి మహావతార్ బాబాజీ గురించి నాకు చాలా తక్కువ తెలుసని ఒప్పుకోవాలి. మరి పూర్వజన్మలో ఏ సంబంధం వుందో, ఊహించని విధంగా ఇక్కడకు వచ్చాను. కానీ ఈ ప్రదేశం, వాతావరణం నాకు బాగా అనుకూలమైనవీ, నాకు ఇష్టమైనవీ అని అనిపిస్తున్నాయి. ఏదో అనుబంధం అర్థం అవుతోంది. వాళ్ళమాటలు వినకుండా "ఇప్పుడే వస్తాను" అని అవతలి గట్టున తొమ్మిది మందిరాలు ఉన్నచోటుకు వెళ్ళాను. మృత్యుంజయపురి అప్పుడే లేచారు. నమస్కరించి "వస్తారా?" అడిగాను.

"నా వల్లకాదు. నువ్వు వెళ్ళు" అని అన్నారు.

"మీ నుంచి సంత్‌శక్తిని, దీక్షను తీసుకొని వెళ్తున్నాను. నియమాలు ఏమైనా పాటించాలా?" అడిగాను. ఆయన నవ్వారు.

"పీఠాధిపతులు, స్వామీజీలు చెప్పే మార్గాలు సాధనలు వేరు. మనం వెళుతున్న మార్గం వేరు. నియమాలు, నిర్బంధాలు - దుఃఖం, ఆనందం... వీటన్నిటి నుంచి బయట పడటం మన లక్ష్యం. నువ్వు ఏదైనా తిను, తాగు. ఎలాగైనా జీవించు. కానీ మరొకరికి హాని కలగకుండా, మరొకరిని హింసించకుండా జీవించాలి. సహాయం చేసినా, చెయ్యకపోయినా అపాయం చెయ్యకూడదు. మనకు శత్రువులు పెరుగుతారు. విమర్శలు వినిపిస్తాయి. వింత ప్రచారం జరుగుతుంది. కానీయ్... అవన్నీ మాకప్పగించు. నీ మెళ్ళో వున్నాడుగా ముసలాయన (నా మెళ్ళో ఉన్న సాయిబాబా లాకెట్ చూపిస్తూ) ఆయన తక్కువ వాడు కాదు. ఆయనే తీసుకు వచ్చాడు ఇక్కడికి. ఆయన బాబాజీకి స్నేహితుడు. నువ్వు నాకు స్నేహితుడివి. మా జాతిలో (బిరాదరీ) చేరిపోయావు. నీ రక్షణ ఇక మహాత్ములదే! వాళ్ళే నిన్ను రక్షిస్తారు. నీ శత్రువులను శిక్షిస్తారు. నువ్వు మౌనంగా వుండు గత జన్మలో అయిదు హత్యలు చేశావు. నీకు తెలుసా?" అడిగారాయన.

నాకు ఆశ్చర్యం కలిగింది. ఆయన మాట్లాడే విధానం కూడా చాలా సూటిగా, నా రహస్యమంతా బయట పెడుతున్నట్లుగా వుంది.

"నాకెలా తెలుస్తుంది బాబా! ఈ జన్మే అర్థం కావటం లేదు" అన్నాను.

"తెలుస్తుందిలే. ఇంకొక ముసలాడు చెబుతాడులే. నీకు ఈ హిమాలయాలు తల్లిదండ్రులు. చాలా నేర్పాయి, ఇంకా నేర్పుతాయి. ఈ ఆశ్రమాన్ని వదలకు ఇక్కడకు వస్తుండు. నా గురించి ఎవరికీ చెప్పకు. నా గ్రాఫ్ (ఫోటో) నీ దగ్గరుంది కదా. దాని ద్వారా నేను నిన్ను కలుస్తుంటాను. హైద్రాబాద్ వస్తాను. అవసరానికి మించి ఏదీ పోగు చేసుకోకు. వ్యక్తులు కూడా ఎక్కువమంది అనవసరం. రెండు జన్మల సంసారాలు అనుభవించి దాటి పోయావు. ఇక నీకు అంటవు. ఇక నీ పని లోక కళ్యాణమే..." అని ఆయన చెబుతుంటే మధ్యలో ప్రక్కనే వున్న వ్యక్తి

"అంటే ఈ స్వామి పెళ్ళి చేసుకున్నారా? అని అడిగాడు. ఆయన వైపు కోపంగా చూస్తూ...

"నీకు ఇంకొకరి విషయాలు ఎందుకు? నీ జీవితం నీవు చూసుకో. అనవసరంగా ఇంకొకరి జీవితాలలోకి దృష్టి పెట్టేవాళ్ళు చండాలుడుగా జన్మిస్తాడు. అని కసిరి, నా వైపు తిరిగి "నువ్వు వెళ్ళి కైలాసం చూస్తావులే. ఎంతోమంది నీ కోసం సహాయపడతారు. నన్ను గురించి, నా మాటలు రహస్యంగా ఉంచు. బాబాజీని తలచుకుంటూ వుండు. సంవత్సరానికి ఒకసారి ఇక్కడకురా!" అని చిలము తీసుకుని వెలిగించుకున్నారు. నేను నమస్కరించి వచ్చాను.

ఆశ్రమంలో వాళ్ళిద్దరూ సామానులు సర్దుకుని సిద్ధంగా ఉన్నారు. అందరం బయలు దేరాము. ఆఖరి సారిగా ధునికి నమస్కరించుకొన్నాను. నా ట్రావెల్ బ్యాగ్ చాలా పెద్దదిగా, బరువుగా వుంది. అందులో ఉన్న తినుబండారాలు 6 కేజీలు దాకా వుంటాయి.

ఆశ్రమం నుంచి బయటకు వస్తుంటే ఫారన్ డాక్టరు ఎదురై నేను వెళ్తున్నానని తెలుసుకుని తన గదికి రమ్మని తీసుకెళ్ళాడు. రెండు వందల రూపాయలు, తన అడ్రసు ఇచ్చాడు. నేను తీసిన ఫోటోలు పంపమన్నాడు. నాకు బహుమతిగా వందరూపాయలు ఇచ్చి పాదనమస్కారం చేశాడు. వాటిని తీసుకుని బయటకు వచ్చాను. టీకొట్టు అతను మా ముగ్గురిని పిలిచి "ఛాయ్ తాగి వెళ్ళండి మహరాజ్" అన్నాడు.

ముగ్గురం వెళ్ళి, మా దగ్గర వున్న అటుకులు కొన్ని తిని అతను ఇచ్చిన టీ తాగాము. అతనికి ఆశ్రమంలో ఉన్నవాళ్ళ ద్వారానే బేరాలు.

"దత్తాత్రేయుడి గుడికి వెళ్ళండి" అని ప్రక్కనే టీ తాగుతున్న వ్యక్తి మాతో అన్నాడు.

"రెండు రోజుల క్రితం వెళ్ళాను" అని అన్నాను.

మాతోటి వచ్చిన వ్యక్తితో టీకొట్టు అతను "ఇప్పుడు కూడా వెళ్ళండి. మీకు శుభం కలుగుతుంది. ఆశ్రమం నుంచి తిరిగి వెళ్ళేవారు అక్కడికి వెళ్తారు" అని అన్నాడు.

నా ప్రక్కన వున్న వాళ్ళిద్దరూ "ఎండ పెరుగుతోంది ఇప్పుడు వద్దులే, మేము ఆ కొండ ఎక్కలేము" అని అన్నారు.

"నేను వెళ్ళి వస్తాను" అని నా బ్యాగ్ వాళ్ళ దగ్గర పెట్టి ఆ కొండవైపు వెళ్ళాను.

ఆ మందిరం గురించి రాయటం మర్చిపోయాను. మేము అక్కడికి వచ్చిన మర్నాడు సాయంత్రం మృత్యుంజయపురి బాబా తీసుకు వెళ్ళారు.

ఎత్తైన కొండమీద వుంది ఆ గుడి. మెట్లు ఉన్నాయి, గర్భగుడి చాలా చిన్నది. గుడికి ఎదురుగా చాలా పెద్ద గంట వుంది. ఆ గుడికి వేల సంవత్సరాల చరిత్ర వుందట. ఏ గురు సాంప్రదాయానికి చెందిన వారైనా, అక్కడకు వచ్చి నమస్కరిస్తారట.

నేను మెట్లు ఎక్కుతుంటే, ఆ గుళ్ళో పూజచేస్తున్న వ్యక్తి, మరొక సాధువు మెట్లకు ప్రక్కన కూర్చుని వున్నారు. నమస్కరించాను, ఆ సాధువు గడ్డం పెరిగి వుంది. క్రిందనున్న అంగవస్త్రం ఆయన కట్టుకున్న లంగోటాను దాచలేకపోతోంది. ముఖంలో చక్కటి తేజస్సు ఆయనకు పాదనమస్కారం చేశాను.

ఆయన గురించి నాకు పరిచయం చేస్తూ, "వీరు దత్త ఉపాసకులు. హిమాలయాలలో తిరుగుతుంటారు" అని పరిచయం చేశారు.

నన్ను చూపిస్తూ "ఈ స్వామీజీ ఆంధ్రా నుంచి వచ్చారు. కైలాసం వెళ్తున్నారు..." అని ఏదో చెప్తుంటే...

"ఎప్పుడు వచ్చారు నాగా బాబాజీ" అని నన్ను అడిగారాయన.

ఆ పూజారి కల్పించుకుని... "ఈయన కాదు నాగాబాబా. ఈయనతో వచ్చారు మరొకాయన. ఆయన పేరు మృత్యుంజయపురి నాగాబాబా" అని చెబుతుంటే.

"నాకు అంతా తెలుసు. ఇతను కూడా నాగాబాబాయే. పూర్వజన్మలో ఉత్తరాంచల్‌లో పుట్టాడు. ఈ హిమాలయాలలో సాధన చేశాడు. 36 సంవత్సరాలు చేశాడు. అయిదుగురిని చంపి ఇక్కడకు పారిపోయి వచ్చాడు (అని నవ్వారు). ప్రతి క్షణం పశ్చాత్తాపంతో బాధపడేవాడు. వాళ్ళ నాన్న హత్య అతనిని అలా చేసింది పాపం. మనం చెప్పుకుంటున్న రామయోగి మిత్రుడు ఇతను. నాకు బాగా తెలుసు. (నా వైపు తిరిగి) పో, వెళ్ళి దత్తుడు పాదాలు పట్టుకో! బంగాళాదుంపలు బాగా తింటున్నావా?" అని నవ్వారాయన. ఇంకా చాలా మాట్లాడారు కానీ, నాకు కొన్ని మాటలు అర్థం కాలేదు. ఆయనను ఎన్నో అడగాలనుకున్నాను. కానీ అడగలేకపోయాను.

నేను దత్తాత్రేయుడిని నమస్కరించుకుని, వీళ్ళందరి కలయికను, వారి మాటలను తలుచుకుంటూ, దత్తుడిని సాయిబాబాగా తలచి, "ఎన్నో వింతలు చూపిస్తున్నందుకు కృతజ్ఞతలు తండ్రీ" అని సాష్టాంగ నమస్కారం చేశాను.

క్రిందకు వచ్చి సామాను తీసుకుని హల్ద్వాని వెళ్ళేందుకు బయలు దేరాము.

సుమారు 2 కి.మీ. దూరం, లోయలోంచి కొండపైకి ఎక్కితే రోడ్డు వస్తుంది. అక్కడ జీపులు, మినీ వ్యానులు వస్తాయి. వర్షాలు బాగా పడితే ఏ వాహనాలు తిరగవు.

మేము రోడ్డు మీదకు వచ్చేసరికి రెండు గంటలు పట్టింది. లగేజీతో కొండలు ఎక్కడం కష్టం. ఈ అనుభవం కారణంగా మంచి గుణపాఠం వచ్చింది. లగేజి బరువు తగ్గించుకోకపోతే కైలాస యాత్ర చెయ్యలేము అని తెలిసింది.

మధ్యాహ్నం ఒంటిగంటకు ఒక జీపు వచ్చింది. అంతవరకూ హిమాలయాల కొండలమధ్య, చిన్న కాకా హోటలు ఆవరణలో గడిపాము. జీపు నిండితే కాని కదలనన్నారు. మరో అరగంట గడిచింది. మొత్తానికి జీపులో బయల్దేరాము.

జీపు బయలుదేరిన కొంతసేపటికి తుఫానులాంటి వాన. ఎత్తైన కొండల మీద మలుపులు తిరుగుతూ, తుఫానులాంటి వానలో ప్రయాణం ఒక థ్రిల్లింగ్ అనుభవంగా తోచింది.

సాయంత్రం 5-30 గంటలకు హల్ద్వాని స్టేషను దగ్గర దింపాడు.

స్టేషనులో సామాను ఉంచి, ఇద్దరం కలిసి రిక్షాలో కాలుసిద్ధ మందిరం దగ్గరకు వెళ్లాము. అక్కడ జమునాగిరి నాగాబాబా ఉంటారన్నారు.

మెయిన్‌రోడ్డు మార్కెట్‌లో, రోడ్డు ప్రక్కన ఉంది ఆ మందిరం. జనం బాగా ఉన్నారు. అమ్మవారి మందిరం. అమ్మవారి రూపం నల్లగా వుంది. అక్కడ బొట్టు కూడా నల్లగానే వుంటుంది. బెల్లం నైవేద్యం పెడతారట. గుడినిండా కొన్నివేల గంటలు. రకరకాల సైజులు. అతి పెద్ద గంట వ్యాసం 8 అడుగులు వుంటుంది.

శ్రీ జమునాగిరి నాగాబాబా అందరికీ తీర్థం, ప్రసాదం ఇస్తూ కనిపించారు. వారికి నమస్కరించాము. లోపల కూర్చోమన్నారు. గుడిప్రక్కనున్న దారిగుండా లోపలికి వెళ్ళాము. విశాలమైన హాలు. ధుని వెలుగుతో వుంది. ధునికి ప్రక్కన కొన్ని త్రిశూలాలు, సటకాలు నిలబెట్టి వున్నాయి. మహాత్ములు కూర్చొనే ఆసనంలాంటి బల్ల కనిపించింది. వెనకగా చూడగానే నిలువెత్తు దత్తాత్రేయుని విగ్రహం కనిపించింది. నాకు అద్భుతంగా, ఆనందంగా అనిపించింది. అందుకే నన్ను అక్కడకు పిలిపించుకున్నారా అని అనిపించింది. మరొక ఆనందం, గోడకు వున్న రకరకాల దేవుళ్ళు, గురువుల ఫోటోలలో శ్రీగజానన్ మహరాజ్ ఫోటో, శ్రీ సాయిబాబా ఫోటో వుండటం! ఇక నా స్థితిని వివరించలేను. "అడుగు అడుగులో నీ తోడుగా వుండి నడిపించు కుంటాను" అన్న బాబా వాక్యం నా విషయంలో నిరూపించబడింది. ఎక్కడ ఆంధ్రప్రదేశ్, ఎక్కడ ఉత్తరాంచల్ ?

ఆ రకంగా శ్రీ సాయినాథుడు నాకు దర్శనమిచ్చినట్లుగా విశ్వాసం బలపడింది.

జమునాగిరి నాగాబాబా వచ్చి, మాకు మంచినీళ్లు, టీ ఇచ్చి పలకరించి, లోపల ఉన్న మరో గదిలోకి తీసుకు వెళ్ళారు. అక్కడ మంచం మీద 30 సంవత్సరాల లోపు స్వామి కనిపించారు.

ఆయనపేరు 'కాలుసిద్ధ నాగాబాబా' అని చెప్పి మమ్మల్ని వారికి పరిచయం చేశారు. నేను వారికి పాద నమస్కారం చెయ్యబోతుంటే వారు ఒప్పుకోలేదు.

"మీ వంటి సంత్ మహరాజ్ రావటం మా అదృష్టం" అన్నారు.

కైలాస యాత్రకు వెళ్ళాలని, అందుకు సంబంధించిన కాగితాలు ఏమైనా దొరుకుతాయా అని అడిగాను.

ప్రభుత్వం ద్వారా వెళ్ళటం తప్ప, విడిగా వెళ్ళే విధానం నాకు తెలియదని అన్నారాయన. నాకు కొంచెం నిరాశగా అనిపించింది.

"ఇక్కడి నుంచి ధార్చులా వెళ్ళండి. అక్కడ మీకు మార్గం దొరకవచ్చు" అని లేచి రెండు ఇత్తడి గంటలు, దక్షిణగా 50 రూపాయలు తీసుకొని వచ్చి, నాకు ఇచ్చి "ఈ గంటల శబ్దం ఎంతగా మోగుతుందో, మీ కీర్తి ప్రతిష్ఠలు అంతగా పెరుగుతుంటాయి, శుభం, వెళ్ళండి" అని అన్నారు.

వారికి నమస్కరించి ఆనందంతో స్టేషనుకు వచ్చాము. ముగ్గురం చర్చించుకున్నాము. ధార్చులా ఎక్కడ వుంది, నేపాల్ గంజ్‌లో? నాకు వాళ్ళు చెప్పిన దాని ప్రకారం నేపాల్ ధార్చులా, ఇండియా ధార్చులా వున్నాయని తెలిసింది. ఇండియా ధార్చులా వెళ్తే వాళ్ళు వీసా అడుగుతారు. కనుక నేపాల్ ధార్చులా వెళ్దామని నిర్ణయించుకున్నాము, మా దగ్గర నేపాల్ లెటర్ వుంది కనుక! సామాను విషయం గుర్తుకు వచ్చింది. అంత బరువుతో వెళ్ళటం అసాధ్యం. కనుక కొంత సామాను కాలుసిద్ధ మందిరంలో పెట్టి, మరొక చిన్న, వీపుకు తగిలించుకొనే బ్యాగు కొనుక్కొని సర్దుకోవాలని నిర్ణయించుకొని మళ్ళీ కాలుసిద్ధ మందిరానికి వెళ్ళి కొంత సామాను, పెద్ద బ్యాగ్ అక్కడ పెట్టి స్టేషనుకు వచ్చాను. కేవలం చేతికర్ర, స్లీపింగ్ బ్యాగ్, వీపుకు తగిలించుకొనే బ్యాగ్, 3 వస్తువులుగా మారాయి. కొంచెం తేలికగా అనిపించింది.

నేపాల్‌లోకి వెళ్ళి నేపాల్ ధార్చులాచేరి కైలాస యాత్రా మార్గం పట్టుకోవాలని నిర్ణయించుకున్నాము.

**నేపాల్ బోర్డర్‌కి వెళ్ళే రైలు పావుగంటలో వస్తోందని చెప్పారు. ఆ ప్రాంతమంతా సన్యాసులకు టిక్కెట్టు లేదు కనుక నిశ్చింతగా ప్లాట్‌ఫారం మీద ఎదురు చూస్తూ కూర్చున్నాము. ఇంతలో ఒక ముసలాయన మా దగ్గరకు వచ్చాడు. చేతిలో స్టీలు కమండలం వుంది. అడుక్కునే వ్యక్తిలాగ అనిపించలేదు. అలాగని స్వామీజీలాగ లేదు.**

"ఎక్కడికి వెళ్ళాలి?" మమ్మల్ని అడిగాడు. "కైలాస మానస సరోవర యాత్రకు వెళ్తున్నాము" అని చెప్పాము.

"ఇక్కడి నుంచి ఎక్కడికి వెళ్తున్నారు?" ఆయన ప్రశ్న.

"నేపాల్‌లోని ధార్చులా వెళ్దామనుకుంటున్నాము. నేపాల్ బోర్డర్ దాకా, కొద్దిసేపట్లో వచ్చే రైలులో వెళ్ళి అక్కడ ధార్చులా కనుక్కుందామని మా ఆలోచన" అని చెప్పాను.

"ఈ రైలు వెళ్ళదు. మీరు అనవసరంగా అటు వెళ్ళకండి. నేను ఇప్పుడే వస్తాను" అని మంచినీళ్ళకోసం దూరంగా కనిపిస్తున్న కుళాయి దగ్గరకు వెళ్ళాడు. మేము ఆలోచనలో పడ్డాము. రైలు ఎక్కాలా? వద్దా?

వాళ్ళిద్దరూ రైలు ఎక్కి వెళ్దామని అన్నారు. నాకు మాత్రం **ఆయన రూపంలో బాబా వచ్చారని అనిపిస్తోంది. మాకు సరైన మార్గం చూపించటానికే ఆయన కలిశారని బలంగా అనిపించింది. ఆ మాట చెప్పాను కానీ వాళ్ళు వినలేదు. రైలు ఎక్కే వెళ్దామని అన్నారు. నేను రానని చెప్పాను. వాళ్ళు రైలు ఎక్కేందుకు వెళ్ళారు.**

నేను ప్లాట్‌ఫారం మీద ఆ ముసలాయన గురించి ఎదురు చూశాను. రైలు వెళ్ళిపోయింది. మంచి నీళ్ళ కుళాయి దగ్గర ముసలాయన లేదు. అక్కడ నీళ్ళు రావటం



హిమాలయ మార్గంలో చెక్కవంతెన దాటి
పర్వత ప్రయాణం

లేదు. దానివలన ఆయన నీళ్ళకోసం ఎటువెళ్ళాడో! నేను లేచి ఆయన కోసం వెతుకుతూ ప్లాట్‌ఫారం మీద తిరుగుతూ స్టేషను బయటకు వచ్చాను.

ఇప్పుడిక దారి ఏమిటి? ఎందుకో సంచిలో ఉన్న గంటను తీసి ఒకసారి మోగించాలని అనిపించింది. అలాచేసి మళ్ళీ సంచిలోపల పెట్టాను. నా చర్యకు నాకు నవ్వు వచ్చింది. అల్లావుద్దీన్ అద్భుతదీపంలాగ ఆ గంట నాకు దొరికిందని అనిపించి ఎవ్వరూ చూడకుండా తెగ నవ్వుకున్నాను. నన్ను ఆ స్థితిలో ఎవరైనా చూస్తే పిచ్చివాడని అనుకొంటారు. నాలో ఏదో ధైర్యం చోటు చేసుకుంది. బాగా ఆకలి వేస్తోందన్న విషయం అర్థమై, ముందు ఆ పని చూడాలని హోటల్‌లోకి వెళ్ళి రొట్టెలు తిని స్టేషనులోకి వచ్చాను.

ప్లాట్‌ఫారం చివరిలో ఒక మంచి సిమెంట్ బెంచి మీద స్థిరపడ్డాను. చాలాసార్లు రైల్వేస్టేషనులలో గెడ్డాలు పెరిగిన వారు, కాషాయం ధరించిన వారు ప్లాట్‌ఫారాల మీద, క్రింద పడుకుని కనిపిస్తే, వీరంతా బీదవారు, బిచ్చగాళ్ళు అయి వుంటారని అనుకునేవాణ్ణి. ఈ రోజు నేను కూడా ప్లాట్‌ఫారాల మీద గడుపుతూ వుంటే తెలుస్తోంది. నా లాంటి వాళ్ళు కూడా వుంటారని.

ఈ రాత్రి ఎలా గడపాలి? గడిచిన తరువాత ఏమవుతుంది?



# నిరాశలో ఆశ - శ్రీసాయి దర్శనం !

చల్లటి గాలి నా శరీరాన్ని తాకి ఆహ్లాదకరంగా వుంది. ప్లాట్‌ఫారం మీద ఉన్న జనాన్ని వేళ్ళలో లెక్కించవచ్చు.

రెండు మూడు లైట్లు మాత్రమే వెలుగుచున్న కాంతిలో స్టేషను మసగ్గా వుంది. ఇప్పుడేమి చెయ్యాలి? వాళ్ళిద్దరితో రైలులో వెళ్లిపోయినా బాగుండును. ఇలా ఒంటరిగా మిగిలిపోయే వాడిని కాదు.

కొంతసేపు దత్తాత్రేయుడ్ని, సాయిబాబాను జపించుకొన్నాను.



భారత హిమాలయాలలో సుందర ప్రదేశం

"ఏం మహరాజ్, నీ కోసం అంతా వెదికి వస్తున్నాను" అన్న పిలుపుతో వెనకు తిరిగి చూశాను. ఇందాకా కలిసిన ముసలాయన నా దగ్గరకు వచ్చాడు. నా ప్రక్కన కూర్చుంటూ...

"నీవు రైలు ఎక్కలేదా? ఇందాక వచ్చి ఇక్కడంతా వెదికాను. కనిపించకపోతే మీవాళ్ళతో నీవు కూడా వెళ్ళిపోయావని అనుకున్నాను. నీళ్ళు తాగుతావా" అని తన కమండలం అందించాడు, వద్దన్నాను.

"మీ కోసం చూశాను. రైలులో వాళ్ళు వెళ్ళిపోయారు. మీరు ఎంతకూ రాకపోతే బయటకు వెళ్ళి టిఫిన్ చేసి వచ్చాను. ఏం చెయ్యాలో తెలియటం లేదు. ఇప్పుడు నన్ను ఏం చెయ్యమంటారు?" ఆయన మర్మగర్భంగా నవ్వుతూ...

"అల్లామాలిక్..." అన్నాడు. ఆ మాటలు వినగానే... ఆయనే సాయిబాబా అన్న భావన బలపడింది నాలో. ఆయనను గుచ్చి గుచ్చి చూశాను. ఆయన పెదాలమీద నవ్వు స్థిరంగా మెరుస్తోంది.

"నీవు అధైర్య పడకు. ఇక్కడనుంచి బస్‌స్టాండ్‌కి వెళ్ళు. రాత్రి 12 గంటలకు 'ధార్చులా' వెళ్ళే బస్సు దొరుకుతుంది. అది ఎక్కి ధార్చులా వెళ్ళు. ఆ తర్వాత దారి నీకు దొరుకుతుంది. నీ దగ్గర చిల్లర వుందా?" అడిగాడాయన.

**ఆయన పలికే ప్రతి వాక్యం బాబా పలుకుతున్నట్లుగా వుంది. ఆ భాష హిందీ అయినా, నాకు మరాఠిలాగా వినిపించింది. ఆయన చిల్లర అడగటం, దక్షిణ అడగటంగా భావించి, జేబులోంచి డబ్బులు తీశాను. కొంత చిల్లర, ఒక 5 రూపాయలు నోటు వచ్చాయి. ఆయన 5 రూపాయల నోటు తీసుకున్నాడు. చిల్లర కూడా తీసుకోమన్నాను.**

"వద్దు, నీవు ఆనందంగా కైలాసయాత్ర చేసుకొనిరా. నేను నీ కూడా వుంటాను" అని హఠాత్తుగా లేచి తన కమండలం తీసుకుని వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోయాక గుర్తుకు వచ్చింది. ఆయనకు పాదనమస్కారం చేసుకోలేకపోయాననే అని.

"ఓ సాయిబాబా ఇక్కడున్నావా?" అంటూ గోవిందదాస్ అతని స్నేహితుడు వచ్చారు.

"ఏంటి... మీరు రైలులో వెళ్ళలేదా?" ఆశ్చర్యంగా అడిగాను. "వెళ్ళలేదు. రైలు ఎక్కాక ఒకరిని అడిగాము. ధార్చులాకు రైలు వెళ్ళదట. ఇక్కడనుంచి కారులో వెళ్ళాలట. అందుకని దిగిపోయాము. నీవు కనిపించక మేము బయటకు వెళ్ళి ఎలా వెళ్ళాలో అంతా కనుక్కొని వచ్చాము. రాత్రి 11-30 తర్వాత బస్సు వెళ్తుందట. ఇంకా 3 గంటలు వుంది. అంతవరకు ఇక్కడే గడిపి బస్స్టాండుకు వెళ్దాము" అని ఒకతను ప్లాట్‌ఫారం మీద తన గోనుపట్టా పరచి తలక్రింద బ్యాగ్ పెట్టుకుని నడుము వాల్చాడు. మిగిలిన ఇద్దరం కూడా క్రింద పడుకున్నాము. నాకు నిద్రపట్టింది. 10-30 గంటలకు నన్ను నిద్రలేపారు. ముగ్గురం కలిసి బస్స్టాండుకు బయల్దేరాము.

నాకు బస్ ప్రయాణం పడదు. అయినా తప్పదు. అన్ని అనుమానాలు తీర్చుకున్నాను. 12-30 గంటలకు ఒక బస్సు వచ్చింది. ఆ బస్సు ఎక్కితే 'అల్మోరా' దాకా వెళ్ళొచ్చుట. అక్కడినుంచి ధార్చులా బస్సులు దొరుకుతాయట.

బస్సు ఎక్కాము. ఉదయం 4-30 గంటలకు అల్మోరా చేరాము. 6.30 దాకా బస్సులేదట. వాళ్ళిద్దరూ ఒక అరుగుమీద పడుకున్నారు. నా బ్యాగ్ కూడా వాళ్ళదగ్గర పెట్టి చూస్తుండమని నేను బయటకు వెళ్ళి వచ్చాను.

వాళ్ళిద్దరూ మత్తుగా నిద్రపోతున్నారు. వాళ్ళ బ్యాగ్‌లను తలక్రింద ఒకటి, ప్రక్కన అనుకుని మరొకటి ఉంచుకుని నిద్రపోతున్నారు. నా రెండు బ్యాగ్‌లు దూరంగా వదిలేశారు. డబ్బు మొత్తం ఆ బ్యాగ్‌లో వుంది. నాకు చాలా భయం వేసింది. వాళ్ళ నిర్లక్ష్యానికి అసహ్యం వేసింది. నాగాబాబా ముందే జాగ్రత్త చెప్పారు. "వాళ్ళు నీతో వస్తున్నట్లు లెక్కలో పెట్టుకోకు. ఇద్దరూ స్వార్థపరులు. ఎంతవరకూ అవసరమో అంతే వుండు" అని చెప్పారు.

ఉదయం 6 గంటలకు బస్సు ఎక్కి సా॥ 6-30 గం॥ ధార్చులా చేరాము. దారిలో అంతా హిమాలయాలే. దేవదారు, కర్పూరపుచెట్లు అద్భుతంగా కనిపిస్తాయి. హిమాలయ సౌందర్యం మాటల్లో వర్ణించలేనిది. చూసి అనుభవించవలసినదే! ప్రకృతిలో అద్భుతమంతా అక్కడే వున్నదా అని అనిపించింది. ఎన్నో వాగులు, వంతెనలు దాటుకుంటూ 'పిథోరాగడ్' అనే ఊరుమీదుగా సాగింది బస్సు. పిథోరాగడ్ ఢిల్లీకి 55 కి.మీ. దూరంలో వుంది. జిల్లా కేంద్రము. కైలాస మానస సరోవర యాత్రను 2 సంవత్సరాలు వరుసగా చేసి తరించిన శ్రీ ప్రణవానంద స్వామి ఆ ఊళ్ళోనే వున్నారట. ఆయనను కలిస్తే బాగుండునని అనిపించింది. కానీ బస్సు ప్రయాణంలో అది సాధ్యం కాదు.

ఆ తర్వాత 'కాళిగంగ' నది యొక్క వంపుల సౌందర్యం చూస్తూ సాగింది ప్రయాణం. బస్సులో నుంచి ఆ సుందర దృశ్యాలు అద్భుతంగా కనిపిస్తున్నాయి. కాళిగంగ, నేపాల్ భారతదేశాలను విడదీసి సాగుతోందట. అవతల ఒడ్డున అంతా నేపాల్ కొండలు, గ్రామాలు కనిపిస్తాయి. ఆ తరువాత 'జల్జిబి' అనే చోట బస్సు ఆగింది. అది ఒకప్పటి పెద్ద వ్యాపార కేంద్రమట. అక్కడ తెలుపు, నలుపుల నదుల సంగమం కనిపిస్తుంది. అ చాలా విచిత్రంగా వుంది. నేపాల్ కొండల్లోంచి వచ్చే నది నీరు స్వచ్ఛంగా తెల్ల



కాళీగంగ ప్రాంతంలోని హిమాలయ సౌందర్యం

పాలధారగా కనిపిస్తుంది. భారత భూభాగంలోని 'కాలాపానీ' నదినుంచి వచ్చే 'కాళీగంగ' నీరు నల్లగా కనిపిస్తుంది. ఆ రెండూ కలిసే సంగమం చూస్తే గంగా, యమునల సంగమం మనకు గుర్తుకు వస్తుంది.

"బిల్వాకోట్" అనేవూరు దాటి ఆ కాళీగంగా నదిని చూస్తూనే సాయంత్రం 6-30 గంటలకు ధార్చులా బస్‌స్టాండ్‌లో దిగాము.

దగ్గరలో ఏదైనా గుడి వుందా అని అడిగాము. హనుమంతుడి గుడి వుందని చెప్పారు. సందులు తిరుగుతూ, విచారిస్తూ హనుమాన్ గుడికి చేరాము. ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటూ వున్నారు. ఒకతను తెల్లని గడ్డంతోను ఒంటిమీద బట్టలేకుండా ఉన్నాడు. మరొకాయన పొడవాటి లాల్చీ, పంచెపై వాస్కోట్ ధరించి ఉన్నాడు. వారు ఏదో చదువుకుంటూ మాట్లాడుకుంటూ వున్నారు.

మేము నేరుగా గుడిలోకి వెళ్ళాము. ముందుగా హనుమంతుడికి నమస్కరించుకున్నాను. ఆశ్చర్యంగా, హిమాలయ తీరాలలో నేను వెళ్ళిన ప్రతిచోట హనుమంతుని గుడి ఉండటం, నేను అక్కడికే వెళ్లటం! నేపాల్‌లో కూడా హరిశంకర్ గిరి నాగాబాబా దగ్గర కూడా అదే జరిగింది. మారుతి రూపంలో శ్రీ సాయిబాబా నన్ను అనుగ్రహిస్తున్నాడని అనిపించింది.

మందిరం ముందున్న మండపం చాలా విశాలంగా వుంది. 100 మంది దాకా పడుకోవచ్చు. వారిద్దరికి మమ్మల్ని పరిచయం చేసుకున్నాము. కైలాసయాత్రకు వెళ్తున్నామని చెప్పాను. తెల్లని గడ్డం అయన ఆ మందిరం నిర్వహిస్తున్న స్వామీజీ అనుకున్నాము. కానీ కాదు. ఆయన కూడా కైలాస యాత్ర కోసం వచ్చివున్నాడట. పేరు సీతారాందాస్. అయోధ్య నుంచి వచ్చాడు. 'త్యాగి' సాంప్రదాయం మనిషి. వాస్కోట్ ధరించిన ఆయన ఆ మందిరం నిర్వహిస్తూ, మాబోటి యాత్రికులకు ఆ మందిరంలో ఆశ్రయం ఇస్తున్నారు. ఆయనపేరు జోషి. వంటచేసుకునేందుకు స్టౌ, గిన్నెలు ఇస్తాడట. మాకు ఆనందం కలిగింది. ఆ రాత్రి మా దగ్గర వున్న పదార్థాలు తిని పడుకున్నాము.



## హఠయోగి దర్శనం - ఆదరణ !



నేపాల్ కొండలలోని దారి

ఉదయం లేవగానే నాతో వచ్చిన వ్యక్తి వచ్చి మందిరం బయట పంచలో తెలుగువాళ్ళు వున్నారని చెప్పారు. వెళ్ళి కలిశాను. వారు కరీంనగర్ నుంచి వచ్చారట. కోయదొరలు లాగ వున్నారు. ఆ ప్రాంతంలో వారికి జాతకం పిచ్చి ఎక్కువట. వీరు జాతకాలు చెప్పి డబ్బులు సంపాదించుకుంటారట. అలా వచ్చిన కొంతమంది ధార్చులా ప్రాంతంలో కొన్ని నెలలు వుండి, చుట్టుప్రక్కల ప్రాంతాలు తిరిగి, గంజాయిని పోగు చేసుకుని, దొంగతనంగా తమ ప్రాంతాలకు తీసుకువెళ్ళి డబ్బు గడిస్తారట. వీళ్ళు చాలామంది వాళ్ళలాగానే వున్నారు. ఒక గురువు, ఇద్దరు శిష్యులు. ఉదయాన్నే అన్నం వండుకుని తినేసి ఎర్రటి దుస్తులు ధరించి, పొడవైన బొట్లు పెట్టుకుని అలంకరణలు చేసుకుని బయటకు వెళ్ళిపోయారు. నన్ను తెలుగువాడిగా గౌరవించి అవసరమైతే తమ గిన్నెలు వాడుకొమ్మని చెప్పారు.

నేను టాయిలెట్ కోసం ఒక సీసా నిండా నీళ్ళు తీసుకుని బయల్దేరాను. ఆ దేవాలయానికి ఎదురుగా ఒక ఫర్లాంగు దూరం వెళ్ళాకే మరుగు ప్రదేశం కనిపించింది. గతంలో అక్కడ ఏవో బిల్డింగ్‌లు ఉన్నట్లు, వాటిని కూల్చివేసినట్లుగా తెలుస్తోంది ఆ ప్రాంతం. ప్రక్కనే కాళీనది పారుతోంది. ఆ నది అంచున ఎత్తైన కొండ వుంది. ఇంతలో నా ప్రక్కనుంచి ఒక పొడవైన వ్యక్తి వెళ్తూ కనిపించాడు. కేవలం గోనె సంచి ముక్కని గోచీగా పెట్టుకుని ఉన్నాడు. మరొక అచ్ఛాదన ఏమీ లేదు అతని శరీరం మీద. నన్ను క్రింద నుంచి పైదాకా చూశాడు. నా చేతిలో ఉన్న బిస్లరి బాటిల్‌ను చూసి "దాహంగా వుంది, ఆ నీళ్ళు ఇయ్యమని" సైగ చేసాడు. ఇవి మంచివి కావని హిందీలో చెప్పాను. అయినా ఇవ్వమన్నాడు. నేను ఇచ్చే దాకా ఆగకుండా ఆ సీసాను తీసుకుని సగం నీళ్ళు తాగేసి, తిరిగి నాకు బాటిల్ ఇచ్చి వెళ్ళిపోయాడు. ఆశ్చర్యం వేసింది. నల్లగా, జుట్టు, గెడ్డం పెరిగిపోయి పిచ్చివాడిలాగ ఉన్నాడు. అతని ఎత్తు ఆరు అడుగుల కన్నా ఎక్కువే వుండవచ్చేమో !

నేను కాళీ నదిలోంచి బాటిల్ నింపుకుని నా కార్యక్రమంలో పడ్డాను. యథాలాపంగా కొండవైపు చూశాను. ఒక గుట్టలాగ ఎత్తుగా వున్నచోట కాలుమీద కాలువేసుకుని కూర్చుని వున్నాడు. నేను అతనికి కనిపిస్తున్నానో లేదో కాని, నాకు అతను కనిపిస్తున్నాడు. ఎందుకో అయన ఆకర్షణగా అనిపిస్తున్నాడు. నేను అలా చూస్తూండగానే అతను ఒకచోట నుంచి మరో చోటకు, కాలుమీద కాలువేసుకునే మూడు చోట్లకు, ఒక తోలు బొమ్మలాగ ఎగురుతూ మారాడు. నా కళ్ళను నేను నమ్మలేదు. నిజమేనా అని గ్రుచ్చి గ్రుచ్చి చూశాను. ఖచ్చితంగా

నిజం. అనుమానం లేదు. ఒక అద్భుతం చూస్తున్నట్లుగా వుంది. నేను నా కార్యక్రమం పూర్తి చేసుకుని సీసా ఖాళీచేసి నదిలో కాళ్ళు కడుక్కుని తిరిగి కొండవైపు చూశాను. అతను లేడు. మందిరానికి వచ్చి అతని గురించి జోషిగారికి చెప్పాను. ఆ ముసలాయన అతని గురించి చాలా విషయాలు చెప్పాడు.

అతని పేరు ఎవరికీ తెలియదని, కొన్ని సంవత్సరాలుగా అక్కడ ఉన్నాడని అతను అఘోరి హఠయోగి అని, శవాల మాంసం, చేపలు, కోడి మాంసం వంటివి తింటాడని, అందరూ అతనికి భయపడతారని, ఒక్కొక్కసారి ఒంటిమీద గోచీ కూడా లేకుండా నగ్నంగా ఊళ్ళోకి వస్తాడని అన్నాడు. నేను వెళ్ళి ఫోటో తీసుకుంటానని అన్నాను. అలా చేయవద్దని గతంలో ఒకతను ప్రయత్నిస్తే, అతని కెమెరా లాక్కుని నదిలోకి విసిరేశాడని అన్నాడు. కానీ మళ్ళీ కలసి అతనితో మాట్లాడితే బాగుండునని అన్నాను. చాలా కష్టం అన్నాడా ముసలాయన.

నేపాల్ కార్యాలయానికి వెళ్ళి పాసు రాయించుకోవాలని అన్నారు. స్నానం చేసి బయలుదేరాను. కొండ ప్రాంతమగుట వలన ఎత్తుపల్లాలు రోడ్లు అవి. పైకి ఎక్కగానే ఎడంవైపున "కుమాయున్ నిగమ్" వుంది. అది భారత ప్రభుత్వ కార్యాలయం కైలాస యాత్రకు వెళ్ళే భారతీయ బృందాలను అక్కడ వుంచుతారు. అక్కడ నుంచి రెండు మలుపులు తిరగ్గానే తాడు వంతెన వస్తుంది. క్రింద కాళి గంగానది ప్రవహిస్తుంది. ఆ వంతెనకు ఇవతల భారతీయ మిలటరీ, అవతల నేపాల్ మిలిటరీ ఉంటారు. అందరినీ చెక్ చేస్తారు. ఉదయం ఆరు నుంచి సాయంత్రం ఆరు వరకు మాత్రమే ఆ వంతెన దాటనిస్తారు. ఆ వంతెన దాటి నేపాల్ ధార్చులాలోకి వెళ్ళాను. అన్నీ షాపులు. నేపాల్, చైనా వస్తువులు బాగా దొరుకుతాయి. ఆ షాపులన్నీ దాటి ఊళ్ళోకి వెళ్ళాను. నేపాల్ అధికారిని కలిసి నా దగ్గరున్న కాగితం చూపించాను. అది సరిపోతుందని, చైనాలో ఆ కాగితం చూపిస్తే వాళ్ళు వెళ్ళనిస్తారని అన్నాడాయన. కానీ నేపాల్ దారి అస్సలు బాగా లేదని, కొండలు చీలిపోయి వున్నాయని, వానల కారణంగా దారి అంతా ముక్కలుగా విడిపోయి వుందని అన్నారు. భారతీయులు కనక ఒక నలభై కి.మీ. భారతదేశం వైపు నుంచి వెళ్ళి సీతాపూల్ అనే చోట నేపాల్‌లోకి ప్రవేశించి వెళ్ళవచ్చని సలహా చెప్పారు. కానీ భారతీయ ధార్చులాలో అక్కడి అధికారి అనుమతి లేనిదే మిలటరీ వాళ్ళు వెళ్ళనీయరని, వారి నుంచి ఒక కాగితం తీసుకోమన్నారు. తిరిగి మందిరానికి వచ్చాను. అక్కడ మానస సరోవరానికి వెళ్ళేందుకు వచ్చిన మరో ముగ్గురున్నారు. వారికి ఆ విషయం చెప్పాను. అందరం కలిసి యస్.డి.ఒ. కార్యాలయానికి వెళ్ళాము. వాళ్ళు మా దగ్గర భారతీయుణ్ణి అని నిరూపించుకునేందుకు ఆధారం చూపమన్నారు. నా విజిటింగ్ కార్డ్ చూపించాను, సరిపోదన్నారు. నేను హైద్రాబాద్‌లోని కొన్ని ఫోన్ నంబర్లు ఇచ్చినా వారు నమ్మలేదు. ప్రభుత్వ పరంగా అధికారిక ధృవీకరణ కావాలన్నారు. ఎంత చెప్పినా ఒప్పుకోలేదు. నిరాశతో తిరిగి వచ్చాము. వస్తుండగా బజారులో ఆ హఠయోగి ఒంటిమీద అదే గోచీతో, దూరంగా, మాకు ఎదురుగా వస్తూ కనిపించాడు. అతను మా దగ్గరకు వచ్చాక హిందీలో నన్ను తనతో రమ్మన్నాడు. నేను నా ప్రక్కనున్న వాళ్ళను చూశాను. వాళ్ళు వ్యంగ్యంగా

నవ్వుతూ "మేము వెళ్ళిపోతాము, నువ్వెళ్ళు" అని వెళ్ళిపోయారు. వారిలో ఒక ముసలాయన నాతో వస్తానన్నాడు. ఆ హఠయోగి మా ఇద్దరినీ ఒక చిన్న టీ బంకు లాంటి దానిలోకి తీసుకెళ్ళాడు. అక్కడున్న బల్లలమీద కూర్చున్నాము. ఆ హోటలు ఖాళీగా వుంది. మా ముగ్గురికీ టీ ఇచ్చాడు ఒకతను. అతను యజమానిలాగ వున్నాడు. చిన్న తుండుగుడ్డ మొలకు చుట్టుకున్నాడు. జుట్టు పెరిగి వుంది. మెళ్ళో ఒక రుద్రాక్ష వ్రేలాడుతోంది. "సంత్ మహరాజ్" అంటూ నా వివరాలన్నీ హిందీలో అడిగాడు. చెప్పాను. నాకు భగవంతుడి దయవల్ల, హిందీ భాష బాగా రాకపోయినా, నా భావాన్ని చకచకా చెప్పేస్తాను. అదొక అదృష్టం లేకపోతే వీళ్ళందరితో చాలా సమస్య అయ్యేది.

హఠయోగి ఒకదాని తరువాత ఒకటి నాలుగు టీలు ఒకే గ్లాసులో పోసుకుని త్రాగాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. బంకు యజమాని నన్ను చూస్తూ "ఆశ్చర్యంగా వుందా?" అని నవ్వుతూ అడిగాడు. "ఆయన అలా విడివిడిగా తాగే బదులు నాలుగు టీలు ఒకే పెద్ద గ్లాసులో పోసుకుని త్రాగవచ్చుగా?" అని అడిగాను. అతను నవ్వుతూ "బాబాజీ మూడ్ మనకు తెలియదు. ఒక్కొక్కసారి ఒక్క టీ తాగుతాడు. ఒక్కొక్కసారి ఎన్నిటీలు తాగుతాడో చెప్పలేము. ఈ రోజు నాలుగు తాగాడు. ఒక రోజున 18 టీలు వెంట వెంటనే పోస్తుంటే తాగేశాడు. అలా వుంటుంది ఆయన పద్ధతి. అందుకని ఆయన చాలు అనే దాకా ఒక దాని తరువాత ఒకటి ఇస్తుంటాను. లేకపోతే ఆయనకు ఎక్కువైతే మొత్తం పారపోసేస్తాడు". టీ కొట్టు యజమాని బయటకు వెళ్ళి మా ముగ్గురికీ కిళ్ళీ తెచ్చాడు. నాకు భయం వేసింది. అది ఏమి కిళ్ళీయో అని! మా ఇద్దరకు మామూలు కిళ్ళీ తెచ్చాడు. ఆయనకు ప్రత్యేకమైనవి రెండు తెచ్చాడు. హఠయోగి రెండింటినీ ఒకేసారి తినేసాడు. లేచి వెళ్ళిపోయాడు. మాతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు. మమ్మల్ని ఎందుకు రమ్మన్నాడో తెలియదు. టీ కొట్టు యజమానికి డబ్బులు ఇవ్వబోయాను, నిరాకరించాడు. తాను కూడా నాగాబాబా అని. సాధన కోసం హిమాలయాలకు వచ్చాననీ, ఆ హఠయోగి దగ్గర శిష్యరికం చేస్తున్నాననీ, ఆయన చెప్పటం వల్లనే ఈ బంకు పెట్టాననీ చెప్పాడు. సాధు, సంత్‌లకు ఉచితంగా టీ ఇస్తుంటాననీ చెప్పాడు. ఎంతో అద్భుతంగా తోచింది. అక్కడున్నంత కాలం ఎన్నిసార్లైనా టీ తాగేందుకు రమ్మని అన్నాడు. నా మెళ్ళో మృత్యుంజయపురి నాగాబాబా నేపాల్ గంజ్‌లో కట్టిన రుద్రాక్షను చూసి "మృత్యుంజయపురి ఎక్కడున్నాడు?" అని అడిగాడు. నాకు మరింత ఆశ్చర్యం కలిగింది. ఆయన దీనిని కట్టినట్లు ఎలా తెలిసింది? ఆయన పేరును ఇతను ఖచ్చితంగా ఎలా చెప్పగలిగాడు? "ఆయన మీకు తెలుసా?" అడిగాను. "తెలియదు. ఆ రుద్రాక్ష మీద నాకు ఆయన పేరు కనిపించింది" అని అన్నాడు నవ్వుతూ. నాకు తెలిసి అది ఆరు ముఖాల రుద్రాక్ష మాత్రమే! దానిమీద ఎటువంటి పేరు లేదు. ఆ రుద్రాక్ష మహాత్మ్యమా? అతనిలోని సిద్ధుల గొప్పతనమా? అన్నీ వింతగా వున్నాయి. ఆయనకు నమస్కరించి వచ్చేశాము.

హిమాలయాలలో ప్రతి వ్యక్తి ఏదొక సాధనలో వుంటాడు. ప్రతి వ్యక్తికి కొన్ని సిద్ధులు ఉంటాయి. పైకి పిచ్చివాడిలాగ, బిచ్చగాడిలాగ కనిపించేవీళ్ళు మహాత్ములు. నా అదృష్టం వీరి దర్శనం దొరకటం.

మందిరానికి వచ్చి ఆలోచనలో పడ్డాము. ఇండియా రూటులో వెళ్ళేందుకు మాకు అవకాశం కనిపించటం లేదు. అప్పటికే రెండు రోజులు గడిచిపోయాయి. వానలు పెరిగాయి. ఈ సమయంలో కైలాసయాత్ర ప్రమాదం అని అందరూ చెబుతున్నారు. పండిట్ జోషిగారు నాతో చాలా ఆప్యాయతగా ఉంటున్నారు. వారికి సాయిబాబా అంటే చాలా ఇష్టమట. ఆయన మందిరంలో ఒక అవధూత ఉండేవారట. ఆయన సాయిబాబాను చూశారట.

వర్షాలు బాగా పడుతుండడం వలన మరో రెండు రోజులు ఆ మందిరంలో ఉండిపోవలసి వచ్చింది. రాత్రిళ్ళు కరీంనగర్ కోయదొరలు గంజాయి ప్రోగ్రాములు, మత్తుగా కబుర్లు, పాటలు, పగలు. నిద్ర, జపము, రొట్టెలు తినటం.. ఇలా గడిపాను.

నాతో వచ్చిన వాళ్ళలో ఒకతని దగ్గర "హ్యాండీ క్యాప్డ్" సర్టిఫికేట్ వుందట. అది చూపిస్తే వెళ్ళనిస్తారని అన్నాడు. అతను హామీ ఇస్తే మిగిలిన ముగ్గురం కూడా వెళ్ళిపోవచ్చని అన్నాను. అతను తనతో వచ్చిన వ్యక్తికి మాత్రమే హామీ ఇస్తానని మిగిలిన మా ఇద్దరికీ ఇవ్వనని అన్నాడు. ఎందుకని? అని అడిగితే "మీ గురించి నాకు తెలియదు కదా. ఏదైనా తేడా వస్తే నేను ఇరుకులో పడతాను" అన్నాడు. నాకు అతని మీద అసహ్యం పుట్టింది. కాషాయం ధరించి అలా మాట్లాడటం, మరొక సాధువుకి సహాయం చెయ్యటానికి నిరాకరించటం ! ఛీ, వీళ్ళు ఏ స్థాయి సాధువులు? అంగవైకల్యం అతని కాలుకు లేదు, అతని మనసుకు! అని అనిపించింది. అతని చిన్న మాట సహాయంతో అందరం కలసి ఒకరినొకరు తోడుగా వెళ్ళవచ్చుకదా! స్వార్థం నిండిన మనుషులు.

వాళ్ళిద్దరూ యమ్.డి.ఒ. నుంచి అనుమతి పత్రం తీసుకున్నారు. నా పరిస్థితి ఏమిటో తెలియరాలేదు. బాబా మీద భారం వేశాను. ఏమి లీల చూపుతాడో! అక్కడ ఎన్ని రోజులు, ఎందుకు ఉంచుతున్నాడో? ఉదయం 11 గంటలకు టీ కొట్టు యజమాని వచ్చాడు. నన్ను గురూజీ (హఠయోగి) తీసుకు రమ్మన్నాడని అన్నాడు. మందిరంలో నేను, ఒక ముసలాయన మాత్రమే వున్నాము. ముసలాయన నన్ను వెళ్ళవద్దనీ, వాళ్ళు మనిషిని చంపుకు తింటూంటారనీ, మోసం చేసి డబ్బులు లాక్కుంటారనీ, ప్రక్కకు పిలిచి చెప్పాడు.

ఒకసారి మృత్యుంజయపురి నాగాబాబా విషయంలో తప్పు చేశాను. ప్రాణాలకు తెగించి ఇంత దూరం వచ్చాకే ఇంకా భయపడటం ఎందుకు? గుళ్ళోకి వెళ్ళి హనుమంతుడికి నమస్కరించి కొంత డబ్బును నా దగ్గర పెట్టుకుని బయలు దేరాను. అతను కాళీ గంగ ఒడ్డు నుంచి సన్నటి దారి గుండా, కొండ వెనుకకు తీసుకు వెళ్ళాడు. చినుకులు పడుతున్నాయి. ఇంతలో ఒక ముల్లు గుచ్చుకుంది. బూటులోంచి లోపలికి వెళ్ళింది. అతను వచ్చి ముళ్ళు తీశాడు. బాగా నొప్పి కలిగింది. బూటు తియ్యమన్నాడు. తీశాను. బాగా రక్తం వస్తోంది. అతను నదిలోని నీళ్ళు దోసిలితో తెచ్చి పాదాన్ని కడిగాడు. రక్తం కారే చోట నోటితో పీల్చి రక్తం తాగేశాడు. నాకు భయం వేసింది.

# బ్రాహ్మణత్వానికి పరీక్ష!



నేపాల్ కొండల అంచుల్లో ప్రమాదకరమైన దారి

ఒక అర కిలోమీటరు దూరం నడిచిన తరువాత కొండ మలుపులో గదిలాగ కనిపించే ఒక విశాలమయిన గొయ్యి అది. పైన రేకు వుంది. హఠయోగి గోనె పట్టాల వంటి వాటిమీద పడుకుని కాలుమీద కాలు వేసుకుని శూన్యంలోకి చూస్తూవున్నాడు. ఆయన ఒంటి మీద ఉన్న గోచీ శరీరాన్ని దాచలేక పోతోంది. అలా ఆయనను చూడగానే హైద్రాబాద్‌లో కొన్ని సంవత్సరాలుగా దర్శించుకుంటున్న నాంపల్లి బాబా గుర్తుకు వచ్చారు. ఇద్దరకు ఏవో పోలికలు కనిపించాయి.

నేను మోకాళ్ళమీద కూర్చుని 'నమస్తే బాబాజీ' అని అన్నాను. కానీ ఆయన నా మాటలు పట్టించుకోలేదు. కొన్ని నిముషాల తరువాత లేచి కూర్చున్నారు. నన్ను తీసుకు వచ్చిన టీబంకు వ్యక్తి నది నీళ్ళలో స్నానం చేసి వచ్చాడు. నన్ను, ప్రక్కనే వున్న ప్లాస్టిక్ కాగితం మీద కూర్చోమని సైగ చేసారు హఠయోగి. అక్కడ సామానులు ఏమీ లేవు. మూడు రాళ్ళను పొయ్యిలాగ చేసి దాని మీద కుండ పెట్టబడివుంది. ఆయన కూర్చున్న గోను పట్టాకు ఎడమవైపున కొన్ని పుస్తకాలు ఒక గుడ్డలో కప్పబడి వున్నాయి. టీ బంకు వ్యక్తి హఠయోగికి సాష్టాంగా నమస్కారం చేసి సంస్కృతంలో కొన్ని మంత్రాలు చదివి నమస్కరించాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. నాతో, హిందీలో, ఆ ప్రక్కనే కాగితంలో చుట్ట బడిన ఒక పొట్లం చూపించి దానిని తీసుకుని విప్పమన్నారు. నేను మామూలుగా ఆ పొట్లాన్ని విప్పాను. షాక్ తగిలినట్లు అయ్యింది. అందులో చచ్చి పడివున్న చేపలు వున్నాయి. ఒళ్ళు జలదరించింది. ఎప్పుడూ వాటిని అలా ముట్టుకోవడమే కాదు, దగ్గరగా చూడలేదు. నా తత్తరపాటు హఠయోగి గమనించి నట్లున్నారు. అయినా సుటిగా, ఒక ఆదేశంలా "వెళ్ళి నీళ్ళలో కడుగుకొని తీసుకురా" అని అన్నారు. నా ప్రాణాలు విలవిల్లాడాయి! నా వల్ల కాని పని అది. ఏమి చెయ్యాలి? నా మెదడు మొద్దు బారిపోయినట్లు అయ్యింది. కదలకుండా అలాగే చూస్తూ వున్నాను. పది నిముషాలు పైగా గడచిపోయాయి. నా పరిస్థితిని అర్థం చేసుకున్నాడో ఏమో, టీ బంకు ఆయన ఆ పొట్లంలోని చేపలను ఒక గుడ్డలో వేసుకుని నదివైపు తీసుకువెళ్ళాడు. ఆ పని నేను చెయ్యనందుకు హఠయోగికి కోపం వచ్చిందా? వస్తే ఆయన ఏంచెయ్యబోతున్నాడు? ప్రశ్నల వలయంలాగ వుంది నా పరిస్థితి, "వెళ్ళి వాటిని తీసుకురా" అని నన్ను ఆదేశించాడు. నేను నది దగ్గరకు వెళ్ళాను. అతను వాటిని శుభ్రం చేసి గుడ్డలో మూటగా చుట్టి నాకు ఇచ్చి" త్వరగా తీసుకువెళ్ళు" అన్నాడు. నేను వాటిని తెచ్చి ఆయన ముందు నిలబడ్డాను. వాటిని కుండలో వెయ్యమన్నాడు. నేను వేస్తుండగా ఒకటి జారి క్రింద

పడింది. దానిని ఎలా తియ్యాలి? అని చూస్తుంటే హఠయోగి తీసి కుండలో వేశాడు. నీళ్ళు పొయ్యమన్నాడు. పోశాను. మూత పెట్టమన్నాడు. అక్కడ మూత కనిపించలేదు. టీ బంకు అతను ఒక వెడల్పయిన రాయిని మూతగా పెట్టి కింద రెండు కర్రలు వుంచి కాగితం వెలిగించి మంట చేశాడు. హఠయోగి ఇందాకటిలాగ పడుకున్నాడు. టీ బంకు అతనితో "పాఠ్ పఢో" అన్నాడు. అతను చక్కగా పద్మాసనం లాగ కూర్చుని హిందీ, సంస్కృతం కలిసినట్లుగా ఉన్న శ్లోకాలు, వాక్యాలను అనర్గళంగా పల్లిస్తున్నాడు. అంత ప్రావీణ్యత, స్పష్టత అతనిలో ఉండటం అద్భుతంగా తోచింది. పైకి ఏమీ తెలియని బికారిలాగ వున్నాడు. కొంత సేపు తరువాత భజన చెప్పమన్నారు. కొన్ని కీర్తనలు లాంటివి పాడాడు.

హఠయోగి లేచికూర్చుని "ప్రార్థన చెయ్యి" అని కళ్ళు మూసుకున్నారు. అతను కూడా కళ్ళు మునుకుని సంస్కృతంలో ఏదో ప్రార్థన చెప్పాడు. ఈశ్వరుడు, గంగా మాత, హిమ శిఖరము, స్వర్గము, నరకము, పాపము, దుఃఖము వంటి పదాలు ఆ ప్రార్థనలో ఉన్నాయి.

ఆ తరువాత మూడు వెడల్పయిన ఆకులు తీసుకుని వరుసగా పెట్టి కుండలో వున్న చేపలను వాటిలో వడ్డించమన్నారు. నాతో భగవంతుడు ఈ పూట ఈ ఆహారం ఇచ్చారు. కాదనకుండా తినాలి. ఏదేశంలో వుంటే ఆవేషం వెయ్యాలి. అలాగే ఎక్కడ ఏమిదొరికితే, దానినే ప్రసాదంగా తినాలి". అని చెబుతూ టీ బంకు అతనితో "వడ్డించు" అని గట్టిగా కసురుకుంటున్నట్లుగా అన్నారు.

నాకు లోలోపలినుంచి వణుకులాంటిది మొదలైంది. ఉడికిన చేపలను నేను తినాలి. బ్రాహ్మణుడిగా నాకు పరిచయములేని సంఘటన అది. అలవాటు లేని చర్య అది. కాని తప్పదు. సాయిబాబా గుర్తుకువచ్చారు. "ఈ పరీక్ష నాకు ఎందుకు పెట్టావయ్యా. వీళ్ళు మనుషుల మాంసం తింటారని విన్నాను. నన్ను ఇలా చేపలను తినమనటం, అంత కంటే ఘోరంగా అనిపిస్తోంది. కాదంటే ఒకటీ, అవునంటే ఒకటీ! ఇక దారి లేదు. బీ రడీ ! తప్పదు. అన్ని ఇంద్రియాలను నొక్కి పెట్టి, కళ్ళు మూసుకుని తినడమే. అంతా బాబా ఇష్టం. కైలాస మానస సరోవర యాత్రలో ఇలాంటి పరిస్థితి ఎదురవుతుందని అనుకోలేదు. జై సాయిరాం" అని అనుకుని నన్ను నేను సిద్ధ పరచుకున్నాను.

టీ బంకు అతను రెండు పుల్లలను తీసుకొని, వాటితో కుండలోని చేపను తీసేందుకు పూనుకున్నాడు. "ముందు అతిథికి వడ్డించు" అని హఠయోగి నా ముందున్న ఆకును చూపించాడు. అతను రెండు పుల్లలతో ఒక ముక్కను కుండలోనుంచి తీసి నా ఆకులో వేశాడు. నాకు సూటిగా దానిని చూసేందుకు ధైర్యం చాలకా నదివైపు, చుట్టు ప్రక్కల చూశాను. మెల్లగా నా ముందున్న ఆకువైపు చూశాను. రెండు కర్ర పెండ్లం దుంపల ముక్కలు లాంటివి వున్నాయి. అవి కచ్చితంగా చేపలు కాదు! ఆశ్చర్యంగా నన్ను నేను మరిచిపోయి వాళ్ళ ఆకులవైపు చూశాను. వరుసగా కుండలోంచి ఆ దుంపలను ఆకులలో వడ్డిస్తున్నాడు టీ బంకు అతను. హఠయోగి పెదాలమీద నవ్వు. టీ బంకు అతను నవ్వుతూ నాతో" "భయపడ్డావా? ఇవి కొండ దుంపలు. చేపలు కాదు. తిను" అని

అన్నాడు. వేడిగా వున్న ఆ దుంపలు నొక్కి రెండుగా చేసాను. దుంప చక్కగా ఉడికింది. చిన్న ముక్కను నోట్లో పెట్టుకున్నాను. చప్పగా వుంది కానీ కమ్మగా వుంది. నాకు ఆ అద్భుతానికి కన్నీళ్ళు వచ్చాయి. ఇది సాయి లీల. ఆ రోజులలో సాయి అలా కొన్ని లీలలు చేసారు. నా కోసం ఆ బాబా ఈ హఠయోగి రూపంలో ఈ లీల జరిపించారన్న ఉద్వేగం కలిగింది నాకు. ఇంచుమించు కన్నీళ్ళతో ఆ మూడు ముక్కలు తిన్నాను. ఎవ్వరూ మాట్లాడటం లేదు. ఆకులు మడిచి, వాటితో చేతులు తుడుచుకొని వాటిని దూరంగా విసిరేశాము.

నన్ను చూపించి "వీడిని తీసుకొని మందిరం దగ్గర వదిలిపెట్టు" అని వెనకకు తిరిగి పడుకున్నారు హఠయోగి. ఒకరకమైన ఉద్వేగం నుంచి నేను తేరుకోలేదు. వారి పాదాలకి నమస్కరించాలని అనిపించి నా తలను వారి పాదాలకు తగిలించాను. ఆయన ఉలిక్కిపడిలేచి "అలా చెయ్యకు. నీవు గొప్ప సాధకుడివి. నీకు భగవంతుని ఆశీర్వాదం వుంది, పో" అన్నాడు.

'కైలాస యాత్ర చెయ్యగలనా? నన్ను మీరు ఆశీర్వదించండి. నాకు దారి తెలియదు. ఒంటరిగా బయలుదేరాను" అని రెండు చేతులు జోడించి చెప్పాను. నాకు తెలియకుండానే నా కళ్ళనుంచి రెండు చుక్కలు జారాయి. ఆయన కన్నీళ్ళు తుడిచి, నా తలమీద చెయ్యివుంచి కొన్ని క్షణాలు కళ్ళమూసుకుని తెరచి "ఏం పర్వాలేదు. మంచి సమయంలో బయలుదేరావు. నీకు తోడుగా క్రియా యోగులు సూక్ష్మరూపంలో వున్నున్నారు. మాబోటివారు నీకు సహకరిస్తారు వెళ్ళు. నీ తలమీద భాగాన్ని ఇలా వుంచకు ఏదైనా గుడ్డ కట్టుకో... లేదా జుట్టు పెంచి శిగ చుట్టు. నీకు జటావాలా సహాయపడతారు నీ సాయిబాబా కూడా తలకి గుడ్డ కట్టాడు కదా! వెళ్ళు" అని పడుకున్నారు.

నేను టీ బంకు అతను తిరుగుప్రయాణం మొదలుపెట్టాము. అతని పేరు అడిగాను "బాబాజీ నాకు పెట్టిన పేరు వివేకానంద. నీ పేరు వేదానంద. మనిద్దరం అన్నదమ్ములం నీకు చనిపోవాలని వుందా? బ్రతకాలని వుందా?" అని అడిగాడు. అతని మాటలు ఒక పద్ధతిలో లేవు. ఆ ప్రశ్నలు ఎందుకు వేశాడో అర్థం కాలేదు.

"ఎందుకలాగ అడుగుతున్నారు?" అడిగాను. నడుస్తున్న అతను ఆగిపోయి,

'ఈ యాత్రలో నీవు చనిపోతే నీకు ముక్తి దొరుకుతుంది. లేకపోతే ఇంకా చాలా సంవత్సరాలు లోకంలో జీవిస్తూ, కార్యాలు చెయ్యాలి. అవి చేసినా అదే ఫలితం నీ ఇష్టం నువ్వు ఎలా అనుకుంటే అలాగ. సంకల్పం నీ చేతిలో వుంది. బాబాజీ చెప్పమన్నారు అని అన్నాడు.

"నాకు బ్రతకాలని వుంది" అని అన్నాను. అతను నవ్వుతూ కదిలాడు. అతని వెంట నడిచాను. ఇద్దరం మందిరం దగ్గరకు వచ్చే సరికి మధ్యాహ్నం మూడు గంటలు అయ్యింది. నన్ను బయటనే విడిచి అతను వెళ్ళిపోయాడు. మందిరంలోకి వెళ్ళే సరికి అందరూ వున్నారు. జోషిగారు నవ్వుతూ, "ఎక్కడికి వెళ్ళారు?" అని అడిగారు. జరిగినది క్లుప్తంగా చెప్పాను.

"వాళ్ళు మనుషుల మాంసం తింటారట... అందుకనీ నీవు రాకపోతే నాకు భయంవేసింది" అని ముసలాయన అన్నాడు.

జోషిగారు కల్పించుకుంటూ... "వాళ్ళు మానవ శవాల మాంసం తింటారేమో కానీ, బ్రతికున్న వాళ్ళను చంపితినరు. మీరు చెబుతున్నది తప్పు" అని అన్నారు.

"మన కైలాస యాత్ర ఏమిచేద్దాం. మాకు పర్మిషన్ వచ్చింది" అని అన్నాడు గోవింద దాస్ నాతో.

నేను, ముసలాయన మిగిలాము.

"ఏమో! ఇప్పటి వరకు అయితే ఆశలేదు. ఆ ఆఫీసర్ పర్మిషన్ కాగితం ఇవ్వటం లేదు. ఏదీకాక పోతే రేపు ఉదయం నేపాల్ ధార్చులా వైపునుండి నడక ప్రారంభించటమే. ఇంకా ఆలశ్యం అయితే వర్షాలు పెరుగుతాయి" అని అన్నాను.

భగవంతుడి కృపతో ఏదో తెలియని ధైర్యంతో బయలుదేరిపోయాను. ఇలా ఈ హిమలయాలలో, కొన్ని రోజులు గడుపుతానని ఎప్పుడూ ఊహించలేదు. క్రొత్త ప్రాంతంలాగ అనిపించటం లేదు.

సాయంత్రం ఇండియా ధార్చులా లోంచి వేదప్రియకు ఫోన్ చేసి నా పరిస్థితి చెప్పాను. **ఇక్కడి నుంచి కదిలితే ఇక ఫోన్ అవకాశం లేదు. కొంత మందికి పోస్ట్ కార్డుల మీద ఉత్తరాలు రాశాను. విధి ఎలా వుందో తెలియదు. ఇక్కడి నుంచి కదిలాకా జీవితం ఏమలుపుతిరుగుతుందో! బ్రతికి రాకపోతే ఇదే చివరి పలకరింపు ఈ జన్మ ముగింపుకు సిద్ధపడి పోయాను.** ఆ ఉత్తరాలు పోస్ట్ చేసి, టిఫిన్ తిని వచ్చాను.

కైలాస యాత్ర ముగించుకుని ఇద్దరు వ్యక్తులు వచ్చారు. ఒకతను మౌనంలో ఉన్నాడు. రెండవ అతను పొడవాటి జుట్టుతో, పొట్టిగా, ఎర్రగా వున్నాడు. అప్పుడే స్నానం చేసి పూజ చేసుకుంటున్నాడు. నేను వారికి నమస్కరించాను. వారు యాత్ర చేసి వచ్చారు కనుక, వారినుంచి జాగ్రత్తలు తెలుసుకోవాలని మేము నలుగురం వారి చుట్టూ చేరి ప్రశ్నలు కురిపించాము. అన్నింటికీ సమాధానాలు చెప్పి ధైర్యాన్ని ఇచ్చారు. వారు ఋషీ కేశ్ నుంచి వచ్చారని తెలిసి శ్రీ మేధానంద పురి స్వామీజీ గురించి చెప్పాను. "అయన మా గురువుగారు. మీకు కూడా గురువుగారు అవ్వటం వలన మనం గురుభాయిలము" అని నాతో ఆప్యాయతగా మాట్లాడారు.

మర్నాడు ఉదయం వారు పూజ ముగించుకున్నాకా ఋషి కేశ్ స్వామి దగ్గర నా పరిస్థితి చెప్పాను. "పరవాల్లేదు నేను వచ్చి మాట్లాడతాను". అని 10 గంటల తరువాత మేము ఇద్దరం కలిసి S.D.O కార్యాలయానికి వెళ్ళాము. ఆయన లేరు. అక్కడున్న మరొక అధికారితో సీతారాందాస్ స్వామి (ఋషీకేశ్ స్వామి) మాట్లాడితే ఒప్పుకోలేదు.

మధ్యాహ్నం దాకా మూడు సార్లు తిరిగాము. ఆ అధికారి ఇంటికి కూడా వెళ్ళాము. చివరికి రెండు గంటల తర్వాత S.D.O ఆఫీసుకు వచ్చారు. సీతారాందాస్ ఎంతో తెలివిగా మాట్లాడి తన దగ్గరున్న పాస్‌పోర్ట్ జిరాక్స్ కాపీని ఇచ్చి తాను హామీగా సంతకం పెట్టి నాకు ఇండియా రూట్‌లో చోటా కైలాస యాత్ర నిమిత్తం వెళ్ళేలాగ, 20 రోజులలో తిరిగి

వచ్చేలాగ రాయించి అనుమతి పత్రాన్ని మాకు ఇప్పించాడు. అప్పుడు గుర్తుకు వచ్చింది, ముందురోజు మధ్యాహ్నం హఠయోగి "నీకు జటావాలా సహాయ పడతాడు" అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. ఆయన చెప్పినట్లే జరిగింది. మా ఆనందానికి హద్దులు లేవు, బాబా ఇక్కడ కూడా మరో మలుపు తిప్పి ముందుకు పంపుతున్నాడు.

మా దగ్గరున్న భారతీయ కరెన్సీకి నేపాల్ కరెన్సీ మార్చుకున్నాము. సీతారాందాస్ తన దగ్గరున్న కమండలం, చిన్న స్టీలుగిన్నె ఇచ్చాడు. డబ్బులు కావాలా అని అడిగాడు. అతను కలవకపోతే నేను నేపాల్ రూట్‌లో నానా కష్టాలు పడవలసి వచ్చేది.

## ధార్చులా నుండి కైలాసానికి ప్రయాణం

మర్నాడు ఉదయం జీపు ఎక్కి 'తవాఘాట్'కు బయలు దేరాను. ఇది చివరి వాహన ప్రయాణం ఇక అంతా నడకతో వెళ్ళటమే! ఎంత దూరమో తెలియదు! ఎన్ని రోజులు పడుతుందో తెలియదు! ఆ కొండల మధ్య ఒంటరిగా నేపాల్, టిబెట్, చైనా బోర్డరు దాక వెళ్ళి తిరిగి రాగలనా?! జీపు వెళ్తోంది.....

జీపులో నాతో పాటు మరో  ముగ్గురు, వస్తున్నా, వాళ్ళను నమ్ముకోవడానికి లేదు. వాళ్ళు ముందే చెప్పారు. ఎవరి నడక వారిది. వీలైతే మధ్యలో కలుసుకుందాము అని.

జీపు వెళ్తున్న రోడ్డు చాలా ఇరుకుగా ఉంది. ఎదురుగా మరొక వాహనం వస్తే సమస్య. మలుపుల్లో 'కొండ అంచుకు తగులుతుందా' అని అనిపిస్తుంది. లోయలాగా క్రింద నుంచి పారుతున్న కాళీ నది. నదికి అవతలవైపు సుందరమైన నేపాల్ కొండలు అద్భుతమైన దృశ్యాలు. మధ్యలో 'తపోవన్' వచ్చింది. ఆగితే బాగుండని అనిపించింది కాని మేము సరాసరి తవాఘాట్‌కు వెళ్తున్నాము. 'తంతా' నది వచ్చింది. సుమారు 200 వేల మీటర్ల ఎత్తు నుండి పాయలుగా ఉరుకుతున్న నీటి ధారలు ఒక పాయగా కలిసి కాళీనదిలో కలుస్తున్న దృశ్యం అత్యద్భుతం. అక్కడ తరచు వానలు పడుతుంటాయి ముఖ్యంగా రాత్రిళ్ళు ఎక్కువ. వాటి కారణంగా కూలి పడిన  కొండచరియలు భయాన్ని పుట్టిస్తున్నాయి. బోర్డర్ పోలీసు వాళ్ళు వెంట వెంటనే వాటిని ప్రక్కకు తొలగిస్తున్నారు. ఈ ప్రాంతంలో ప్రయాణం బయలు దేరటం వరకే! చేరుకునే సమయం ఎవ్వరూ చెప్పలేరట! కొన్ని సందర్భాల్లో గంటల ప్రయాణం రోజులు పట్టవచ్చునట! 'ఖేలా' అనే గ్రామం దాటి తవాఘాట్‌కు చేరుకున్నాము. 6 గంటలు పైగా పట్టింది.

ఇక ఇక్కడ నుంచి నడక. ఎవరు అడిగినా చోటా కైలాస్ అని చెప్పాలట. కైలాస మానస సరోవరం యాత్రకు అని చెప్పవద్దని అన్నారు. భారతీయ బోర్డర్ పోలీసులు వెళ్ళనీయరట.

అప్పటికే ఒక బస్సులో ఇండియా టీమ్ వాళ్ళు అక్కడకు వచ్చి ఉన్నారు. వారంతా నారాయణ ఆశ్రమం, తపోవన్ అన్నీ చూసుకుంటూ వస్తున్నారు. వారిలో ముసలివాళ్ళు కూడా ఉన్నారు. నడవలేని వారి కోసం గుర్రాలను తీసుకువస్తున్నారు.

నా బ్యాగ్ వీపుకు తగిలించుకొని, స్లీపింగ్ బ్యాగ్‌ను ఒక చేత్తో, కర్రను మరొక చేత్తో కెమేరా వంటి ముఖ్యమైనవి మరొక చిన్న బ్యాగ్‌లో వేసుకొని  దానిని భుజానికి



భీమ్‌తాల్ వనఖండీ ఆశ్రమములోని హిమాలయ అవధూత

శ్రీ వనఖండీ మహరాజ్



హిమాలయాలలో ఖైర్నా ప్రాంతంలోని శ్రీ సోమవారీ మహరాజ్ గుఫా దగ్గర
నివశిస్తున్న స్వామి శ్రీ చేతనానందగిరి మహరాజ్‌తో...



హిమాలయ యోగి అఘోరీబాబా



ద్వారాహాట్‌లోని హిమాలయ యోగదా సత్సంగ్ సెంటర్ నిర్వాహకులు
స్వామి శ్రీ నిర్వాణానందగిరి, శ్రీ అచ్యుతానందగిరి స్వామీజీలతో...



ప్రథమ కైలాస్ పర్వతముమీద హిమాలయ యోగి
శ్రీ జమునాగిరి నాగాబాబాతో...



హిమాలయాలలో ఖైర్నా ప్రాంతంలోని శ్రీ సోమవారీ మహరాజ్ గుఫా దగ్గర
నివసిస్తున్న స్వామి శ్రీ చేతనానందగిరి మహరాజ్‌తో...



హిమాలయ యోగి అఘోరీబాబా



ద్వారాహాట్‌లోని హిమాలయ యోగదా సత్సంగ్ సెంటర్ నిర్వాహకులు
స్వామి శ్రీ నిర్వాణానందగిరి, శ్రీ అచ్యుతానందగిరి స్వామీజీలతో...



ప్రథమ కైలాస్ పర్వతముమీద హిమాలయ యోగి
శ్రీ జమునాగిరి నాగాబాబాతో...



హిమాలయ నీలకంఠ పర్వత ప్రాంతంలోని అమృత కుటీర్‌లో
శ్రీ చమత్కార్ బాబాతో...



భాగేశ్వర్ మందిర ప్రాంగణంలోని మహంత్ శ్రీ దీనదయాళగిరి స్వామిజీ,
శ్రీ త్రిలింగ తీర్థ శంకరాచార్య స్వామీజీలతో...



నేపాల్-టిబెట్ మధ్య ప్రాంతంలోని అతి క్లిష్టమైన పర్వతారోహణ



నేపాల్ పర్వత ప్రాంతంలోని సుందర జలపాతం



హైదాఖాన్ బాబా ఆశ్రమంలో ధునివద్ద ధ్యానముద్రలో...



చైనా సరిహద్దులోని హిమాలయాల దృశ్యం



పవిత్ర కైలాస పర్వత ఒడిలో...



హిమాలయ ఔషధవనాల మధ్యనుండి ప్రయాణం



పవిత్ర కైలాసపర్వత పరిక్రమ మంచుకొండలలో...



దేవతా లోయలోని పర్వత మూర్తులు



కొండలపైకి ప్రయాణం కష్టతరమే !

తగిలించుకొని నడక ప్రారంభించాను. ఏదో తెలియని ఆనందం - 'ఇదీ' అని చెప్పుకోలేని భయం! మధ్యస్తంగా ఉంది మానసిక పరిస్థితి. జై సాయిరామ్! జై దత్తాత్రేయ స్వామి! భంభం భోలేనాథ్ ! అని స్మరించుకొని బయలుదేరాను. ఆ ప్రక్కనే ఉన్న గ్రామస్తులు కొందరు కూడా నడుస్తున్నారు. మేము నలుగురము మెల్లమెల్లగా కొండను ఎక్కడం ప్రారంభించాము.

నాకు నడక అస్సలు అలవాటు లేదు. కనీసం రోజు మార్నింగ్ వాక్ కూడా చెయ్యలేదు. కానీ ఏదో శక్తి నన్ను ప్రయాణానికి లాక్కొని వచ్చింది. ఎలా వెళ్తానో? దారి ఎలా వుంటుందో? ఎవరితో చెప్పుకోవాలి? ఇలా ఏమి ఆలోచించకుండా ఇంతవరకూ వచ్చాను. ఇప్పుడు నడుస్తున్న ప్రాంతం 1012 మీ ఎత్తు ఉన్నదట. 'దేశీ గంగా' అనే నదిపై వున్న 30 మీ. చెక్కవంతెన దాటుకొని నడక ప్రారంభించాను కొన్ని ఫోటోలు తీశాను. ఒకటే నడక. మొదట్లోనే రెండు కొండలు ఎదురయ్యాయి. దగ్గర దగ్గర 12 కిలోల బరువుతో కొండలు ఎక్కుతుంటే నా ప్రాణం విలవిల్లాడింది. ఎంత సంభాళించుకుందామన్నా వీలు కావడం లేదు. అప్పటికీ కూర్చుని, విశ్రాంతి తీసుకుంటూ నడుస్తున్నాను. మూడు గంటల ప్రయాణం తరువాత చూసుకొంటే కేవలం ఒకటిన్నర కిలోమీటర్లు వచ్చాను.నా ముందున్న వాళ్ళు ఎక్కడా కనిపించడం లేదు. పిక్కలు పట్టేశాయి. ఎండ ఎక్కువగా ఉండటం వలన చెమటలతో బట్టలు తడిసిపోయాయి.

అంతా లోలోపల సంభాషణలే! నోటితో బయటకు మాట్లాడేందుకు కూడా శక్తి రావడం లేదు. నిల్చొన్నచోటునే కూలబడిపోయి తలక్రింద స్లీపింగ్ బ్యాగ్ పెట్టుకొని నడుము వాల్చాను. వీపుకు తగిలించుకున్న బ్యాగ్ బరువు చాలా కష్టంగా ఉంది. అంత బరువుతో చివరిదాకా ప్రయాణం అసాధ్యం అనిపించింది. ఏం చెయ్యాలి? అందులో ఉన్నవన్నీ తినుబండారాలే! ఏది వదులుకున్నా తీరా చైనా దగ్గర ఆకలికి మాడాల్సి వస్తుందేమో! అక్కడ ఏమీ దొరకవని అన్నారు.

కొంచెం అటుకులు తిన్నాను. కమండలంలోని నీరు కొంచెం త్రాగి లేచాను. కొండ అంచులో నడవటానికి వీలుగా 'జెడ్' ఆకారంలో మెట్ల లాంటివి చెక్కించారు. కాలు పెట్టి అడుగులు వేయటం నరకంగా అనిపించింది. అలాగే అడుగులో అడుగు వేసుకొంటూ పైకి చేరుకుని మళ్ళీ క్రిందికి దిగటం....!

మధ్య మధ్యలో కొండల సౌందర్యాన్ని చూస్తూ అరచేయి వెడల్పులో కనిపిస్తున్న లోయలో ప్రవహిస్తున్న కాళీనదిని చూస్తే భయం వేసింది. ఎంత ఎత్తులో ఉన్నాను. క్రిందికి జారితే ఏముంది? తలచుకొంటేనే భయం!

నాకే ఇంత కష్టంగా ఉంటే కొంత మంది మధ్య వయస్సు వాళ్ళు, వృద్ధులు వస్తున్నారు వారి పరిస్థితి ఏమిటి?

సాయంత్రానికి 'ధానేదార్' అనే ప్రదేశానికి చేరుకున్నాను. నాకంటే ముందు వెళ్ళిన వాళ్ళు అక్కడ ఉన్నారు. రాత్రి ఇక్కడ వుంటే మంచిదన్నారు. ఆ ప్రదేశం 1920 మీ. ఎత్తులో ఉన్నదట. 911 మీటర్లు ఎత్తుఎక్కివచ్చాను. 6 కి.మీ. దూరం వచ్చాను. అక్కడ ఒక హోటల్ లాంటిది వుంది. ప్రక్కనే ప్రభుత్వం వారు గొడుగులాగా సిమ్మెంటుతో గుండ్రంగా ఒకటి కట్టి వుంచారు. కొంత సేపు విశ్రాంతి తీసుకొని లేచి పది అడుగులు వేద్దామన్నా వీలుకాలేదు. కడుపులో ఏమీ లేదు. కాళ్ళలో శక్తి తరిగిపోయింది. తాగుబోతులాగా అడుగులు వంకర వంకరగా పడుతున్నాయి. శరీరం అంతా పచ్చి పుండులాగా వుంది. నిద్రపోతే బాగుండునని ప్రాణం కోరుతోంది. కానీ నా కోసం రొట్టెలు, కూర ఆర్డరు ఇచ్చారు. ఆ ముగ్గురు. కడుపునిండా తినేసి ఎవరి డబ్బులు వారిచ్చి, వచ్చి స్లీపింగ్ బ్యాగ్ పరుచుకొని అందులో దూరాను. బయట వానపడుతోంది. ప్రక్కనే పారుతున్న నీటి ప్రవాహం శబ్దం పాము బుసలాగా వినిపిస్తోంది. అంతా కారు చీకటి. ఒకవేళ రాత్రివేళ అవసరం అవుతుందని బ్యాటరీ లైటు ప్రక్కనే పెట్టుకుని పడుకున్నాను. క్షణాల్లో నిద్ర ఆవరించింది.

ఉదయాన్నే లేచి ముఖం కడుగుకొని టీ, టిఫినులు పూర్తి చేసుకొని నడక ప్రారంభించాము.

ఈ హిమాలయ యాత్రలో, నడక విషయంలో కొన్ని జాగ్రత్తలు చెప్పారు. వీటిని తప్పక అనుసరించాలి.

జాగ్రత్తలు :

1. ఈ కొండలలో నడుస్తున్నప్పుడు ఎప్పుడూ కొండ ప్రక్కకు నడుస్తూ, వెనుకనుండి గుర్రాలు వంటివి ఏమి వచ్చినా మనం కొండవైపే ఉండి వాటికి నది వైపు దారి ఇవ్వాలి.
2. ఈ ప్రయాణంలో ఖాళీ కడుపుతో నడవకూడదు. దాని వలన ఆకలి పెరిగి నీరసంతో కళ్ళు తిరిగి పడిపోయే ప్రమాదం వుంది.
3. తినే పదార్థాలు, రెయిన్ కోట్, మందులు, కెమేరా, మంచినీళ్ళు అందుబాటులో ఉండే బ్యాగు భుజాన ఉంచుకోవాలి.
4. ఒంటరిగా వెళ్ళ కూడదు. జట్లుగా ఏర్పడి నడుస్తుండాలి. అలసట తెలియకుండా ఉండేందుకు, భక్తి భావన స్థిరపడేందుకు రకరకాల దేవతా నినాదాలు చేస్తుండాలి.
5. పర్వతాలు ఎక్కుతుంటే ఆయాసము, అలసట కలుగు తాయి. బాగా ఎత్తైన ప్రదేశాలలో ఆమ్లజని తగ్గటం వలన కళ్ళు తిరుగుట, ఓర్పు, సహనము తగ్గుట సహజము. జాగ్రత్త పడాలి. ముందు దారిని, ఎత్తైన కొండలను చూసి 'అమ్మో అంత దూరం వెళ్ళాలా?' అన్న భావన వస్తే పిరికితనం ఏర్పడి అడుగులు పడవు. అందువలన ఎక్కువ ఊహించ కూడదు.



వానల కారణంగా పర్వతాలపైనుండి జాలువారే నీటి ప్రవాహం

6. ఎక్కడైనా దారి తెలియకపోతే మనుష్యులు ఉండరు కనుక గుర్రపు లద్దెలు చూసుకొంటూ వెళ్ళాలి. కైలాస యాత్రకు ఈ దారిలో యాత్రికుల కంటే గుర్రాలను తీసుకుని వెళ్ళే వ్యాపారస్తులు ఎక్కువ. ఆ జాడలలో వెళ్తే చైనా బోర్డరు వరకు వెళ్ళిపోవచ్చు.
7. వీలైనంత వరకు తక్కువ తినాలి. రెండూ మూడు గంటలు వ్యవధికి ఒకసారి తినవచ్చు. నీళ్ళు ఎక్కువ తాగడం మంచిది. కనీసం రోజూ 5 లీటర్లు పైన త్రాగాలి.

ఇలా జాగ్రత్తలు తీసుకొంటూ ముందుకు పోవాలి.

వాతావరణం త్వరత్వరగా మారిపోతుంది. అప్పుడే ఎండవస్తుంది, అప్పుడే వాన వస్తుంది. ఈ ప్రకృతిని చూస్తుంటే ఒక శ్లోకం గుర్తుకు వస్తోంది.

శ్లో॥ అశ్వప్లుతం వాసవగర్జితం చ।
స్త్రీణాంచ చిత్తం పురీషస్య భాగ్యమ్
అవర్షణం చాప్యతి వర్షణం చ।
దేవోన జానాతి కుతో మనుష్యః (కాళిదాస రచన)

భావము : గుర్రము యొక్క ఎగురుడు, మేఘము యొక్క గర్జనము, స్త్రీల యొక్క చిత్తము, పురుషుల యొక్క భాగ్యము, వర్షములు కురియుట, కురవకపోవుట... దేవతలు కూడా తెలుసుకొనలేరు. ఇక మనుష్యునికి ఏమి సాధ్యం?



## ఘోర ప్రమాదానికి గుర్తు 'మాల్పా' !



ప్రమాదానికి కారణమైన కొండ చెరియ

హిమాలయాల్లో నడుస్తుంటే ఎంత ఆనందమో అంతప్రమాదం. అందులో నేను ప్రస్తుతం వెళ్తున్న దారి వెడల్పు చాలా తక్కువవ్వటం వలన మరీప్రమాదం. ఏ మాత్రం అన్యమనస్కంగావున్నా ప్రక్కనే వున్న లోయద్వారా కాళీ నదిలోకి పడిపోతాము.

కాళ్లు నడుస్తూ వుంటే, కళ్ళు నాలుగు వైపులా కనిపిస్తున్న సుందర దృశ్యాల నుంచి తప్పుకోలేక ఉక్కిరిబిక్కిరి అవుతుంటాయి. ఎవరు సృష్టించారు ఈ అందాలను? నగరాలలో జీవిస్తూ విర్ర వీగుతున్న మనిషికి అసలు ఆనందం ఇక్కడ దాగి వుందన్న విషయం ఎప్పుడు తెలియాలి? అందుకే ప్రతి మనిషి ఒక్కసారైనా ఈ హిమాలయాలకు రావాలి. ఈ కొండల మధ్య గురు ఆదేశంతో, కొంచెం సాధన చేసినా, ఆత్మ పరిశీలన - ఆత్మ దర్శనం లభిస్తాయని అనిపిస్తోంది.

**ఏ వ్యక్తికైనా తానేమిటో అర్థం అయితే, బయటి ప్రపంచం అర్థం కావడం కష్టం కాదు.**

ఊరు పేర్లు, కొండల పేర్లు తెలియకపోయినా నా గమ్యం కైలాస మానససరోవరం కనుక నడుస్తూ పోతున్నాను. నాతోపాటే బయలుదేరిన వాళ్ళు ముందుకు వేగంగా వెళ్ళిపోయారు. దారి ఒక్కటే అయినా ఎవరి వేగం వారిది. నేను మాత్రం ఆందోళన లేకుండా శక్తి మేరకు నడుస్తూ చుట్టూ వున్న రమణీయతను ఆస్వాదిస్తూ ఉన్నాను. జీవితంలో ఊహించని ప్రయాణం.

వర్షం పడటం వలన మెట్లుగా వున్న Z ఆకారపు రాళ్లు జారుతున్నాయి. కర్ర సహాయంతో నిలదొక్కుకుంటూ నడుస్తున్నాను. ఎండ పెరిగే కొలదీ అలసట పెరుగుతోంది. 3050 మీటర్ల ఎత్తున గల 'రుగ్లింగ్ టాప్' అనే పర్వతం దగ్గరకు చేరాను. నా కంటా ముందు వెళ్ళిన వారిద్దరూ అక్కడ నా కోసం ఎదురుచూస్తూ విశ్రాంతిగా నేలమీద వాలి వున్నారు. నేను కూడా కూర్చున్నాను. చుట్టూ దట్టమైన అడవి ప్రాంతం. రకరకాల పక్షుల అరుపులు వినిపిస్తున్నాయి. చిన్న గుడి కనిపించింది. నేను దగ్గరకు వెళ్ళి చూశాను. దేవతామూర్తి ఏమీ లేదు. కొన్ని రాళ్ళు కుప్పలుగా వేసి వున్నాయి. వాటి ప్రక్కన స్థంబమునకు గుడ్డపేలికలు రంగురంగులవి కట్టి వున్నాయి. కారణం తెలియదు. వాటికి నమస్కరించుకోవాలని అనిపించి నమస్కరించాను. నన్ను చూసి "ప్రతి దానికి నమస్కరిస్తున్నాడు ఈ మహరాజ్" అంటూ నవ్వుకున్నారు. నేను పట్టించుకోలేదు. క్రిందకు దిగుతుంటే చాలా భయంగా అనిపించింది. 'సెంబోలా' అనే నది దగ్గరకు వచ్చాము. కడుపు నిండా నీళ్ళు తాగి చెక్కవంతెన మీద నుంచి దాటి

ముందుకు వెళ్ళాము. చిన్న గ్రామము వచ్చింది. అక్కడ రొట్టెలు తిన్నాము.

'నిజంగ్ జలపాతము' దాటి సాయంత్రానికి మాల్పా చేరాము. అక్కడ హోటలు లాంటిది వుంది. దానికి ఎదురుగా నది ఒడ్డున గుండ్రంగా సిమ్మెంట్‌తో చేసిన గొడుగు లాంటి ప్రదేశంవుంది. అక్కడ పడుకునేందుకు నిశ్చయించుకున్నాము. మా కోసం ఆ హోటలులో వారు రొట్టెలు, చక్కని కూర చేశారు. కడుపు నిండా తిన్నాము. వారు చక్కగా హిందీలో మాట్లాడుతున్నారు. ముందు ప్రయాణం గురించి ఎన్నో విషయాలు చెప్పారు. కొన్ని గుర్తులను నేను రాసుకున్నాను.

రాత్రి అక్కడ పడుకున్నాము. ఉదయం లేచి టిఫిన్ చేసి బయలుదేరాము. ఆ 'మాల్పా' కు ఒక ప్రత్యేకత వుంది. 1998 లో భారత ప్రభుత్వం తరపున బయలుదేరిన బృందం అక్కడ రాత్రివేళ ఆగారు. ఆ రాత్రి విపరీతంగా వర్షం కురవటం వలన పైనున్న కొండ కూలి పడిపోయింది. ఆ కొండ మీద ఉన్న ఇండ్లలోని వాళ్ళు మొత్తం చనిపోయారు. ఆ కొండ దిగువ భాగాన భారతీయ బృందం వారు గుడారాలు వేసుకుని వున్నారు. అర్ధరాత్రి జరిగిన ఆ సంఘటన వలన ఒక్కరు కూడా మిగలకుండా మొత్తం నేలలోకి కూరుకుపోయారు. ఆనాడు పడిన కొండరాళ్ళ ఇప్పటికీ అలాగే వున్నాయి. కనీసం శవాల ఆచూకీ తెలియలేదట. చనిపోయిన వారిలో గుర్రాలు, రెండు కుక్కలు కూడా వున్నాయట. కేవలం, కొండమీద నివసిస్తున్న కుటుంబం తాలూకు 8 సంవత్సరాల పిల్లాడు బ్రతికి బట్టకట్టాడు. ఆ ఘోరప్రమాదంలో మరణించిన వారిలో ప్రతిమాబేడి వంటి ధనవంతులు, గొప్ప పీఠాధిపతులు ఉన్నారట. స్వయాన మా చిన్నాన్నగారు శ్రీ జె.ఆర్.జి. సుబ్రహ్మణ్యం (బ్యాంక్ ఆఫ్ బరోడా ఆఫీసరు) కూడా ఆ చనిపోయిన వారిలో ఉండటం జరిగింది. అందుకనే వారిని స్మరించుకుని ఆ ప్రక్కనే ఉన్న కాళీ నదిలోని నీరు వారి పేరు మీద వదిలి వారి ఆత్మశాంతికై ప్రార్థించాను.

కాళీ గంగానదిని అనుకుని నడక ప్రారంభించాను. మళ్ళీ ఒంటరిగా మిగిలాను. అలా నడుస్తుంటే నా గత జీవితం కొంత గుర్తుకు వచ్చి నవ్వుకున్నాను. ఎక్కడో ఆంధ్రాలోని రాజమహేంద్రిలో పుట్టి ఇక్కడ దాకా రావటం విచిత్రమే!

ఎందుకో తెలియదు, హఠాత్తుగా వాతావరణం చల్లగా మారింది. గాలి చాలా హాయిగా వీస్తోంది. దూరంగా ఒక తెల్లని బంగళా కనిపించింది. రాత్రికి అక్కడ వుండాలని చెప్పారు. ఇంకా మూడు-నాలుగు కిలోమీటర్లు నడిస్తేనే కానీ అక్కడకు చేరలేము.

సుందర దృశ్యానికి ఫోటోలు తీశాను. నా దగ్గరున్న రీళ్ళు అయిపోతాయన్న భయంతో జాగ్రత్తగా ఫోటోలు తీస్తున్నాను. మధ్యాహ్నం మూడుగంటలు దాటింది. చెట్ల మధ్యగా వున్న దారి గుబురులతో నిండి ఒక సొరంగంలా వుంది. ఒంటరిగా నడుస్తూ వెళ్తుంటే కొంచెం భయంగా అనిపించింది. ఆగి వెనకకు చూశాను. ఆకుపచ్చని గుహలాగ వుంది దారి. నాతోపాటు ఎవరో నడుస్తున్న అలికిడి! ఆగాను. వీపున వున్న బ్యాగ్ దింపుకుని విశ్రాంతిగా క్రింద పడుకున్నాను. అలసట మీద నిద్ర వచ్చినట్లయింది.

కొంతసేపు తర్వాత ముఖం కడుగుకుని వెళ్ళేందుకు సిద్ధం అవుతూ "టీ త్రాగితే బాగుండును. టీతో పాటు వేడి వేడి పకోడీలు కూడా తింటే ఇంకా బాగుంటుంది" అని

అనుకుంటూ నవ్వుకున్నాను. నాలోని జిహ్వ వాంఛలు అలా బయటకు వస్తున్నాయి. నిజంగా చూస్తే ఆకలన్నదేమీ లేదు. బ్యాగు వీపును తగిలించుకుని, ఒక చేతిలో కర్ర, మరొక చేతిలో స్లీపింగ్ బ్యాగ్‌తో బయలుదేరాను.

కొన్ని అడుగులు వేసిన తరువాత ఎవరో వెనుకగా వస్తున్న అలికిడి. ఆగి విన్నాను. శబ్దం లేదు. మళ్ళీ నడవటం మొదలు పెట్టాను. మళ్ళీ ఎవరో వస్తున్న శబ్దం. నేను వేగంగా నడవడం మొదలుపెట్టాను. 'సంత్ మహరాజ్' అని పిలిచినట్లయింది. వెనకకు తిరిగి చూశాను. ఎవరూ లేరు. ప్రక్కన చెట్లగుబురులలో చూశాను. ఆకాశం కనిపించనంతగా పైన చెట్ల కొమ్మలు పెనవేసుకుని వున్నాయి. ఆ పిలుపు ఎవరిదై వుంటుంది. నా భ్రమ అయి వుంటుందని అనుకుని నడక వేగం పెంచాను. మళ్ళీ అలాగే నాతో సమానంగా ఎవరివో అడుగుల చప్పుడు. ఎదురుగా దూరంగా ఒక వ్యక్తి వస్తూ కనిపించాడు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో అతని అడుగుల సవ్వడి లయగా వినిపిస్తోంది.

అతను దగ్గర అవుతున్న కొలదీ బాగా కనిపిస్తున్నాడు. మొలకు పల్చటి గుడ్డ చుట్టుకున్నాడు. భుజం మీద ఒక గుడ్డ మూట వుంది. చంకలో బొంతలాంటిది చుట్టి వుంది. చేతిలో చిన్న స్టీలు క్యారేజి. జుట్టు చింపిరి చింపిరిగా వుంది.

'ఎక్కడ కెళ్తున్నావు' అని అడిగాడు. చెప్పాను. అతని పేరు అడిగాను. 'సిద్ధేశ్వరానంద' అని చెప్పాడు. నన్ను కూర్చోమని, తనుకూడా అక్కడే నేలమీద కూర్చున్నాడు. తన దగ్గరున్న గుడ్డమూటను విప్పి నాకు పెట్టాడు. ఆశ్చర్యం. అవి పకోడీలు కావు కానీ, అలాంటివే పెసరపిండితో చేసినవి. నా చేతిలో మూడు వేసాడు. మరీ ఆశ్చర్యం అవి వేడిగా వుండటం. ఆ దగ్గరలో ఇల్లు అనేదే లేదు. మరి ఎక్కడ వండాడు? అంత వేడిగా ఎలా వున్నాయి. అడిగితే చెప్పలేదు మాట దాటవేశాడు. తన దగ్గరున్న వాటిని మళ్ళీ గుడ్డలో మూటలాగ కట్టాడు. 'నీ దగ్గర గ్లాసు వుందా?' అని అడిగాడు. నా దగ్గరున్న స్టీలు కప్పును తీశాను. తన దగ్గరున్న స్టీలు క్యారేజి మూత తీశాడు. ఆశ్చర్యం - అద్భుతం! అందులో వేడి వేడి టీ వుంది. నాకు నమ్మబుద్ధికాలేదు. కొంతసేపు క్రితం నేను కోరుకున్నవి వెంటనే ఇలా నిజమవ్వటం! ఏమిటీ అద్భుతం. నా గురువే ఇలా నా కోసం ఏర్పాటు చేస్తున్నాడా?!

నా కప్పులో కొంచెం పోసి క్యారేజి మూత పెట్టాడు. 'ఎవరి కోసం అది?' అని అడిగాను. తన గురువు కోసం తీసుకు వెళ్తున్నానని, అతను 'దిగంబర స్వామి' అని, పేరు 'విష్ణు మహరాజ్' అంటారని చెప్పాడు. తాను ఆయన దగ్గర పది సంవత్సరాలకు పైగా సేవ చేస్తున్నానని అన్నాడు. నాకు చూపించమని అడిగాను. అది వీలు కాదని, ఎవరినీ రానీయడని చెప్పాడు. "నాకు స్ఫురణ నిచ్చి, నీకు వీటిని పెట్టమని చెప్పాడు. అందుకే నీ కోసం ఇటు వచ్చా"నని చెప్పి తిన్నగా వెనకకు స్పీడుగా నడుస్తూ వెళ్ళిపోయాడు. నేను కూడా అటువైపే కదా! కానీ అతను వాయువేగంతో వెళ్ళిపోవటం ఆశ్చర్యం. ఈ వింత నన్ను ఎంతగానో ఆనంద పరిచింది.

నడిచి నడిచి చివరకు సాయంత్రం వేళకు ఒక వంతెన వద్దకు చేరాను. కాళీ నదిమీద కట్టిన వంతెన అది. వంతెన దాటి అవతలికి వెళ్ళాను. మెట్లులాగ రాళ్ళు కనిపించాయి.

వాటిని ఎక్కుతూ వెళ్ళాను. అక్కడ నిగమ్ వారి గెస్ట్‌హౌస్ వుందట. విచారించగా చెప్పారు. అక్కడికి వెళ్ళేసరికి నా కంటే ముందు వచ్చిన వాళ్ళు వున్నారు. ఊరంతా కరెంటు లేకపోవడం వలన మా దగ్గరున్న టార్చ్‌లైట్లు తీశాము.

మధ్యాహ్న పార్సిలు చేయించుకున్న రొట్టెలు తిని, క్రింద తడిగా వున్నా ఆలోచించక బయట వున్న చలికి తట్టుకోలేక స్లీపింగ్ బ్యాగ్‌లో దూరి పడుకున్నాను. అలసిన శరీరం నిద్రలోకి జారిపోయింది.

## 'ఛయలెక్‌టాప్' పర్వతారోహణం !



అతికష్టమైన 'ఛయలెక్ టాప్' మార్గము

ఆ గ్రామం పేరు 'బుధి'. అది సముద్ర మట్టానికి 2,710 మీటర్ల ఎత్తులో వుందట. భారత దేశ ప్రభుత్వము ద్వారా వచ్చిన వారికి అక్కడ ప్రత్యేక సదుపాయములు, ఆహారము, మంచి గదులు ఇస్తారు. అక్కడ వారు ఒకరోజు విశ్రాంతి తీసుకుని కదలుతారు. ఎందుకంటే అక్కడ నుంచి ప్రయాణం చాలా కష్టంగా వుంటుందట. ఎక్కాల్సిన కొండలు నిటారుగా వుండటం వలన ఆయాసం రావటం జరుగుతుంది. కాళ్ళు సహకరించడం మానేస్తాయట.

ఉదయాన్నే లేచి ముఖం కడుగుకుని వెలుతురు రాకుండా ప్రయాణం మొదలు పెట్టాము. అందరూ అలాగే చేస్తారట. ఎండ పెరిగితే ఆ కొండలు ఎక్కటం చాలా కష్టం. చీకట్లో టార్చిలైట్ సహాయంతో నడక ప్రారంభించాను. మంచు ఆవరించి వుండటం వలన తలకు టోపీ, చేతులకు గ్లౌజెస్ ధరించాను. కొంతదూరం వెళ్ళాక 'బుధిగడ్' అనే చిన్న గ్రామం వచ్చింది. అక్కడ దారి తప్పి, మళ్ళీ వెనకకు వచ్చి సరైన దారిలో పడ్డాను.

అక్కడ తరచూ కొండలు కూలిపోతూ వుంటాయట. దాని కారణంగా జననష్టం, పశునష్టము జరిగి గ్రామం మొత్తం (కొండ చరియలు కూలిపోవటం వలన) నేలమట్టం అయిపోయింది ఒకప్పుడు. ఆ తర్వాత అక్కడి నుంచి కొంత దూరంలో, ప్రస్తుతము, కొత్తగా గ్రామ నిర్మాణం జరుగుతోంది. ఈ 'బుధి గడ్' నుంచి కనిపించే పర్వతాలను 'చౌదాస్‌ఘాట్'అని పిలుస్తారు. ఆ తర్వాత పైకెళ్ళిన తరువాత కనిపించేది 'వ్యాసఘాట్'.

'బుధిగడ్' కొండలు ఎక్కటం చాలా కష్టం. నిటారుగా వుంటాయి. కొండను మెట్లులాగ చెక్కి వుంచటం వలన కొంత అనుకూలంగా వుంది. అయినా శారీరక అలసట బాగా ఎక్కువగా వుంది. కొంతమంది భారతీయ బృందం వారు గుర్రముల

మీద వెళ్తున్నారు. పైకి వెళ్తున్నంత సేపు ఎటు చూసినా సుందరమైన దృశ్యాలు, వర్ణించ లేనంత సౌందర్యం అది. అందులో ఉదయం సమయమేమో, సూర్యుని కిరణాల రంగులతోపాటే, ప్రకృతి తన చీరలను మార్చుకుంటున్నట్లుగా నిముష నిముషానికీ సరికొత్త సౌరభం, వినూత్న సౌందర్యం. ఎంతసేపు చూసినా తనివి తీరని హిమ వీక్షణం.

అలా నడిచి నడిచి 3,300 అడుగులు ఎత్తుకు చేరాను. ఆ శిఖరాన్ని 'ఛయలెక్‌టాప్' అంటారు. అక్కడ నుంచి రెండు చిన్న మలుపులు తిరిగిన తరువాత ఒక హోటలు, మిలటరీ వాళ్ల క్యాంపులు కనిపించాయి. వేడివేడి రొట్టెలు చేసి పెట్టారు. ధరకూడా పెద్దగా తీసుకోలేదు. ఒక్కొక్క రొట్టె మూడు రూపాయలు. టీ తాగి బయలుదేరాము. మిలటరీ క్యాంపుల చివర చెక్‌పోస్ట్ లాంటిది వుంది. ఒకతను మాదగ్గరున్న కాగితాలు చెక్ చేసి వివరాలు రాసుకున్నాడు. నేను హైదరాబాద్ నుంచి అని చెప్పగానే స్థానిక ఎ.ఓ.సి. గేట్ దగ్గర వున్న మిలటరీ వాళ్ళ గురించి మాట్లాడాడు. ముందుకు కదిలాము.

అక్కడ నుంచి అంతా పూలమయం. వేల రకాల పూలు కనిపించాయి. లావైన మానులతో ఎత్తైన చెట్లు. అంతా పచ్చదనం. వచ్చిన దారి మొత్తంలో ఇంతటి పచ్చిక, పూల వనాలు ఎక్కడా కనిపించలేదు.

రెండు మూడు కిలోమీటర్లు నడిచాకా ఒక చెక్క వంతెన వచ్చింది. దానికి దగ్గరలో మంచు గడ్డ క్రింద నుంచి నీరు పారుతోంది. ఉన్నట్లుండి వాన చినుకులు మొదలయ్యాయి. సుందరమైన వన ప్రాంతంలో వాన చినుకులు మరింత ఆహ్లాదకరంగా కనిపించాయి. ఆకాశంలో ఇంద్ర ధనుస్సు తొంగి చూసింది. మూవీ కెమేరా ఉంటే ఎంతో బాగుండేది.

ఒక శివాలయం కనిపించింది. ఎత్తైన ప్రదేశం మీద వుంది. వెయ్యి సంవత్సరాల పురాతన మందిరమట. నమస్కరించుకుని, కొంతసేపు అక్కడ గడిపాము. దూరంగా ఒక గ్రామం కనిపించింది. దానిపేరు "గార్బ్యాంగ్". లోయలాంటి ప్రదేశంలోకి దిగి ఆ గ్రామానికి చేరుకున్నాము. కడుపునిండా టిఫిన్ తిని కదిలాము. ఆ గ్రామంలోని ఇళ్ళు అన్నీ పై కప్పులు కర్రలతో చెయ్యబడినవి. భారతదేశములోని చివరి సరిహద్దుగా ఆ గ్రామాన్ని చెబుతారు. అక్కడ నుంచి టిబెట్టు ప్రాంతం మొదలు అవుతుందట. అనుమతి లేనిదే ఆ హద్దు దాటి అవతలకు వెళ్ళనీయరు, మన దేశములోకి రానివ్వరట. ఆ గ్రామం చివరిలో ఒక చిన్న రేకుతో చెయ్యబడిన బూతు వుంది. అందులో తలకు గుడ్డ కట్టుకుని ఇద్దరు సిపాయిలు రైఫిల్‌తో ఉన్నారు. వారి దగ్గరకు వెళ్ళి మా దగ్గరున్న కాగితాలు చూపించాము. వారు మా పేర్లు రాసుకున్నారు. ఎక్కడికని అడిగారు. 'చోటా కైలాస్' అని చెప్పాము.

అక్కడి నుంచి కదిలి ఒక కిలోమీటరు వచ్చాకా రెండు నదుల సంగమము కనిపించినది. దానిపై వున్న చెక్క వంతెన పేరు సీతాపూల్. దానిని దాటి నేపాల్ ప్రాంతంలోకి ప్రవేశించాము. అక్కడ ఒక పురాతన మందిరం వున్నది. దానిని దర్శించుకున్నాకా ప్రక్కనే దగ్గరలో వున్న ఒక చిన్న పెంకుటింట్లో నేపాల్ అధికారి వున్నాడు. అతను మా కాగితాలు చూసి రాసుకుని అక్కడి నుంచి ఎలా వెళ్ళాలో



కైలాస యాత్రలో మరణించిన యాత్రీకుల స్మారక చిహ్నం

వివరంగా చెప్పాడు. కొంతదూరం వెళ్ళాక 'గాగా హొటలు' అనే చోటుకు చేరాము. 'హొటల్ కైలాస్' అని పేరు పెట్టారు. ఆ ప్రాంతాన్ని 'గాగా' అంటారట. చాలా చిన్న గ్రామం అది. ఆ హొటలు యజమాని ఆ ఊరికి పెద్ద. వాళ్ళు చిన్న కిరణా కొట్టు కూడా నడుపుతున్నారు. ఆ హొటలు అంతా చెక్కలతో చేసి వుంది. మొదటి అంతస్తు అంతా చిన్న చిన్న గదులుగా చేసి వాటిలో మంచాలు ఏర్పాటు చేశారు. రోజుకు నేపాలు రూపాయలు 25 ఇవ్వాలట. వారి దగ్గర పిండి కొనుక్కొని రాత్రికి రొట్టెలు చేసుకున్నాము. వారి దుకాణంలోను, బయట మాంసపు అకారాలను వేళ్ళాడదీసి వుంచారు. జంతువులను చంపి అలా వుంచుకుంటారట. మంచు ప్రాంతం కనుక ఎన్ని రోజులైనా అవి పాడవ్వవట. నాకు వాటిని చూస్తుంటే వెగటుగా అనిపించింది. ఆ రాత్రి అక్కడ గడిపాము.

నేపాలు నుంచి చైనాకు వెళ్తున్న గుర్రాల వారు అక్కడకు వచ్చారు. వారు కూడా రాత్రి అక్కడ విశ్రాంతి తీసుకున్నారు. ఉదయం ఆ గ్రామాధికారి ద్వారా మా సామానులను ఆ గుర్రాల వారికి ఇచ్చాము. అందరివీ కలిపి అయిదువేలకు బేరమాడాము. విచిత్రం ఏమిటంటే నేపాల్, టిబెట్టులలో మోసం, దొంగతనం అనేవి వుండవట! ఎక్కడైనా ఒక వస్తువు పడి వుంటే దానిని ఎవరు తీసుకోరట!

అవసరమైన వస్తువులను వుంచుకుని, మిగతా సామానులను వారితో పంపాము. మేము కూడా బయలు దేరాము.



## నడకలో నిరాశ -భయం-దుఃఖం!



కొండల మధ్య ఒంటరి నడక బాధాకరమే !

ఉదయం తొమ్మిది గంటలకు మా ప్రయాణం ప్రారంభమైంది. అక్కడంతా చాలా సుందరమైన దృశ్యాలు కనిపిస్తున్నాయి. కొండలు గాలికి రాలిపోయి, సగం సగంగా కనిపిస్తూ, కోట గోడల్లా కనిపిస్తాయి. ఒక పెద్ద నది పారుతూ కనిపించింది. ఆ నదికి కుడివైపు మాత్రమే వెళ్ళమని చెప్పారు. ఒక చోట కొండలు కూలిపోయి పెద్దపెద్ద రాళ్ళు అడ్డంగా పడివున్నాయి. ఆ దృశ్యం చాలా అందంగా కనిపించి ఆ రాళ్ళపైకి ఎక్కి ఫొటోలు తీయించుకున్నాను.

గుర్రాలవాళ్ళు మాకంటే చాలా ముందుకి వెళ్ళిపోయారు. దారి పూర్తిగా నదిలో కలిసిపోయింది. కొండలు కూలిపోవడం వలన అతి కష్టం మీద పైకి ఎక్కి దారిలో పడ్డాం. అడుగు అడుగునా ప్రమాదమే! ఒక రోజున ఉన్నట్లుగా, మరొక రోజు దారి ఉండదు. మరి గుర్రాల వాళ్ళు ఎటునుంచి వెళ్ళారో? అదృష్టవశాత్తూ ఒక చిన్న హోటలు లాంటిది కనిపించింది. టీ మాత్రమే ఉంది. మాంసం ముద్దలు వేలాడగట్టి వున్నాయి. అందువలన లోపలికి వెళ్ళకుండా బయటనే కూర్చుని టీ తెప్పించుకొని తాగాము. మా దగ్గరున్న తినుబండారాలు కొన్ని తిని బయలుదేరాము.

ఒకతను కైలాస యాత్ర పూర్తి చేసుకొని వస్తూ కనిపించాడు. అతని కాళ్ళు, చేతులు ముఖం మీద రక్తం వస్తూ కనిపించింది. ఒంటరిగా, మెల్లగా, నీరసంగా నడుచుకుంటూ వస్తున్నాడు. విచిత్రమేమంటే అతని ముఖంలో చిరునవ్వు ఆకర్షణగా కనిపించింది. నడుస్తూ నడుస్తూ కూర్చోకూడదట ఆ యాత్రలో అది ముఖ్యమైన అంశం. అందుకే నిలబడి పది నిమిషాలు మాట్లాడాడు. ఆ గాయాలు ఎలా అయ్యాయో చెప్పలేదు. [illegible] దగ్గరున్న జీడిపప్పు పాకెట్ ఇచ్చాను. కొంచెం తీసుకున్నాడు. యాత్ర బాగా జరిగిందని తాను తిరుగుప్రయాణం బయలుదేరి వారం రోజులు అయ్యిందని చెప్పాడు. అలా కుంటుకుంటూ ముందుకు సాగిపోయాడు.

ఒక గంటసేపు నడక తరువాత చిన్న చెక్కవంతెన దాటి ఒక కొండ ఎక్కడం మొదలు పెట్టాము. మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. ఎండ తీవ్రత ఎక్కువగా ఉంది. కూర్చుందామంటే నీడలేదు. తలమీద గుడ్డ వేసుకొని ఎక్కడున్న వాళ్ళం అక్కడే కూర్చోవాల్సిందే. కాలు ఎత్తి కాలు వేయలేని పరిస్థితి. కాళ్ళు ఈడుస్తూ, కర్ర సాయంతో ముందుకు జరగడం మాత్రమే. ఇంకా కొంత దూరం నడిస్తే 'తింకర్' అనే ప్రాంతం వస్తుందని చెప్పారు. నాకు కాళ్లలో శక్తి తరిగిపోయింది. ఒక కొండపైకి ఎక్కుతున్నాను. ఆ కొండ ఎక్కి, దిగగానే తింకర్ అనే గ్రామం ఉందట.

కొండ సగం దాకా ఎక్కాను. నాలో ఏదో తెలియని బలహీనత చోటుచేసుకుంది. కాళ్ళలో, చేతులలోను వణుకు లాంటిది మొదలైంది. ఎక్కడ ఉన్నానో అక్కడే కూలబడి కూర్చున్నాను. కన్నీళ్ల రావటం మొదలుపెట్టాయి. ఎవరితోనైనా చెప్పుకోవాలని వుంది. ఎవ్వరూ దగ్గరలో లేరు.

హఠాత్తుగా మనసు చైతన్యవంతమై ప్రశ్నల వర్షం కురిపించింది.

"ఇదేంటి ఈ కొండల మధ్యకు ఒంటరిగా వచ్చానా? ఎప్పటికి చేరుకుంటాను? అసలు కైలాసం' అనేది ఉందా? అది కనిపిస్తుందా? ఈ దారి అక్కడికి వెళ్తుందా? అసలు ఒంటరిగా ఎందుకు బయలు దేరాను? నాకు ఇక్కడ ఏమైనా అయితే ఎవరు ఆదుకుంటారు? నా గురించి హైదరాబాదులో తెలిసేది ఎవరు? తొందరపడి వచ్చాను. శ్రీ మేథానందపురి స్వామీ చెప్పినట్లు ఎవరినైనా తోడుతీసుకుని మళ్లీ సంవత్సరం రావల్సింది. బుద్ధి తక్కువ పని చేశాను. ఇప్పుడు నా గతి ఏమిటి? ...ఈ ప్రశ్నలతో మనసు, శరీరం బలహీనమై పోయాయి. కన్నీళ్ళు ఆగటం లేదు.

నా మెళ్ళో ఉన్న సాయిబాబా లాకెట్‌ను తీసుకుని చేతిలో పట్టుకొని "బాబా నేను తొందర పడ్డాను. ఒంటరిగా వచ్చాను. ఏమి చెయ్యాలో తెలియడం లేదు. నీవే కాపాడాలి. నా కన్నీళ్ళతో నీకు అభిషేకం చేస్తున్నాను. (కన్నీళ్ళు ఆ లాకెట్‌కు రాశాను) చూస్తున్నావు కదూ, వింటున్నావు కదూ! ఏమిటిలా అయిపోయింది నా జీవితం? వెనకకు వెళ్ళాలన్నా చాలా దూరం వచ్చేశాను. ముందుకు వెళ్ళాలన్నా ఎంతదూరమో, అక్కడ ఏముందో తెలియదు. అసలు కైలాసమనే చోటుకు చేరుకుంటానో లేదో తెలియటం లేదు. నువ్వైనా నన్ను ఆపవచ్చునుకదా? ఏమిటి ఇలా జరిగింది?" ఎక్కిళ్ళు వస్తున్నాయి. కన్నీళ్ళు ధారగా వస్తున్నాయి. చుట్టూ వున్న ప్రకృతిని చూడాలంటే భయంగా అనిపిస్తోంది. అంతులేని విశాలమైన లోయలు, కొండలు, వాటి మధ్య ఒంటరి పక్షిలాగ నేను. చిన్నప్పుడు మా స్కూలు, పిల్లల్ని అందరినీ, తీసుకుని వెళ్ళి చూపించిన 'పాపం పసివాడు' సినిమా గుర్తుకు వచ్చింది.

సుమారు 50నిమిషాల పాటు అలా దీనాతిదీనంగా ఉండిపోయాను. అంతా నిరాశగా, నిస్పృహగా కనిపించింది. నన్ను నేను ఓదార్చుకోలేని అసహాయత. మధ్యాహ్నం మూడు గంటలు అవుతోంది. కూర్చున్న చోట క్రింద రాళ్లు కాలుతున్నాయి.

చేతిలో వున్న సాయిబాబాను చూస్తుండగానే హఠాత్తుగా నాలో ఏదో శక్తి చోటుచేసుకుంది. నాలోని పిరికితనానికి, బేలతనానికి సిగ్గువేసింది. అంతవరకూ భయపెట్టిన నా మనసు ఎక్కడికి పోయిందో, అనూహ్యంగా నాలో ధైర్యం చోటుచేసుకుంది. "మరణానికి సిద్ధపడే కదా నేను బయలు దేరాను. అన్ని అప్పగింతలు చేసి, చివరికి ఖాళీ లెటర్ హెడ్‌లమీద సంతకాలు చేసి వచ్చాను. రెండు నెలలలో తిరిగిరాకపోతే, పత్రిక విషయంలో లీగల్‌గా ఏర్పాటు చేసుకోమని చెప్పాను.

సత్సంగాల్లో సకల దేవతాస్వరూపుడైన శ్రీ సాయిబాబా మన కూడా ఉంటాడని, ఆయన సర్వజ్ఞుడని, సర్వాంతర్యామి అనీ చెప్పిన వాక్యాలు, నమ్మకం, విశ్వాసం ఎటుపోరి పోయాయో! ఇదంతా నేనే చేసినట్లు ఆలోచించాను. దుఃఖించాను. అసలు ఈ మార్గం కానీ ఈ కొండలు కానీ, ఈ యాత్రకు ఇలా వెళ్ళ వచ్చని కానీ నాకు తెలియదుగా! ఏదో శక్తి నాకు

అనుకూలించబట్టే వచ్చాను. ఇక, నేను తప్పు చేశాను, అనవసరంగా వచ్చాను...అంటూ నిందించుకుంటూ దుఃఖించటంలో అర్థం ఏముంది? కేవలం సద్గురువును ఆశ్రయించి సాగుతున్న జీవితం నాది. మంచయినా, చెడయినా అంతా ఆయనదే భారం.

నాలో ఎక్కడో, లోలోపల పిరికితనం, అవిశ్వాసం, అపనమ్మకం వంటివి వుండి వుంటాయి. అవన్నీ బయటకు వచ్చాయి. లేదా మనసు ఆధిపత్యం ఎక్కువై నాలో, వివేకం నశించి, ఇంద్రియాల వలలో చిక్కి, దుఃఖంలో, ఆందోళనలో, అశాంతిలో కూరుకుపోవడం జరుగుతుంది. అలాంటిదే ఏదో జరిగింది. నేను మరణిస్తే ఏమవుతుంది? ఏమీ కాదు. బాధ పడేవాళ్ళు నా గురించి ఆలోచించేవాళ్ళు ఎవరున్నారు? ఉన్నా ఎన్ని రోజులు ఆలోచిస్తారు? ఒకవేళ చనిపోయినా ఇంతటి దేవభూమిలో చనిపోవడం వరమే కదా! ఇక్కడైనా, హైదరాబాదులో అయినా మరణించే ఘడియ వస్తే ఎవరు ఆపగలరు? ఒకవేళ మరణించినా నాకోసం, మరొక గర్భం, శరీరాన్ని ఇచ్చేందుకు ఏర్పాటు చేయబడే ఉంటుంది. చక్కగా నూతనంగా జన్మ మొదలుపెట్టవచ్చు. అలా కాకుండా ఉండటానికి నాదేమి ముక్త స్థితి కాదు. ఎన్నో కర్మల నుంచి, బంధనాలనుంచి బయటపడి జ్ఞానమార్గం వైపు సాధనగా సాగుతున్న జీవితం నాది. ఇంకా ఎన్నో జన్మలను అనుభవిస్తే కానీ ముక్తి లభించదు. ఈ కైలాస యాత్ర నాలో చక్కని వివేకాన్ని, వైరాగ్యాన్ని అందిస్తోంది. అనవసరంగా గంటసేపు దుఃఖంలో కూరుకుపోయాను.

ఇంతకుముందు తట్టుకోలేనంత దుఃఖం ఎలా వచ్చిందో, అలాగే ఇప్పుడు అదుపుచేసుకోలేనంత ఆనందం నాలో అణువణువులో నిండింది. బాబా లాకెట్‌ను ముద్దు పెట్టుకొని మెడలో వేసుకున్నాను. చుట్టూ ఒకసారి చూశాను. నాలుగువైపులా వున్న కొండలు నన్ను ఆశీర్వదిస్తున్నట్లుగా కనిపించాయి. నాకు ఏదో బోధిస్తున్న ఋషులులాగా గోచరిస్తున్నాయి.

ఇంకా పూర్తిగా ఆగని కన్నీళ్ళతో నాలుగు దిక్కులకు తృప్తిగా, కృతజ్ఞతగా నమస్కరించాను. నాగురించి నాకు గర్వంగా అనిపించింది. ఎంతటి అదృష్టం నాది. ఇలా ఒంటరిగా యాత్రను చేస్తూ, లోలోపలి శక్తులను అనుభవించగలుగుతున్నాను. నేనేమిటో నాకు అర్థం అవుతోంది.

నేనే సృష్టి, సృష్టే నేను అన్న ఏకత్వమేదో చూచాయగా అవగాహనకు వస్తోంది. విపరీతమైన ఆత్మస్థైర్యం నాలో చోటు చేసుకుంది. ఎన్ని రోజులైనా, ఎంత కష్టమైనా ఈ యాత్రను దిగ్విజయంగా సాగించాలి. మానస సరోవరంలో మునిగి, నేను చేసిన పాపాలను, దోషాలను కడిగి వేసుకోవాలి. దేవతా భూమి కనుక, బ్రహ్మస్వయంగా సృష్టించిన సరస్సు కనుక నేను దివ్యత్వంతో తిరిగి రావాలి! అంతే!

ఆనందంగా, బ్యాగ్‌లో వున్న అటుకులు, ఎండు ద్రాక్ష తీసి తిని మంచినీళ్ళు తాగి లేచాను. చేతిలోని కర్రను చూస్తుంటే ఎంతో ధైర్యంగా, నాకంటే ఎత్తుగా వున్న ఆ కర్ర ఒక మనిషిలా నా బరువును భరిస్తూ, కొండలు ఎక్కుతున్నప్పుడు ఒకలాగ దిగుతున్నప్పుడు ఒకలాగ సహాయపడుతోంది. శ్రీ స్వామి మేధానందపురి గారు ఎంత ముందు చూపుతో ఈ కర్రను నాకు ఇచ్చి పంపారని అర్థం అవుతోంది. నూతనోత్సాహంతో కొండను ఎక్కి దిగాను. దూరంగా తింకర గ్రామం కనిపించింది. ధైర్యం వచ్చింది.

## చిత్రకారుని విచిత్ర ప్రవర్తన !

'టింకర్' గ్రామం చాలా చిన్నది. 50 ఇళ్ళు దాకా ఉన్నాయి. ఆ గ్రామంలో నేపాల్ అధికారి ఉన్నారట. అతనికి మా దగ్గరున్న కాగితాలు చూపించి వెళ్ళాలట.



టింకర్ గ్రామం దాటిన తర్వాత కష్టమైన పర్వతారోహణ

చిన్న చిన్న సందుల్లోంచి గ్రామం చివరిలోవున్న ఆ అధికారి దగ్గరకు వెళ్ళాను. నాకంటే ముందుగా ఇద్దరు అక్కడ ఉన్నారు. మా కాగితాలు చూపించాము. అతను చిన్నగదిలో ఆఫీసు, తన నివాసం కూడా ఏర్పాటు చేసుకుని వున్నాడు. మాకు బాగా ఆకలిగా వుంది. ఆ అధికారిని అడిగితే, వెంటనే గ్రామం లోంచి ఒకరిని పిలిపించి వంట వండిచారు. ముగ్గురం కడుపునిండా తిన్నాము. ఒక్కొక్కరూ 15 రూపాయిలు చెల్లించాము.

ఒక గంట సేపు హాయిగా నిద్రపోయాము. దగ్గరలో కొండపై నుంచి జలపాతం పడుతూ ఉంది. సాయంత్రం అందరం హాయిగా, స్నానం చేసాము. రాత్రి మళ్ళీ భోజనం చేసి నిద్రపోయాము. మా స్లీపింగ్ బ్యాగ్‌లు బాగా ఉపయోగపడ్డాయి.

ఆకలిగా అనిపించి నామూటలు విప్పాను. కమండలం లోని నీరు కొంచెమే వుంది. జీడిపప్పు, ద్రాక్ష, బిస్కట్లు కొంచెం కొంచెం తిని నీళ్ళు త్రాగాను.

నాతో బయలు దేరిన వారిద్దరూ వేగంగా నడుస్తూ చాలా దూరం వెళ్ళిపోయారు. వాళ్ళిద్దరూ ఒకే ప్రాంతం వారు అవ్వటం వలన ఒకరినొకరు కలుపుకుంటూ వెళ్ళిపోయారు. సరే! నాకు బాబా తోడుగా వున్నాడు కనుక, నాశక్తి మేరకు నడుస్తూ పోతున్నాను.

చుట్టూ ప్రకృతిని చూస్తుంటే చాలా ఆహ్లాదకరంగా వుంది. ఇంతలో వాన చినుకులు మొదలయ్యాయి. గబగబా బ్యాగ్‌లు తీసుకుని ప్రక్కనే వున్న పాత బిల్డింగ్‌లోకి పరుగెత్తాను. ఆశ్చర్యం అక్కడ ఒకతను పడుకుని వున్నాడు. ఒక కంబళి పరచుకుని తల క్రింద మూట పెట్టుకుని, బీడీ కాలుస్తూ కాలుమీద కాలు వేసుకుని వున్నాడు.

ఒక్క క్షణం భయంటాంటిది అనిపించినా అతని ముఖంలోని తేజస్సు, నిర్మలత్వం ఆకర్షణీయంగా కనిపించాయి. దూరంగా నా బ్యాగ్‌లు పెట్టుకున్నాను.

సమయం సుమారు నాలుగయ్యింది. అతనిని కైలాసం వెళ్తున్నారా?' అని అడిగాను. నవ్వుతూ లేచి కూర్చుని 'కైలాసం ఎక్కడ లేదు? ఇదే కైలాసం.... చూడు అంటూ ప్రక్కనే వున్న గోడవైపు చూపించాడు. నేను అంతా. గమనించాను. అంతకుముందు అలాంటిదేదీ లేదు. కానీ అతను చూపించాక చూస్తే గోడమీద రంగులతో మంచు పర్వతాలు, వాటి మధ్య ఈశ్వరుడు ధ్యాన ముద్రలో కూర్చుని వున్న బొమ్మ గీసి వుంది.

'ఎవరు గీశారు?' అని అడిగాను.

"ఈశ్వరుడే!" అని నవ్వుతూ సమాధానం ఇచ్చారు.

నాదగ్గరున్న అటుకులు తీసి ఆయన చేతిలో పోశాను.

"ఓ. . భడవా . . తీసుకో భోలే నాద్" అంటూ అరుస్తూ చేతినిండా వున్న అటుకులను గోడమీద వున్న ఈశ్వరుడి బొమ్మ మీదకు బలంగా విసిరాడు. ఆశ్చర్యం సగం దాకా అటుకులు అతుక్కుపోయాయి. కొన్ని మాత్రమే క్రింద పడ్డాయి. ఇంకా ఇమ్మన్నట్లుగా చేయి చాపాడు. ఆయన చేతినిండా పోశాను. వాటిని తన నోటి నిండా నిపుకొని 'పరపరా' నవ్వులుతూ తిన్నాడు.

అతని పేరు అడుగుదామని అతని ఫొటో తీసుకుందామని అనిపించినా ఎందుకో ధైర్యం చాలలేదు. "లే, వెళ్ళు వాన తగ్గింది. చాలా దూరం వెళ్ళాలిగా" అని అరిచాడు.

బయట వాన తగ్గింది. నా బ్యాగ్‌లు తగిలించుకొని కదలబోతుంటే "ఇలారా" అని పిలిచాడు దగ్గరకు వెళ్ళాను. ఎపుడు తీశాడో తెలియదు. తన బొటనవేలుతో నా నుదుటి మీద విభూతి రాశాడు. నామెళ్ళో వున్న షెల్లాను తీసి నా తలకు కట్టి "నీవు చాలా గొప్పవాడివి అవుతావు పో" అని నా తలమీద చెయ్యి వుంచాడు.

ఎడం చేతిలో స్లీపింగ్ బ్యాగ్ వుండటం వలన, కుడిచేత్తో అతని రెండు పాదాలు తాకి కళ్ళకు అద్దుకున్నాను. అతను నా చేతిని తన కళ్ళకు అద్దుకున్నాడు. ఆశ్చర్యం అనిపించింది. మల్లెపూవులాగ చక్కని చిరునవ్వు ఆయన ముఖాన్ని కప్పేసింది. ఆ దృశ్యం ఎప్పటికీ మరువలేను.

బయటకు వచ్చాను. ఆకాశం నిర్మలంగా వుంది. అద్భుతంగా ఆకాశంలో మూగే ఇంద్ర ధనుస్సులు వరుసగా ఒకదానితో మరొకటి పోటీ పడుతున్నట్లుగా కనిపించాయి.

ఎంత విచిత్రం? ప్రకృతిలో ఇంతటి సౌందర్యం ఎంతమంది చూడగలరు? వస్తుందో, రాదో ఫొటో తీశాను. నడక ప్రారంభించాను. చీకటి పడేలోపుగా, "గూగాఁవ్ హోటలు" ఒకటి ఉందట, అక్కడికి చేరుకుని రాత్రి అక్కడ వుండవచ్చుని తింకర్‌లో చెప్పారు.

వేగంగా, ఆనందంతో నడక సాగించాను. అదృష్టం ఏమిటంటే అక్కడ 7.30 దాకా చీకటి పడదు. ఒక్కొక్కసారి 8 దాటుతుందట. రెండుచోట్ల చిన్న చిన్న లోయలు దాటి ఎత్తైన ప్రదేశానికి చేరాను. ఒక టెంట్ కనిపించింది. అక్కడున్న కుక్కలు మొరగటం ప్రారంభించాయి. తిన్నగా ఆ టెంట్ లోకి వెళ్ళాను. అదే వాళ్ళు చెప్పిన హోటలు. చుట్టూ మాంసం ముద్దలు వ్రేలాడదీసి వున్నాయి. ఒకతను, నాకంటే ముందుగా వెళ్ళిన వాళ్ళకు టీ ఇచ్చాడు. నా కోసం కూడా చేసి వుంచాడు. ఆ టీ త్రాగేసరికి కాస్తంత శక్తి వచ్చింది. బీరు, బ్రాందీలు కూడా వాళ్ళ దగ్గర స్టాకు ఉంచుకుంటారట. గుర్రాల వాళ్ళు ఎక్కువగా ఇక్కడ ఆగి తాగి, తిని వెళ్తారట. కొంతమంది సాధువులు కూడా బీరును అడుగుతారని చెప్పాడు అతను. బయట బాగా చలిగా వుంది. గాలి కూడా ఎక్కువగా వుంది. సరదాగా బయటకు వెళ్ళాను. అంతా నిర్మానుష్యం! దూరంగా కొండలపైన అక్కడక్కడ చిన్న చిన్న దీపాలు, సన్నని బెడ్ బల్బ్ వెలిగించినట్లుగా మసక వెలుతురు. చీకటిలో కూడా కాంతి

వుంటుందని అక్కడ అర్థం అవుతోంది.

**నిశ్శబ్దంలో శబ్దం- చీకటిలో వెలుతురు - దుఃఖంలో ఆనందం - నిరాశలో ఆశ....... ఇవన్నీ అంతర్లీనంగా దాగి వుంటాయి. ఆస్వాదించగలిగితే అవన్నీ కూడా ఆనందాలే?**

అందరం పొయ్యి చుట్టూ చేరాము. తలకు మంకీ టోపీలు తగిల్చి కూర్చున్నాము. కొంతసేపు తర్వాత ముగ్గురుసాధువులు అక్కడికి వచ్చారు. ఒకాయన పేరు బ్రహ్మచారి గోవిందానంద, మరొకాయన పేరు స్వామి వామ తీర్థ, వారిలో గోవిందానంద కాశీ నుంచి, మరొక ఇద్దరు ఎల్లోరా దగ్గర దత్త ఆశ్రయం నుంచి వస్తున్నారట. ముగ్గురూ కలిసి బయలు దేరారట. వారు బాగా నిష్ఠ, నియమము వున్న సాధువులు! వారు అక్కడ ఏమీ తినమని కేవలం టీ మాత్రమే త్రాగారు. లోపల పడుకోవడం ఇష్టం లేక బయట ప్లాస్టిక్ కాగితాన్ని గుడారంలాగా వేసుకుని స్లీపింగ్ బ్యాగ్‌లలో దూరి పడుకున్నారు. నేను రొట్టెలు తిన్నాను. ప్రక్కనే చిన్న గదిలాగ వున్న స్థలంలో, నాలుగైదు చర్మాలను వరుసగా పేర్చుకుని ముసుగు పెట్టి నిద్రపోయాను. ఉదయాన్నే నాలుగు గంటలకు లేపారు. అక్కడికి దగ్గరగా 'ఛయలెక్ టాప్' అనే పర్వతం దాటటం చాలా కష్టం అని, వీలైకనంతవరకు ఉదయమే వెళ్ళాలని చెప్పటంతో ముఖాలు కడుగుకుని, టీ తాగి బ్యాటరీ లైట్ల కాంతిలో నడక ప్రారంభించాము. కేవలం బ్యాటరీ చూపిస్తున్న బాట తప్పితే మరేమీ కనిపించటం లేదు. మంచు బాగా ఆవరించి వుంది. ఒకరికి ఒకరు దగ్గర దగ్గరగా నడుస్తూ వెళ్తున్నాము. ఎడం వైపు అంతా పెద్ద లోయ అట. కనుక సాధ్యమైనంతవరకు కుడివైపునే నడవమని చెప్పారు. ఎదుట వున్న మనిషి మూడు అడుగుల దూరం అయితే చాలు కనిపించటం లేదు. మంచు అంతగా వ్యాపించి వుంది. కర్రల ఆధారంతో నడక సాగిస్తున్నాము. 6 గంటలకు బాగా వెలుతురు వచ్చింది. అప్పుడే 'చాయ్‌లెక్ టాప్' పర్వతం వచ్చింది. నిజంగానే అది ఎక్కడం నరకంగా అనిపించింది. ఎంత నడిచినా తరగటం లేదు. సుమారు నాలుగు గంటల పైగా నడిచి పైకి చేరుకున్నాము. అక్కడ నుంచి హిమాలయ మంచు పర్వతాలు అద్భుతంగా కనిపిస్తున్నాయి. ఫొటోలు తీశాను. కొంత దూరం నడిచాక మరొక టెంట్ హోటలు కనిపించింది. అందరం అక్కడ చేరాము. అక్కడ శెనగలు ఉడకబెట్టి ఇచ్చాడు. తిని టీ త్రాగాము.

మన దగ్గర ఇండియాకు సంబంధించిన కాగితాలు అస్సలు ఉండకూడదని చెప్పాడు. అందువలన నా బ్యాగ్ లో వున్న కాగితాలు, విజిటింగ్ కార్డులు తీసి అక్కడ పెట్టాను.

అక్కడ నుంచి మరొక గండం! **'టాటా చడాయి'** అనే పర్వతం మొదలవుతుంది. ఆ పర్వతం ఎక్కడం చాలా కష్టం. అక్కడ గాలి విపరీతంగా వీస్తుందట. రాళ్ళు కాగితాల లాగ ఎగిరి పడతాయట. మధ్యాహ్నం 2 గంటల లోపు ఆ పర్వతం దాటి పోవాలి. లేకపోతే ఆ పర్వతం మీద వీచే గాలి మనుషులను, గుర్రాలను ఎగరేసి ఎక్కడో పడేస్తుందట. ప్రాణాంతకమైన పర్వతం అది. పైకి వెళ్ళాకా, ఒక్క నిమిషం కూడా ఆలస్యం చెయ్యకుండా ఆవలి వైపుకు దిగి పోవాలట! ఎందుకంటే అక్కడ ఆక్సిజన్ అస్సలు ఉండదట. బలహీనమైన గుండె కలవారు మరణించే ప్రమాదం ఉందట. ఇవన్నీ వింటుంటే నాకు భయంగా అనిపించింది.

## అతి కష్టమైన 'టాటా ఛడాయి' పర్వతారోహణ !



లోయల మధ్యన త్యాగీ సాధువు సీతారాం దాస్‌తో...

ఉదయం 10 గంటల సమయంలో బయలుదేరాము.'టాటా ఛడాయి' పర్వతం, చూపుకు అంతు దొరకటం లేదు. అదంతా ఎప్పటికి దాటగలమో అని అనిపిస్తోంది. ఎవరి శక్తి మేరకు వారు నడుస్తున్నారు. గోవిందానంద బృందం ముగ్గురు చాలా వేగంగా నడుస్తూ అందరి కన్నా ముందు వెళ్ళిపోతున్నారు. నా పరిస్థితి అయితే క్రమేపి నిస్సత్తువు అయిపోయింది. అయినా కర్ర సాయంతో కాళ్ళను ఈడుస్తూ దూరాన్ని తగ్గించుకుంటూ వెళ్తున్నాను. సగం దాకా వెళ్ళేసరికి నా శరీరంలో నీరసం లాంటిది ప్రవేశించింది. సమయం కూడా 12 దాటింది. ఆ దారి పొడుగునా ప్రక్కన గుర్రాల కళేబరాలు పడి వున్నాయి. విసురుగాలి వీచినప్పుడు, మంచు గడ్డలుగా కురియటం వలన, గుర్రాలు చనిపోయాయట. ఆ శవాలను అక్కడే వదిలి వెళ్ళిపోతారు. వాటిని చూస్తుంటే, మానసికంగా మనకు కూడా భయం వేస్తుంది.

మరొక విచిత్రం ఏమిటంటే మేము నడుస్తున్నంత సేపు ఆకాశంలో గ్రద్దలు వంటి పెద్ద పెద్ద పక్షులు ఎగురుతూ కనిపించాయి. సుమారు 50 దాకా వుంటాయి. కొన్ని అక్కడక్కడ వాలి చూస్తున్నాయి.

అప్పుడప్పుడు వీచేగాలి తెరలకు రాళ్ళ కుప్పలు చెదిరి గాలిలో ఎగరటం ఆశ్చర్యం. ఆ రాళ్ళ శబ్దాలు, పక్షుల కూతలు తప్పిస్తే మరొక శబ్దం వినిపించటం లేదు. నా దగ్గరున్న పదార్థాలతో ఆకలి తీర్చుకుని, నీళ్ళు తాగి క్రింద నుంచి, నా వెనుకగా వస్తున్న వాళ్ళ కోసం ఎదురు చూస్తూ విశ్రాంతి తీసుకున్నాను. పాపం, ఎవరికి వారు నడవలేక నడవటమే! ఈ కైలాస యాత్ర ఎంత కష్టమో తెలుస్తోంది. ఇంకా, ముందు, ఇంకెంత గండం వుందో తెలియదు. ప్రస్తుతం మేము టిబెట్ బోర్డరులో వున్నామట.

మొత్తానికి అతికష్టం మీద ఆ పర్వతం పైకి చేరుకునే సరికి 2.30 గంటలు అయ్యింది. ఆపైన గుర్తుగా స్థూపం పెట్టబడి వుంది. నా వెనుకగా గుర్రాల వాళ్ళు నేపాల్ నుంచి చైనాకు ఏవో సామానులు తీసుకు వెళ్తూ వచ్చారు. నేను అలసటతో పైన కూర్చుంటే, వాళ్ళు హిందీలో అరుస్తూ తొందరగా క్రిందకు వెళ్ళమని లేకపోతే గుండె పట్టుకుని ప్రాణం పోయే ప్రమాదం వుందని చెప్పటంతో వెంటనే క్రిందకు దిగటం మొదలు పెట్టాను. అక్కడి కొండలు అన్నీ మట్టి కొండలు వంటివి. కేవలం గాలికి పెళ్ళలుగా రాలిపోతాయట. అందు వలన వాటికి దగ్గరగా నడవటం ప్రమాదం. కానీ కొన్ని చోట్ల నడిచే బాట వాటి అంచున వుండటం వలన భయం భయంగా నడవాల్సి వస్తుంది.

అక్కడున్న కొండలలో మంచు కొండలు కూడా వున్నాయి. పైకి కొండగా కనిపిస్తున్నా

అడుగునుంచి కరుగుతూ, నీరులాగ ప్రవహిస్తూ వుంటాయి. తెలియక వాటిపైకి వెళ్ళామా అపాయం తప్పదు. క్రమేపి అలా పారుతున్న నీళ్ళు ఒక కాలువలాగ ప్రవహిస్తున్నాయి. ఆ నీళ్ళలో దిగి దాటటం నిప్పుల మీద నడవటం లాంటిది అనిపించింది. పైగా ఆ నీటి ప్రవాహం చాలా వేగంగా వుండేమో, అడుగులో అడుగు చాలా జాగ్రత్తగా వెయ్యాలి. వీపుమీద బ్యాగ్‌తో, కర్ర సహాయంతో ఒక్కొక్కరం దాటాము. ముగ్గురం తోడుగా నడక ప్రారంభించాము.



గర్బియాంగ్ ప్రాంతంలో స్థానికులు, సాధువులతో...

సాయంకాలం ఎండ కాంతిలో చుట్టూ వున్న మంచు పర్వతాలు మెరుస్తూ కనిపించాయి. అక్కడ విచిత్రంగా రెండు రోడ్లులు లాంటివి కనిపించాయి. లారీల వంటి వాహనాలు వెళ్ళిన జాడలు కనిపించాయి. ఎటు వెళ్ళాలో తెలియలేదు. బహుశా టిబెట్ గుండా భారతీయ బృందాలు వచ్చే దారి అవ్వవచ్చు. వాళ్ళు మాత్రమే బస్సుల వంటి వాహనాలలో వస్తారు. కొంత సేపు తర్జనభర్జన తరువాత గుర్రాల లద్దెలు కనిపించిన వైపు నడవటం మొదలు పెట్టాము. కేవలం భగవంతుడి మీద భారంతో వెళ్ళటమే! విచారిద్దామంటే నరమానవుడు ఎవ్వరు కనిపించడం లేదు. మేము చైనా ప్రాంతమైన 'తక్లా కోట్'కు చేరుకోబోతున్నాము.

చీకటి పడకుండా చేరటం మంచిదని వేగంగా, ఇంచుమించు, పరుగులాంటి నడకతో వెళ్తున్నాము. రెండున్నర గంటల నడక తరువాత క్రిందగా లోయలాంటి ప్రాంతంలో, దూరంగా ఆ పట్టణం కనిపించే సరికి మాకు ధైర్యం వచ్చింది.



## చైనా ప్రాంతమైన 'తాక్లా కోట్'లో ప్రవేశం !



నేపాల్ - టిబెట్ సరిహద్దులలోని ఒక గుహ

6.30 గంటలకు ఆ పట్టణంలో ప్రవేశించాము. చీకటి పడుతూ వుంది.

ఆ దారి ఆ పట్టణానికి పూర్తిగా వెను పక్క వుంది. కొంతదూరం వెళ్ళేసరి పట్టణంలోని లైట్లన్నీ అందంగా కనిపించాయి. నాలుగైదు అంతస్థుల ఎత్తైన భవనం కనిపించింది. బయట చైనా అతను, సెక్యూరిటీ అనుకుంటా, మమ్మల్ని పిలిచాడు. లోపలికి వెళ్లమని సైగ చేసాడు. రెండు మూడు గదులు దాటాక ఒకతను యూనిఫారంలో, టోపీ పెట్టుకుని వున్నాడు. అతను తప్పించి మరొక వ్యక్తి కనిపించలేదు. బహుశా సాయంత్రం అవ్వటం వలన అందరూ వెళ్ళి పోయి వుండవచ్చు ఆ వ్యక్తి మా బ్యాగ్‌లను చెక్ చేశాడు. ఏదో చైనా భాషలో మాట్లాడాడు. మేము ఏమి చెప్పినా అతనికి అర్థం కాదు. వాళ్ళకు హిందీ, ఇంగ్లీష్, నేపాలీ భాషలు రావట! కేవలం చైనా భాష మాత్రమే మాట్లాడతారట. వారు ఏమి అడిగినా "నేపాలీ, ఖాట్మండ్, టింకర్ ' అని మాత్రమే చెప్పమని నేపాల్‌లో మాకు జాగ్రత్త చెప్పారు. పొరపాటున ఇండియా ప్రసక్తి వచ్చిందా వాడు వెనకకు పొమ్మంటాడట. అతను 'నామ్' అనే పదంతో అడిగాడు పేరు చెప్పాను 'ఏజ్' అడిగాడు. అదీ చెప్పాను. ఒక చిన్న స్లిప్ రాసి ఇచ్చాడు. అది పట్టణంలోకి 'ఎంట్రీపాస్'. దానిని ఆధారం చేసుకుని కైలాస పర్వతానికి వెళ్ళటాని మరొక చోట, మరొక పాస్ ఇస్తారట. ఆ పాస్‌లు తీసుకునే సరికి ఏడు దాటింది. మా నలుగురిలో ఒకతను కొంత ఇన్‌ఫర్మేషన్ తీసుకుని వచ్చాడు. "నాతో రండి, నేను తీసుకె వెళ్తానని" అన్నాడు. మేమందరం అతని వెనకనే నడుస్తూ వున్నాము. బ్యారేజ్ లాంటి వాటి మీద నుంచి నడిపించి, రకరకాల వీధులన్నీ తిప్పాడు. మెయిన్ బజారు దగ్గరకి వచ్చి, అలసటతో ఒకచోట కూర్చున్నాము. అతను అనుకున్న ప్రాంతం దొరకలేదు. అప్పటికే 9 గంటలు దాటింది. దాహానికి తట్టుకోలేక కూల్ డ్రింక్ తీసుకుని కొన్ని తాగాము.

ఒక హోటలు ఎదురుగా ఫుట్‌పాత్ లాంటి ప్రదేశంలో కూర్చుని వున్నాము. ఇంతలో ఒక చైనా మహిళ వచ్చి ఫ్లాస్కు తెచ్చి అందించింది. వేడివేడిగా టీ లాంటిది తెచ్చి వుంటుందని అందరం ఆనందంగా మా దగ్గరున్న కప్పులు, గ్లాసులు తీసి కొంచెం కొంచెం పోసు కున్నాము.

నోట్లో పెట్టుకుని చూస్తే వెగటుగా, వికారంగా తగిలింది. ఆమె, తన దగ్గరున్న ఫ్లాస్కులోంచి మరి కొంచెం పొయ్యటానికి సిద్ధంగా నిలుచుని వుంది. నేను 'ఇక చాలు వద్దు' అన్నట్లు సైగ చేశాను. ఆమె నవ్వుతూ వెళ్లిపోయింది. అందరం ఆ ద్రావ పారపోశాము. నోరు కడుగు కోవటానికి నీరు కావలసి వచ్చింది. అక్కడి వాళ్ళు ఇష్ట

త్రాగే పదార్థం అయి వుంటుంది. మా మీద జాలితో ఇచ్చి వుంటుంది. కానీ అది మనం తాగేది కాదు.

అక్కడ కొంత సేపు గడిపి ఎక్కడో ఒకచోట పడుకుని తెల్లవారాక వెతుకుదామని అనుకున్నాము. అలాంటి ప్రదేశం కూడా కనిపించలేదు. ఒక పెద్ద హొటలు వంటిది కనిపించింది. అక్కడికి అప్పుడే ఒక బస్సులో ఇండియన్ గ్రూప్ వచ్చారు. అక్కడ ముందు పంచలో పడుకోనిస్తారేమో నని అడిగితే ఒప్పుకోలేదు. బయటకు వచ్చి చూస్తే ఒక షాపు ముందు ఖాళీ ప్రదేశం వుంది. చలికి కూడా అడ్డుగా వుంది. అందరం అక్కడ మా దగ్గరున్న బట్ట పరచుకుని బ్యాగ్‌లు తలక్రింద పెట్టుకుని పడుకున్నాము.

అక్కడంతా త్రాగుడు ఎక్కువ. రాత్రంతా త్రాగిన వారి అరుపులు వినిపిస్తూనే వున్నాయి. మా దురదృష్టం ఒక రాత్రివేళ వానపడింది. అందరం ఒక మూలన ముడుచుకుని కూర్చున్నాము. తగ్గిన తరువాత మళ్ళీ వాలాము. మా సామానులు గాగా హొటలు వద్ద గుర్రాల వాళ్ళకు ఇచ్చి పంపాము. వాళ్ళు ఎక్కడ ఉన్నారో తెలియదు.

ఉదయం లేచి ఊరి చివరకు వచ్చి కాలకృత్యాలు తీర్చుకుని నేపాల్ బజారు గురించి అడిగి తెలుసుకుని, అక్కడ నుంచి గుర్రాల వాళ్ళు ఉండే ప్రాంతానికి వెళ్ళాము. అది ఎత్తైన కొండ మీద వెనుక వైపు వుంది. అక్కడొక చిన్న బజారులాగ ఏర్పడి వుంది. నేపాల్ నుంచి వచ్చిన గుర్రాల వాళ్ళందరు గుడారాలు వేసుకుని వుంటారట. ఆరు నెలలు వ్యాపారం చేసుకుని తిరిగి క్రిందకు వెళ్ళిపోతారట.

మేము బ్యాగ్‌లు ఇచ్చి పంపిన గుర్రాలతను ఉన్న టెంట్‌లోకి వెళ్ళాము. అతను మా బ్యాగ్‌లను జాగ్రత్తగా వుంచాడు. మా కోసం ఎదురు చూస్తున్నాడు.

అక్కడ నీళ్ళకు సమస్యగా వున్నా, స్నానం చేసామని అనిపించాము. ఆ టెంట్‌లో ముగ్గురు దాకా నేపాలీ కుర్రాళ్ళు వున్నారు. వారు మాకు అన్నం, రొట్టెలు వండి పెడతామని ఎంతో కొంత డబ్బులు ఇమ్మని అనటం ఆనందం. ఎందుకంటే ఆ సదుపాయం అక్కడ దొరకటం కష్టం.

మరొక పాసు కోసం ఎక్కడకు వెళ్ళాలో కనుక్కుని వెళ్ళాము. కానీ రెండు రోజుల సెలవుల కారణంగా ఆ కార్యాలయం తెరవరట. కనుక చచ్చినట్లు అక్కడ ఉండి తీరాల్సిందే!

ఒకరోజు అంతా ఆ పట్టణం వీధులు తిరిగాము. ఆ రోజు చీకట్లో ఎంతో తిరిగాము కానీ, ఏమీ అర్థం కాలేదు. కనుక పగటిపూట అంతా చూశాము.

శ్రీ గోవిందానంద బృందం కలిశారు. వాళ్ళు కూడా మరొక టెంట్‌లో వున్నారట. చాలా బాగా సహాయం చేస్తున్నాడట. కానీ 'సున్మతీ దీదీ' అనే ఒక నేపాలీ ఆమె నేపాలీ బజార్‌లో వుందని, ఆమె దగ్గరకు వెళ్తే మన సాధువులను బాగా ఆదరిస్తుందని గోవిందానంద అన్నాక, నాకు కూడా గుర్తుకు వచ్చింది. శ్రీ స్వామి మేధానందపురి ఆ విషయం నాకు చెప్పారు.

ఆమె ఇల్లు కనుక్కుని వెళ్ళాము. ఆమె చాలా ప్రేమగా మాట్లాడి తమ దగ్గర